"మతాలమీద దాడిచెయ్యడమెందుకీ రాజా? వీటివల్ల అతనికివచ్చే ప్రమాదమేముంది? ఎవరిమతం వారిది."

పి. రాజగోపాలనాయుడుగారు 1920 లో చిత్తూరుజిల్లా దిగువ మాఘంలో పుట్టారు. అనంతపురం కళాశాలనుంచి బి. ఏ. డిగ్రీ పుచ్చుకొన్నారు. పల్లెటూరిబడిలో చదువుకొనేనాటినుంచే రచనలు—కథలు, వ్యాసాలు, నాటకాలు—వ్రాస్తూ వచ్చారు. సాహిత్యవ్యాసంగంతోబాటు రాజకీయవ్యాసంగంకూడా చేస్తు న్నారు. సాహిత్యవిమర్శలో ప్రత్యేకశ్రద్ధ పెడతారు. పిల్లలకు, పెద్దలకుకూడ చాలా పుస్తకాలు వ్రాశారు. ఒకటి రెండు మాత్రమే అచ్చయాయి. మిగిలినవి అచ్చుకు ఎదురుచూస్తున్నాయి. వీరు కవితలుకూడ కొన్ని వ్రాశారు. 'కురుక్షేత్ర' అనే వీరి విమర్శ గ్రంథమొకటి అచ్చులో ఉంది.

'మాత్రాఛందస్సు' అనే ఒక లక్షణగ్రంథంకూడా వీరు వ్రాశారు.

RAMANUJUNI PRATIGNA

By

P. RAJAGOPALA NAIDU

Publishers:
M. SESHACHALAM & CO.

First Edition:
April, 1969

Printers:
FREEDOM PRESS,
MADRAS-21

Cover Design:
BAPU

Distributors:
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
Rashtrapathi Road, Secunderabad

Rs. 2/-




75

'మాతృశ్రీ'

శ్రీమతి భారతీదేవి రంగాగారికి.

# ఒక మాట



దక్షిణదేశంలో ప్రభవించి అఖిలభారతఖ్యాతినేగాక ప్రపంచ విఖ్యాతి నార్జించిన ఆచార్యత్రయంలో శ్రీ రామానుజాచార్యు లొకరు. వారు పతితజనోద్ధరణ గావించారు. అస్పృశ్యులకు సంఘంలో ఒకస్థానాన్ని కల్పించి వారికి శ్రీ వైష్ణవులని నామకరణం గావించారు.

అంతేగాక వారు మహనీయులైన శ్రీ యామునాచార్యులు కలలుగన్న విశిష్టాద్వైతాన్ని నిర్వచించి దానిని ప్రచారం గావించడంలో ఎన్నోకష్టాల నెదుర్కొన్నారు. నిరంకుశుడైన, భయంకరుడైన చోళరాజుయొక్క దమన విధానాన్ని తట్టుకొని తనమతాన్ని ప్రచారం గావించారు.

ఆనాడు జరిగిన పోరాటం మతస్వాతంత్ర్యంకోసం జరిగిన పోరాటం. ప్రాథమికస్వత్వాలకోసం జరిగిన ఉద్యమం. ఆ మహోద్యమంలో తుదకు శ్రీ రామానుజాచార్యులే జయించారు.

ఇదే యీ నవల యితివృత్తం.

శ్రీ రామానుజాచార్యుల్నిగూర్చి ఎన్నో గ్రంథాలు వ్రాయబడివున్నాయి. అవి చాల చక్కగాగూడ వున్నాయి. అయినప్పటికీ నాకుగూడ ఆ మహానుభావుని చరిత్రను వ్రాయాలనిపించింది. ఆనాడు జరిగిన ఉద్యమాన్ని,

ఆ ఉద్యమవిజయంకోసం వేలాదిమంది గావించిన త్యాగాలను చిత్రించాలనిపించింది. అందుకే నే నీ నవలను వ్రాశాను.

దీనిని వ్రాసేముందు నేను కొంత పరిశోధన గావించాను. ఇందులో కూర్చబడిన సంఘటనలకన్నిటికీ చారిత్రకాధారాలను సేకరించాను. ప్రస్తుతం మనకు లభ్యమవుతున్న దక్షిణదేశచరిత్రలను, మదరాసు, మైసూరురాష్ట్రాల రాజ్యపత్రాలను, తిరుపతి, దాక్షిణాత్యశిలాశాసనాలను, శ్రీ తాతాచార్యులుగారు తదితరులు రచించిన తిరుపతి చరిత్రను కూలంకషంగా పరిశీలించి ఈ నవలకు కావలసిన ఆధారాలను సేకరించాను.

ఇందులోవున్న ఘట్టాలన్నీ చరిత్రకు సంబంధించినవే. ఇందులోని పేర్లుగూడ. ఏ ఒకటో రెండో తప్ప, చాలవరకు చారిత్రక గ్రంథాలలో లభ్యమయ్యేవే.

ఇది ఒక క్రొత్త ప్రయోగం.

దీని నందరూ గుర్తిస్తారని, ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

పి. రాజగోపాల నాయుడు.

# 1

## తిరుమంత్రం

అది శ్రీరంగం. ఆ పుణ్యక్షేత్రం పురాణయుగం నుండి ప్రసిద్ధి చెందింది. ఎందరో మహానుభావులు, ఎందరో మహాపురుషులు ఆ క్షేత్రాన్ని దర్శించి వున్నారు.

శ్రీరంగం పరిసరాలలోనే ఒక చిన్న వనమున్నది. ఆ వనం చాలా ప్రశాంతంగా వున్నది. అందులో ఒక మహా వృక్షం క్రింద ఒక ఎత్తైన తిన్నెమీద శ్రీరామానుజుడు కూర్చుని వున్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో అతడు దేనినిగూర్చో దీర్ఘంగా ఆలోచిస్తు న్నాడు. ఆ సమయంలో అచ్చటున్న చెట్లు, తీవెలు, పూలు అన్నీ ఆలోచనలో పడి వున్నట్లే ఉన్నవి.

రామానుజుని లలాటం వర్చస్సుతో వెలిగిపోతున్నది. అతడు ధరించిన ఊర్ధ్వపుండ్రాలు అతని ముఖాని కెంతో అందాన్ని చేకూరుస్తున్నాయి. అతనిమీద పడుతున్న సంధ్యారేఖలు ఆ అందాన్ని మరికొంత హెచ్చిస్తున్నాయి. దీర్ఘాలోచనలో ఉన్న రామానుజుడు ఒక మహా పురుషుడులాగా కనబడుతున్నాడు.

రామానుజుడు రెండు మూడు గడియలనుండి అలాగే ఆలో చిస్తున్నాడు. కాని అతని ఆలోచన ఒక దరికి రాలేదు. ఆనాడే గాదు. అత డెన్నో దినాలనుండి ఆలాగే ఆలోచిస్తున్నాడు. కాని ఆ ఆలోచన తెగలేదు.

రామానుజుని ఆలోచన ఐహిక విషయాలకు సంబంధించి నది గాదు. అది సృష్టిస్థితిలయాలకు సంబంధించినది. పారమార్థిక విషయాలకు సంబంధించినది. అందువల్ల అత డంత త్వరగా ఒక

నిర్ణయానికి రాలేక పోతూన్నాడు. ఆలోచించిన కొద్దీ అతనికున్న సందేహాలు మరింత హెచ్చవుతున్నాయి. కాని అతడు తన ఆలోచనను మానలేదు. ఎప్పటిలాగే ఆనాడు గూడ అత డాలోచనలో నిమగ్నమయి ఉన్నాడు.

అతడు వేదాలను చదివాడు. వేదాంగాలను పఠించాడు. బ్రాహ్మణాలను వల్లించాడు. ప్రస్థానత్రయమయిన ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రాలను, భగవద్గీతను క్షుణ్ణంగా పరిశీలించాడు. కాని సృష్టికి సంబంధించి అతని కానాటికిగూడ ఒక నిశ్చితమైన అభిప్రాయం కలగలేదు.

వేదవేదాంగాలను, ఉపనిషత్సూత్రాలను, భగవద్గీతను ఆది శంకరుడు వ్యాఖ్యానించి ఉన్నాడు. అతడు తన వ్యాఖ్యానాల ద్వారా అద్వైతమతాన్ని ప్రచారం గావించి ఉన్నాడు. ఆత్మ పరమాత్మల కున్న సంబంధాన్నిగూర్చి, ఈ ప్రపంచాన్నిగూర్చి అతడు తన అభి ప్రాయాలనెంతో స్పష్టంగా చెప్పి ఉన్నాడు. తనకున్న అశేష శేముషీ ధురంధరత్వం వల్ల, తర్కశాస్త్రంలో తనకున్న అతులిత ప్రావీణ్యం వల్ల, అనన్యమైన తన పాండిత్యంవల్ల, నిరర్గళమైన, నిరుపమాన మైన, అద్వితీయమైన తన వాక్పటిమవల్ల అతడు మాయా వాదాన్ని సృజించి, ఆ వాదం ద్వారా తక్కిన వాదాల నన్నిటినీ పరాస్తం గావించాడు. ఆ బాలయోగి వచనా చమత్కృతికి, అతని వాదనా పటిమకు ఆనాడు భారతదేశంలో ప్రాబల్యం వహించివున్న బౌద్ధ, జైన, శాక్తేయ, కాపాలిక మతాలన్నీ వణకిపోయినవి. ఆ మతా చార్యు లందరు అతనికి దాసోహ మనవలసి వచ్చింది. అత డొక మహాపురుషుడు. కాని, .........

శంకరుడు ప్రతిపాదించిన అద్వైతమతం లోపరహితమని తా ననుకోలేకున్నాడు రామానుజుడు. ఆ వాదంలో ఎన్నో వైరుధ్యా లతనికి కనబడుతున్నాయి. ఆ మతాన్ని అత డంగీకరించ లేకున్నాడు. తరచి చూచినకొద్దీ అతని కా మతం తర్కానికి నిలిచేదిగా తోచడం లేదు. అందుకే దానినిగూర్చి అతడంతగా ఆలోచిస్తున్నాడు.

తన గురువైన యాదవప్రకాశుడు అద్వైతమతానికొక మూల స్తంభమే. దానిని కాదనడాని కెవరికీ సాధ్యంకాదు. కాంచీపుర పరిసరప్రాంతాలలో ఆ మతాన్ని గూర్చి సాధికారంగా చెప్పగలవారు మరెవ్వరూ లేరు. కాని ఆతడు గూడ తన సందేహాల్ని తీర్చలేక పోయాడు. తీర్చమని అడిగినప్పుడు తనమీద కోపించుకొన్నాడు. చెప్పింది వినాలి గాని ప్రశ్నవేయడం తప్పన్నాడు. ప్రశ్న వేసినందుకు తన్ను నిందించాడు. తన సమ్ముఖాని కిక రావద్దన్నాడు.

ప్రశ్నించడమే తప్పా? ప్రశ్నించకుండా సందేహ మెలా తీరుతుంది? ప్రశ్నించకుండా విజ్ఞాన మెలా కలుగుతుంది? ఏ మతానికైనా ప్రశ్నల కన్నిటికీ సమాధాన మివ్వగల శక్తి ఉండాలి. లేకపోతే అది మతమే కాదు. అది సత్యంకాదు. ఆదిశంకరుడు గూడ ఒకనాడు ప్రశ్నలతో బయలుదేరినవాడే. తర్కానికి మూలం ప్రశ్న. దాన్ని కాదంటే యెలా?

ప్రశ్న వేసినప్పుడు సమాధానం తోచకపోవచ్చు. కాని కొంత ఆగి, ఆలోచించి సమాధానం చెప్పాలి, అంతేకాని ప్రశ్న వేయవద్దంటే అజ్ఞానంలోనే ఉండిపొమ్మని. తాను చెప్పింది అంగీకరించమని. అదే సత్యమని విశ్వసించమని. ఒకడు చెప్పినదాని నంతటినీ సత్యమని నమ్మేటట్లయితే ప్రతివారు చెప్పనవీ సత్యమనే నమ్మవలసి ఉంటుంది. అదెలా వీలవుతుంది? అందుకనే తాను తన గురువు చెప్పిన దాని నంగీకరించలేదు. గురువు చెప్పినంతమాత్రాన అది సత్యం కాబోదు. అది తర్కానికి, నిర్ధారణకు నిలవ గలిగి ఉండాలి. ప్రమాణాలచేత ఋజువుచేయ గలిగివుండాలి. లేకుంటే అది సత్య మెలా అవుతుంది?

మహాపురుషులందరూ సత్యం కోసమే అన్వేషించారు. మహర్షులుగూడ ఆ సత్యం కోసమే తపస్సు గావించారు. తాము నమ్మినదానిని వారు ప్రచారం గావించారు. ఇదే సత్యమని వారెన్నడూ చెప్ప ఉండలేదు. కాని తన గురువైన యాదవప్రకాశుడు మాత్రం ఆది శంకరుడు చెప్పిన అద్వైతాన్నే ఉన్నదున్నట్లుగా నమ్మమంటాడు. నమ్మనంటే కోపగించుకొంటాడు. అది రామానుజాని కే మాత్రం యిష్టం లేదు.

మహాభాగుడైన యామునాచార్యుడుగూడ అద్వైతాన్ని అంగీకరించలేదు. అత డాతత్వాన్ని ప్రశ్నించాడు. ఆ మతంమీద తనకున్న సందేహాలను వ్యక్తీకరించాడు. కాని అత డిప్పుడులేడు. అత డున్నట్లయితే తన సందేహాలనన్నిటినీ నివృత్తిగావించి వుండేవాడు.

యామునాచార్యుడు కాంచీపురానికి వచ్చినప్పుడు రామానుజుడు చాల చిన్నవాడు. అతని కెదురేగి అత ణ్ణాహ్వానించడానికని తన గురువైన యాదవప్రకాశునితో అతడుగూడ వెళ్ళివున్నాడు. ఆనా డతనికి సాష్టాంగదండప్రణామం గావించివున్నాడు. అతనివద్ద ఆశీస్సుల్నిగూడ పొందివున్నాడు. ఆ ఆచార్యు డతని శిరంమీద హస్తాన్నుంచి 'చిరంజీవి వగుదువుగాక' అని ఆశీర్వదించినప్పు డతడు పులకించివున్నాడు. కాని అప్పు డతనితో చర్చగావించే ధైర్యం రామానుజునికిలేదు. అప్పు డతని మనస్సు అంత పరిపక్వ దశకుగూడ రాలేదు. యాదవప్రకాశు డతణ్ణి వదలివేసిన తరువాత అతడు ఆ ఆచార్యుణ్ణి కలుసుకోవడానికని శ్రీరంగానికి వచ్చాడు. అదే అతడు మొట్టమొదట ఆ క్షేత్రానికి రావడం. కాని అప్పటికే ఆ ఆచార్యుడు మరణించివున్నాడు. అందువల్ల రామానుజుని కానా డెంతో ఆశాభంగం కలిగింది. కనుకనే అత డానాడు శ్రీరంగంలో వుండకుండా కాంచీపురానికి వచ్చివేశాడు.

యామునాచార్యుడు లేనికొరత రామానుజునికి చక్కగా తెలిసివచ్చింది. అత డున్నట్లయితే తన సందేహాల వన్నిటినీ అతడు నివృత్తిగావించి వుండేవాడు. ఆయదృష్ట మింకరాదు. కనుక తానే తన ధ్యానంద్వారా, దీర్ఘాలోచనలద్వారా, శ్రుతుల్ని క్షుణ్ణంగా పరిశీలించడంద్వారా తన సందేహాలను నివృత్తిగావించుకోవలసివుంటుంది.

రామానుజు డాలాగే ఆలోచించసాగాడు. అతనిముందు ఒక ప్రశ్న గోచరించింది. తరువాత మరొకప్రశ్న అతణ్ణెదుర్కొన్నది. వేదాలు మొదలైన ప్రమాణాలు సత్యాలా, కావా? అద్వైతులు చెప్పినట్లవి సత్యాలు కాకపోతే వాటిద్వారా సత్యాన్ని తెలుసుకోవడానికి వీలవుతుందా? అలా వీలుకానప్పుడు ఆదిశంకరుడు వ్రాసిన వేద భాష్యాలన్నీ అసత్యాలేనా? అతని కేమీ తోచలేదు.

ఇంతలో అతనికి మరొక ప్రశ్న ఎదురయింది. ప్రకృతికి, అనుభూతికి ఉన్నసంబంధమేమిటి? అనుభూతి స్వతస్సిద్ధమైనదా, కాదా? అత డాలోచనలో మునిగిపోయాడు. ఆ ఆలోచనలో ఎన్నో ప్రశ్న లుత్పన్నమయినవి. జీవాత్మ, పరమాత్మ అనేవి వేరువేరా? లేక ఒకటేనా? బ్రహ్మపదార్థమంటూ ఒకటుందా? ఉంటే అది సగుణమా? నిర్గుణమా? ఆదిశంకరు డన్నట్లు యీ ప్రపంచం బ్రహ్మ ప్రతిబింబమేనా? కనబడే ఈ చరాచరసృష్టి అంతా ఒక మాయేనా? అవిద్య అంటే ఏమిటి? ఈ అవిద్యనుండి తరించడ మేలాగా? యీలాటివే మరెన్నోప్రశ్న లతని మనస్సును వేధింప సాగాయి. ఎంత ఆలోచించినా అతనికి సందేహాలు కలుగుతున్నాయి గాని, సమాధానాలుమాత్రం లభించడంలేదు.

రాను రాను సంధ్యాకిరణాలు పలచబడసాగినవి. చందమామ తిన్నగా గగనమార్గంలోకి రాసాగాడు. తెల్లనివెన్నెల ఆ వనాన్ని ఆక్రమించుకోసాగినవి. కాని రామానుజుడుమాత్రం ఇంకా ఆలో చిస్తూనే ఉన్నాడు. అది ఒకనిష్ఠ. అది ఒకరకమైన సమాధి. ఒక విధమైన తపస్సు. ఆ వనంలోని ప్రశాంతత ఆనిష్ఠకు, ఆ సమాధికి, ఆ తపస్సుకు బలాన్ని చేకూరుస్తున్నది.

తన సందేహాలకన్నిటికీ సమాధానా లెచ్చట లభిస్తాయి? యామునాచార్యు డిప్పుడులేదు. కాని యామునాచార్యుని శిష్యులు చాలమంది ఉన్నారు. ఆ ఆచార్యుని బోధలు వారికి తెలిసి ఉంటాయి. వారిద్వారా ఆ సందేహాలను నివృత్తి గావించుకొనడానికి వీలవుతుంది.

అందుకనే తాను యామునాచార్యుని ప్రధాన శిష్యుడైన గోష్ఠీ పూర్ణుణ్ణి ఆశ్రయించాడు. కాని అతడు రేపురమ్మని, మాపురమ్మని చెపుతున్నాడు. ఇప్పటి కిరవైసార్లు తిప్పిపంపి ఉన్నాడు. కనీసం తిరుమంత్రాన్నైనా తనకు చెప్పమంటే చెప్పలేదు. తనకింకా పరి పక్వదశ రాలేదంటాడు. అది అతి రహస్యమంటాడు. దాని నంత సులభంగా చెప్పకూడదంటాడు.

నిజంగా అది అంత రహస్యమైనదా? దానిని నేర్చుకొనడానికి తన కర్హతలేదా? ఆదశ తనకు రాలేదా? ఆమంత్రం ఎందు

కంత రహస్యంగా ఉంచబడింది? అతని కాప్రశ్నకు సమాధానం లభించలేదు. బహుశా ఆ మంత్రం తెలిస్తే మోక్షం సిద్ధిస్తుందని గాబోలు ఎవరికంటే వారికి దానిని చెప్పడంలేదు.

ఏవిధంగానైనా ఆ మంత్రాన్ని తెలుసుకోవాలని రామానుజునికి పట్టుదలగా ఉంది. గోష్ఠిపూర్ణ ఎన్నిమార్లు అతణ్ణి తిప్పిపంపాడో అంత పట్టుదల ఎర్పడుతున్నది రామానుజునిలో. ఏవిధంగానైనా ఆ మంత్రాన్ని తాను నేర్చుకోవాలి తాను నేర్చుకోవాలి. తాను నేర్చుకోవాలి.

ఆ మంత్రంకోసం అతని మనస్సు ఆరాటపడజొచ్చింది. గోష్ఠిపూర్ణ ఎన్నిమార్లు తన్ను తిప్పిపంపినప్పటికీ తాను విసుగు చెందగూడదు. బహుశా ఆ ఆచార్యుడు తన పట్టుదలను పరీక్షిస్తున్నాడేమో అందువల్ల తప్పనిసరిగా తానాపరీక్షకు నిలబడితీరాలి. అందులో తాను నెగ్గితీరాలి. వందమార్లుగాదు. వేయిమార్లైనా ఫరవాలేదు. ఆ మంత్రాన్ని తాను నేర్చి తీరవలసిందే. అతడు దృఢనిర్ణయం గావించుకున్నాడు ఉదయంలేచి తిరుక్కొట్టియూరుకు వెళ్ళి గోష్ఠిపూర్ణుణ్ణి కలుసుకోవాలనుకొన్నాడు.

రాత్రి శయనించినప్పుడుగూడ రామానుజుని మనస్సు ఆ తిరుమంత్రంమీదనే ఉంది. దానిని తెలుసుకొనేవరకూ అతని మనస్సు శాంతించేటట్లు కనబడలేదు.

ఉదయంలేస్తూనే రామానుజుడు కావేరీనదిలో స్నానం గావించాడు. ఊర్ధ్వపుండ్రాలను ధరించాడు. సంధ్యవార్చాడు. కావేరీ తీర్థాన్ని సేవించి తిరుక్కొట్టియూరుకు ప్రయాణమయ్యాడు.

మార్గమధ్యంలో రామానుజుని కెన్నో ఆలోచనలు తోచినవి. గోష్ఠిపూర్ణుడు ఈమారైనా కరుణిస్తాడో లేదో? అతను తిరుమంత్రాన్ని చెప్పకపోతే తనేమి చేయాలి? మరలా శ్రీరంగానికి రావాలా? పనిలేదా? వచ్చిమాత్రం ప్రయోజనమేమున్నది? ఆ మంత్రాన్ని తెలుసుకునేవరకు తిరుక్కొట్టియూరులోనే ఎందు కుండ గూడదు? ఈలాగా ఆలోచిస్తూ వెళ్ళాడు రామానుజుడు.

రామానుజుడు వెళ్ళేసరికి గోష్ఠిపూర్ణులింటివద్దనే ఉన్నాడు. ఆతణ్ణి చూస్తూనే రామానుజుడు నమస్కరించాడు. దగ్గరికివెళ్ళి సాష్టాంగపడ్డాడు. గోష్ఠిపూర్ణు డతణ్ణి ప్రేమతో లేవనెత్తాడు. లేవనెత్తి హృదయపూర్వకంగా కౌగిలించుకున్నాడు.

గతసారి రామానుజుడు వచ్చి తిరుమంత్రాన్ని చెప్పమని తన్ను డిగినప్పుడా ఆచార్యుడు మరొకసారి రమ్మని అన్నాడు. అప్పుడు రామానుజుని ముఖం నల్లబడడాన్ని, అతని నెమ్మోములో విషాదం కాండవమాడడాన్ని తాను చూచి ఉన్నాడు. మారుమాట్లాడకుండా ఆనా డతడు వెళ్ళిపోతుంటే గోష్ఠిపూర్ణుని మనస్సు చివుక్కుమన్నది. పాపం, రామానుజు డతనివద్దకు సుమారు ఇరవైసార్లైనా వచ్చి ఉంటాడు. అలా వచ్చినప్పటికీ అతడు తిరుమంత్రాన్ని తనకి చెప్ప టాని కేమాత్రం అంగీకరించలేదు. అలా చెప్పక... అతని కిష్టంలేక కాదు. రామానుజుణ్ణి పరీక్షిద్దామనే ఉద్దేశంతోనే అత డలా అన్నాడు, కాని రామానుజుడు విచారంతో వెనుదిరిగి వెళ్ళినప్పు డతని మనస్సు ద్రవించిపోయింది.

రామానుజు డన్నిసార్లు వచ్చినందువల్ల అతని కెంతో పట్టు దల ఉన్నట్లు అర్థమయింది గోష్ఠిపూర్ణునికి. ఇక అతణ్ణి నిరాకరించ గూడదనుకొన్నాడు. కాని తన మనస్సును బయటపెట్టకుండా 'వచ్చినదెందు'కని ప్రశ్నించాడు రామానుజుణ్ణి.

'నేను చెప్పవలసినపనేమున్నది ? మీ కన్నీ తెలిసేవున్నవి' అన్నాడు రామానుజుడు.

'తిరుమంత్రంకోసం వచ్చావా?' అని అడిగాడు గోష్ఠిపూర్ణుడు. అతని పెదవులపై మందహాసం తోచింది.

'ఆ' అన్నట్లుగా తల వూపాడు రామానుజుడు.

గోష్ఠిపూర్ణుడు రామానుజుని హస్తాన్ని పట్టుకొని లోనికి తీసుకొని వెళ్ళాడు.

'మంత్రాన్ని చెబుతాను. ఎవరికీ చెప్పవుగదా?' అన్నాడు గోష్ఠిపూర్ణుడు.

ఆమాట వింటూనే రామానుజుని గుండె ఉప్పొంగింది. తన ఆశ నెరవేరుతున్నదనే ఆనందంతో అతడు తన్మయత్వం పొందాడు. అందువల్ల అతడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

'ఈ మంత్రాన్ని ఇతరుల కెవ్వరికీ చెప్పగూడదు చెబితే రౌరవనరకంలో పడతావు' అన్నాడు గోష్ఠీపూర్ణుడు గంభీరంగా.

రామానుజుడు వింటున్నాడు.

'ఇది చాల రహస్యం వేదరహస్యం. దీనిని బయటపెడితే దేవతలు కోపిస్తారు. శపిస్తారు. శిక్షిస్తారు.'

'బయటపెట్టను' అన్నాడు రామానుజుడు.

'నీమీది విశ్వాసంతో యీ తిరుమంత్రాన్ని నీకు చెబుతున్నాను నేను నీమీద ఉంచిన విశ్వాసాన్ని నిలుపుకొంటావను కొంటాను.' అన్నాడు గోష్ఠీపూర్ణుడు.

'అలాగే' అన్నాడు రామానుజుడు. అతని ఆనందానికి మేర లేకపోతున్నది.

గోష్ఠీపూర్ణుడు చుట్టుప్రక్కల చూచాడు. ఎవ్వరూ లేరు. ద్వారంవద్దకు వెళ్ళి వెలుపల చూచాడు. ఎవ్వరూలేరు. లోనికి వచ్చి రామానుజుణ్ణి కౌగిలించుకొన్నాడు. రహస్యంగా చెవిలో తిరుమంత్రాన్ని ఉపదేశించాడు. ఆ ఉపదేశాన్ని పొందుతున్నప్పుడు రామానుజు డెంతో ఆనందాన్ని పొందాడు. తన జీవితాశయాలలో ఒకటి ఫలించినందు కెంతో తృప్తిచెందాడు.

మంత్రోపదేశమయిన వెంటనే గోష్ఠీపూర్ణుడు 'ఎవరితోనూ చెప్పవు గదా!' అన్నాడు.

'చెప్ప'నన్నట్లు తల వూపాడు రామానుజుడు.

మందస్మిత వదనుడై చూచాడు ఆయన.

సాష్టాంగ దండప్రణామం గావించాడు అతడు.

అతణ్ణి లేవనెత్తి ఆశీర్వదించాడు ఆయన.

వెళ్ళడానికి సెలవిమ్మన్నాడు అతడు.

భోజనం గావించి వెళ్ళమన్నాడు గోష్ఠిపూర్ణుడు.

భోజనా లయిన తరువాత రామానుజుడు గోష్ఠిపూర్ణునివద్ద సెలవు తీసుకున్నాడు. ఎంతో ఆనందంతో ముందుకు వెళ్ళసాగాడు.

వెడుతున్నప్పుడు రామానుజుని హృదయం అమందానందంతో నృత్యం గావింపసాగింది. అతని నేత్రాలు తేజంతో నిండి పోయినవి. అతని నెమ్మోము కళలు విరజిమ్మసాగింది. తానొక నూతనజన్మము నెత్తినట్లు భావించాడతడు.

వీధిలో వెడుతూ వున్నాడుగాని అతనిమనస్సెక్కడో వున్నది.

అతడు తా నెన్నో దినాలనుండి ఆశించిన తిరుమంత్రాన్ని నేర్చుకొన్నాడు. అతని ఆశయం సిద్ధించింది. ఆ ఆలోచనే అతని కెంతో ఆనందాన్ని కలిగించింది.

తిరుమంత్రం అంత రహస్యమైనదా? కాదనిపించిం దతనికి. అది యెవరికీ చెప్పగూడనిదా? చెప్పతగినదే ననిపించింది. దాని నితరులకు చెబితే నరకం వస్తుందా? రాదనిపించిం దతనికి. ఒక వేళ వచ్చినా బాధ లేదనిపించింది.

తా నా మంత్రాన్ని ఎవరికీ చెప్పనని మాట యిచ్చి వున్నా డతడు గోష్ఠిపూర్ణునికి. ఇప్పుడు దాని నితరుల కెలా చెప్పడం?

తిరుమంత్రాన్ని విన్నవారందరూ మోక్షానికి వెళుతారని ప్రసిద్ధి. మోక్షాన్ని పొందాలంటే ఎన్నో కష్టసాధ్యమైన సాధనలు చేయవలసి వుంటుంది. కాని తిరుమంత్రాన్ని జపిస్తే ఆ సాధనలన్నీ అవసరమే లేదు. అందువల్ల ఆ మంత్రం అందరికీ తెలిస్తే వారందరూ మోక్షాన్ని పొందగలుగుతారు. అంతకంటె కావలసిందేమున్నది? అతని హృదయం తళుక్కుమన్నది.

తా నా తిరుమంత్రాన్ని బయటపెడితే తనకు నరకం ప్రాప్తిస్తుందని అన్నాడు గోష్ఠిపూర్ణుడు. ప్రాప్తిస్తే మాత్రమేమి? లక్షలాది ప్రజలు మోక్షానికి వెళ్ళేది నిజమైతే తాను నరకానికి వెళ్ళినా ఫరవాలేదు. అంతమందికి జన్మరాహిత్యం కలిగిందనే ఆనందంతో ఆ నరకాన్ని సులభంగా తరించవచ్చు. అనుకొన్నాడు

రామానుజుడు. అప్పు డతని మన స్సెంతో ఆనందాన్ని అనుభ వించింది.

'ఈ మంత్రాన్ని నే నందరికీ చెబుతాను. చెప్పివేస్తాను.' అత నికి తెలియకనే అతని నోటినుండి ఆ మాటలు వెలువడ్డాయి. అత డా ఆలోచనతోటే ముందుకు వెళ్ళాడు. అంతలో ఎదురుగా ఒక దేవాలయం కనబడింది. అప్పు డతని కొక తలపు కలిగింది. తన చుట్టూ చూచాడు. ఆ వీధిలో ఎవరో ఒక రిద్దరు మాత్రమే కనబడు తున్నారు. ఆ మంత్రాన్ని వారికి మాత్రమే చెప్పడాని కతని కిష్టం లేక పోయింది. ఆ గ్రామంలోని ప్రజల కందరికీ ఒకేసారి దానిని చెప్పా లనిపించింది.

ఆ ఆలోచనతో, ఆతురతతో ముందుకు వెళ్ళసాగాడు రామా నుజుడు. దేవాలయాన్ని సమీపించాడు. లోనికి వెళ్ళాడు. దేవుడు నవ్వుతున్నాడు. తనని ఆశీర్వదిస్తున్నాడు.

రామానుజుడు దేవునికి నమస్కరించాడు. కళ్ళు మూసుకుని అనుజ్ఞ వేడాడు. కళ్ళు తెరిచేసరికి 'భయంలేదు. వెళ్ళి చెప్పు' అన్నట్లనిపించింది. కాని అచ్చ టెవ్వరూ లేరు. గ్రామస్థుల నంద రినీ అచ్చటికి రప్పించే దెలాగా ? మొట్టమొదట అతని కేమీ తోచ లేదు. ముందుకు చూచాడు. గాలిగోపురం కనిపించింది. ఆ గోపురం పైకి ఎక్కి కేకవేస్తే——

కేకవేస్తే అందరూ వస్తారు. అప్పు డందరికీ ఒకేమారు ఆ తిరుమంత్రాన్ని చెప్పవచ్చు. ఆ ఆలోచన అతనికి నచ్చింది. కాని అత డెన్నడూ ఎత్తైన చెట్టునుగాని, గోడల్నిగాని ఎక్కివుండలేదు. ఆ గాలిగోపురాన్ని తా నెక్కగలడా ? అతనికి సందేహం వేసింది. వెంటనే శ్రీరంగం శ్రీనివాసుణ్ణి తలచుకొన్నాడు. అతని కెంతో ధైర్యం వచ్చింది. 'ఆ గాలిగోపుర మెంత' అనిపించింది. వెంటనే దాని నెక్కడానికి ప్రారంభించాడు. అలా ఎక్కడం అతనికేమీ కష్ట మనిపించలేదు.

రామానుజుని కిప్పుడు ఆకాశంలో విహరిస్తున్నట్లుంది. ఆ గ్రామంలో వున్న యిండ్లన్నీ స్పష్టంగా కనిపించాయి. గోష్ఠీపూర్ణుని

యిల్లుగూడ కనిపిస్తూనే వుంది. వీథుల్లో వస్తూపోతున్న ఒకరిద్దరు వ్యక్తులు గూడ అతని కగపడ్డారు

అతదు గట్టిగా వారిని పిలిచాడు. వారి కతని పిలుపు వినబడింది గాని వారు తమ పనిమీద వెళ్ళసాగారు. ఈసారి అతడు చేతులుతట్టి బిగ్గరగా పిలిచాడు. వెడుతున్నవారు నిలబడి చూచారు. మరలా పిలిచాడు రామానుజుడు వెడుతున్నవారు తిన్నగా అచ్చటికి వచ్చారు. ఆ పిలుపుల్ని విని వారే గాక ఇండ్లలో వున్నవారు గూడ రాసాగారు. రామానుజుడు మరల బిగ్గరగా అందరినీ రమ్మని అర్థించాడు. అప్పు డితరులుగూడ వచ్చారు. అచ్చట చేరుతున్న గుంపును చూచి మరికొందరు వచ్చారు.

ఆ గ్రామానికి ఆనుకొని కొన్ని గజాలలో పంచముల పల్లె ఉంది. అచ్చట ఉన్నవారుగూడ పల్లె వెలుపలికి వచ్చి నిలిచారు. కొంతసేపట్లో గ్రామంలో ఉన్న వారిలో చాలమంది అచ్చటికి వచ్చి చేరారు.

వారిని చూస్తూనే రామానుజుని మనస్సు ఉప్పొంగింది. అతడు గట్టిగా వారికి తిరుమంత్రాన్ని చెప్పసాగాడు. తాను చెబుతున్నదానిని వారిని గూడ చెప్పమన్నాడు. వారు మొదట వింతగా పైకి చూచారు. కాని తరువాత అతని గొంతుతో గొంతు కలిపి ఆ మంత్రాన్ని చెప్పసాగారు. అవలనున్న పంచములలో గూడ ఒకరిద్దరు అతడు చెప్పినట్లు చెప్పసాగారు.

ఇంతలో గోష్ఠీపూర్ణు డచ్చటికి వచ్చాడు. అచ్చట వున్న గుంపును చూచాడు. వారు చెబుతున్న మంత్రాన్ని విన్నాడు. వారు తిరుమంత్రాన్ని వల్లిస్తున్నారు; వారి కది ఎలా తెలిసింది? గోపురం పైన నిలబడి రామానుజు డా మంత్రాన్ని చెబుతున్నాడు. దానిని అచ్చటున్నవారు వల్లిస్తున్నారు, వారేగాదు, పంచములు గూడ దానిని వింటున్నారు. వారిలో ఒకరిద్దరు గట్టిగా ఆ మంత్రాన్ని చెబుతున్నారు.

ఆ దృశ్యాన్నిచూచి గోష్ఠీపూర్ణుడు మొదట స్తబ్ధుడయ్యాడు. ఆ తరువాత కంపించాడు. అటుపిమ్మట కోపంతో ఎలుగెత్తి, 'దుర్మా

ర్ుడా! ఆగు. ఇదా నీవు చేసేది?' అన్నాడు మండిపడుతూ, రామానుజుణ్ణి చూచి.

కఠోరమైన ఆ మాటల్ని విని అచ్చటున్న ప్రజలందరూ ఒక్కసారి ఆగి గోష్ఠిపూర్ణునివైపు చూచారు. అతడు ప్రళయకాల రుద్రునిలాగా మండిపడుతున్నాడు.

రామానుజుడు తిరుమంత్రాన్ని చెబుతూనేవున్నాడు. అలా చెప్పడంలో అతడు తన్మయత్వం చెందివున్నాడు.

'ఆగుతావా లేదా? నీశిరస్సు వేయివ్రక్కలవుతుందిచూచుకో.' మరలా గోష్ఠిపూర్ణుని కర్కశవాక్యాలు ఆ గోపురాన్ని తాకి గట్టిగా ప్రతిధ్వనించాయి. అప్పుడు రామానుజు డతణ్ణి చూడగలిగాడు.

'ఆగు. పాపీ! ఆగు. నీకు నరకంతప్ప గత్యంతరంలేదు,' అన్నాడు గోష్ఠిపూర్ణుడు.

గోష్ఠిపూర్ణుడంటే ఆ గ్రామంలో వున్నవారికందరికీ భక్తిగాక భయంగూడ వుంది అందువల్ల అతని క్రోధారుణనేత్రాలనుచూచి, వణికిపోయారు. అతని కేకల్ని విని దద్దరిల్లారు. కొంచెం పక్కకు ఒదిగి నిలచారు.

రామానుజుడు తిన్నగా గోపురం దిగి కిందికి వచ్చాడు. 'ఇదేనా నీవు చేసేది? నీవిచ్చినమాట యేమయింది?' అని గర్జించాడు గోష్ఠిపూర్ణుడు.

రామానుజు డతనికి సాష్టాంగపడి, మన్నించమన్నాడు.

'నీలాటిపాపిని నేను మన్నించినా దైవం మన్నించదు. నీకు నరకప్రాప్తి తప్పదు' అన్నాడాయన.

రామానుజుడు లేచి, 'మహానుభావా, నాకు నరకప్రాప్తి కలిగినా కలగనీ, వీరందరూ మోక్షానికి వెళతారుగదా. నాకదేచాలు,' అన్నాడు.

గోష్ఠిపూర్ణు డొకనిమిషం స్తబ్ధుడై నిలబడ్డాడు, 'రామానుజుని కెంత ధైర్యం!' అతనికోపం మరింత విజృంభించింది.

'ఆ మంత్రాన్ని వీరికి చెప్పి నీవు దాని నపవిత్రంగావించావు. పంచములకు చెప్పి మరింత పాపానికి పాల్పడ్డావు,' అని గర్జించాడు.

'ఆ మంత్రం అపవిత్రం కాలేదు మహాభాగా. అది ప్రజల నోళ్ళలో బడి ఎంతో పవిత్రతను పొందింది.' అన్నాడు రామానుజుడు నవ్వుతూ.

గోష్ఠిపూర్ణునికి ఒళ్ళు తెలియలేదు.

'నీ యిష్టంవచ్చినట్లు మాట్లాడుతున్నావు. నీ అహంకారానికి హద్దులేనట్లున్నది.' అని ఉరిమాడు.

'మీరు పెద్దలు. నన్ను మన్నించాలి.' అన్నాడు శాంతంగా రామానుజుడు.

'నీకు మన్నింపంటూ ఒకటిలేదు. నీవు ఘోరపాపం గావించావు. దానికిక నిష్కృతిలేదు. తిరుమంత్రాన్ని కళంకితం గావించావు. దానికి తగిన ఫలితం నీవనుభవించి తీరవలసిందే. రౌరవాదినరకాలను పొంది తీరవలసిందే.' అంటూ అక్కడ ఉండ లేక గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు గోష్ఠిపూర్ణుడు.

వెడుతున్న గోష్ఠిపూర్ణుణ్ణి చూస్తూ నిలబడ్డాడు రామానుజుడు, మందహాసవదనంతో.

# 2

## అధికారంకోసం

యాదవప్రకాశుడు అద్వైత మతకర్తగా వున్నప్పుడు కాంచీ పురాన్ని వీరరాజేంద్రచోళుడు పరిపాలిస్తున్నాడు. వీరరాజేంద్రుడు గూడ అద్వైతమతస్థుడే. అందువల్ల ఆనాడు చోళరాజ్యం అద్వైత మతప్రాబల్యానికి లోనై వుండేది.

చోళరాజుల రాజధానీ నగరమైన కాంచీపురం ఆనాడు ఆ రాజుల ప్రాభవవైభవాలకు, వారి నాగరికతకు ప్రతిబింబంగా వుండేది. వారి రాజ్యంగూడ మండలాలుగా భాగించబడివుండేది. వాటిలో కాంచీపురమండలం, జయన్గొండచోళమండలం కొన్నిమండలాలు.

ఆ మండలాలు కొట్టాలుగా విభజింపబడిఉండేవి. అందులో తిరు వేంగడకొట్టం ఒకటి. ఆ కొట్టాలు నాడులుగా, ఆ నాడులు గ్రామాలుగా విభజితమై ఉండేవి. గ్రామాలు గ్రామసభలద్వారా, పంచాయితీలద్వారా పరిపాలింపబడుతుండేవి. ఆరోజుల్లో వారి పరిపాలనా విధానం చాలా సౌష్ఠవంగాను, ప్రశంసనీయింగాను ఉండేది.

వీరరాజేంద్రునిపాలనగూడ చక్కగానే జరిగింది. కాని అతని అంత్యదశలో అతని రాజ్యంలో - ముఖ్యంగా కాంచీనగరంలో-మత కలహాలు చెలరేగాయి.

ఆదిశంకరుని కాలంనుండి అద్వైతం - ముఖ్యంగా అతనిచేత ప్రతిపాదితమైన మాయావాదం - దక్షిణాపథంలో ప్రాబల్యంవహించి ఉండేది. వాటిని ప్రశ్నించడానికి ఎవరికీ ధైర్యంగూడ ఉండేదిగాదు. శ్రీరంగంలో యామునాచార్యుడు బయలుదేరి 'మాయావాద ఖండన' అనే గ్రంథాన్ని రచించిన తరువాత దానికి సవాలేర్పడింది. యామునాచార్యు డంతరించినప్పటికీ అతని శిష్యులైన ఆచార్యులు అతని సూత్రాలనుగూర్చి ప్రచారం గావించడం మానలేదు. ఆ సూత్రా లొక సిద్ధాంతాన్నిగాని, మతాన్నిగాని ప్రతిపాదించకపోయినప్పటికీ అద్వైతాన్ని విమర్శించడాని కవి బాగుగా తోడ్పడ్డాయి. అద్వైతం శైవమతానికి ప్రాతిపదికఅయితే యామునాచార్యుని వాదాలు, సూత్రాలు, రచనలు వైష్ణవమతానికి మూలకందా లయ్యాయి.

కాంచీపురంలో యాదవప్రకాశు డెంత ప్రతిభను ప్రకటించినప్పటికీ అచ్చటగూడ యామునాచార్యుని ప్రచారప్రాబల్యం తల యెత్తకుండా ఉండలేదు. యాదవప్రకాశుని శిష్యుడైన రామానుజుడే అతని వాదాన్ని తప్పుబట్టాడు. అతని సమన్వయాన్ని కాదన్నాడు. అతని వాదానికి ప్రతివాదం గావించాడు. అది ఆ గురువుకు చాలా కోపకారణమయింది. అందువల్ల రామానుజు జ్ఞతడు తరిమివేశాడు. కాని అతని ప్రాబల్యాన్నిమాత్రం తుడిచిపెట్టలేకపోయాడు.

రామానుజుడు కాంచీపురాన్ని వీడి వెళ్ళినప్పటినుండి అచ్చట ఉన్న ముఖ్యులలో చాలమంది కితనిమీద సానుభూతి ఏర్పడింది. అతని వాదంమీద విశ్వాసమేర్పడింది. పైగా యాదవప్రకాశునిమీద

కోపం వచ్చింది. అలా కోపం వచ్చిన వారిలో వీరరాజేంద్రుని సేనాపతియైన సోమదేవుడొకడు.

సోమదేవుడు యాదవుడు. అతనికి అవతారపురుషుడైన శ్రీకృష్ణునిమీద భక్తి యెక్కువ. అందువల్ల శైవమతమన్నా, అద్వైతమన్నా అతనికి గిట్టలేదు. అంతేగాక శైవంపేరుతో, అద్వైతంపేరుతో రాజుగారి అనుగ్రహాన్ని సంపాదించుకొన్నవారు గావిస్తున్న అక్రమాలు అతని కా మతంమీద పూర్తిగా అసహ్యతను కలిగించాయి. అందువల్ల అతడు బహిరంగంగా శైవుల్ని సవాలు గావించాడు.

సోమదేవుని వర్తన మంత్రియైన త్రిపురాంతకునికి సరిపడలేదు. అతడు శైవుడు. పైగా వీరరాజేంద్రచోళుడు శైవమతాన్ని బలపరుస్తున్నాడు. ఆ పరిస్థితుల్లో శైవమతాన్ని, దానికి పునాదిగా వున్న అద్వైతాన్ని ధిక్కరించడమంటే రాజుయొక్క అధికారాన్ని ధిక్కరించడమన్నమాటే. అది త్రిపురాంతకునికేగాక వీరరాజేంద్రునికిగూడ మనస్సుకు కష్టంగానేవుంది. రాజు ఆ విషయంలో ఏమీ చేయలేకున్నాడు.

సోమదేవునికి శైవంమీద ఇష్టంలేనప్పటికీ వీరరాజేంద్రుడంటే అతనికి చాలా భక్తి వున్నది. సోమదేవుని శక్తిసామర్థ్యాల వల్లనే చోళరాజ్యం అంతగా విస్తరించింది. అంత భక్తితో తన్ను సేవిస్తూన్న సేనానాయకుణ్ణి యీ చిన్నవిషయాన్నిగూర్చి ప్రశ్నించడం రాజు కిష్టంలేదు. పైగా సోమదేవుడు సేనానాయకుడుగానేగాక, పండితుడుగా, ధర్మచింతనగలవాడుగా, ఉదారస్వభావుడుగా ప్రజల మన్ననలకు పాత్రుడయివున్నాడు. అందువల్ల తన అంత్యదశలో అతనితో వైరం పెట్టుకోవడం రాజు కిష్టంలేదు.

కాని త్రిపురాంతకుని కలాగాదు. తన ధైర్యస్థైర్యాలవల్ల సోమదేవుడు రాజ్యవిస్తరణగావించివుంటే వుండవచ్చు. తాను రాజుకు విధేయుడై వుంటే వుండవచ్చు. అయినప్పటికీ అతడు వైష్ణవాన్ని చేపట్టి అద్వైతాన్ని ప్రశ్నించడం, యాదవప్రకాశుణ్ణి విరసించి, యామునాచార్యుణ్ణి, రామానుజుణ్ణి పొగడడం పరోక్షంగా

రాజును బలహీనపరచడంతప్ప మరేమీకాదని అతని అభిప్రాయం. అంతేగాక మత విషయంలో వాదోపవాదాలు హెచ్చైతే, పరిపాలనలో గూడ విభేదాలు వస్తాయని అతని భయం. అందువల్ల ప్రజలందరూ కాకపోయినప్పటికీ పరిపాలనను నిర్వహిస్తున్న వారైనా శైవాన్ని ప్రశ్నించకుండావుంటే పరిపాలన బలహీనపడదని అతని నమ్మకం. అందువల్ల సోమదేవుడు వైష్ణవాన్ని వదలుకొని శైవమతాన్ని అవలంబించాలని అతని కోరిక.

త్రిపురాంతకు డీ విషయాన్నిగూర్చి చాలమార్లు రాజైన వీరరాజేంద్రునివద్ద ప్రస్తావించివున్నాడు. కాని రాజు మంత్రిమాట వినడమేగాని దానికి అటూ యిటూ ఏమీ చెప్పలేదు. అది త్రిపురాంత కునికి చాల కష్టాన్ని కలిగించింది. అంతేగాక తనపైకంటెగూడ రాజుకు సోమదేవునిపైన ఎక్కువ విశ్వాసమున్నట్లతని కనిపిం చింది. ఆ భావం ఎంతో మనఃక్లేశాన్ని కలిగించింది.

త్రిపురాంతకుడు సోమదేవునితో వైరం పెంచుకోవడం వీరరాజేంద్రుని కిష్టంలేదు. మంత్రి తనతోపాటు శైవుడైతే కావచ్చు కాని సేనానాయకునికున్న ప్రతిభ అతనికిలేదు. అందువల్ల రాజు ఏమీ చెప్పలేక ఊరుకున్నాడు.

త్రిపురాంతకునికి, సోమదేవునికివున్న అభిప్రాయభేదాలు క్రమంగా హెచ్చుకాసాగినవి. సోమదేవుడు వైష్ణవాన్నిగూర్చి మాట్లాడుతున్నప్పటికీ అతడు తనక్రిందనున్న శైవసేనానులనుగాని సైనికోద్యోగులనుగాని ఏమీ అనలేదు. వారి వ్యవహారాలలో కలి గించుకోలేదు. కాని త్రిపురాంతకు డలాకాక తనక్రింది ఉద్యోగులైన వైష్ణవులను శైవులు గమ్మని నిర్బంధింపసాగాడు. అలా శైవులు కానివారిని ఉద్యోగాలనుండి తొలగింపబూనుకున్నాడు. అది వైష్ణ వులకు చాల కష్టాన్ని కలిగించింది. త్రిపురాంతకు డనుసరిస్తున్న వైష్ణవ వ్యతిరేకవిధానం ఆ మతానికి మంచి సానుభూతిని కొని తెచ్చింది. ప్రజలలో వైష్ణవమతంయెడల అనురాగం హెచ్చ సాగింది. సేనానాయకుడైన సోమదేవుని ప్రాబల్యానికి అది మరింత తోడ్పడింది.

త్రిపురాంతకుడు వైష్ణవులైన ఉద్యోగుల్ని ఎంత కష్టపెట్టి నప్పటికీ, వారి నెన్ని ఇబ్బందులపాలు గావించినప్పటికీ, ఎందరి ఉద్యోగాలు ఊడగొట్టినప్పటికి సోమదేవుడు మాత్రం శైవులమీద ప్రతీకారం తీర్చుకో దలచలేదు. మతానికి, పరిపాలనకు సంబంధం లేదని అతని అభిప్రాయం. అందువల్ల అతడు తనక్రింద పనిచేస్తున్న శైవుల నెప్పటిలాగే అనురాగంతో చూస్తూవచ్చాడు. కాని త్రిపురాంతకు డంతతో ఊరుకోలేదు. సైన్యంలో ఉన్న శైవుల్ని అతడు సోమదేవునికి వ్యతిరేకంగా తిప్పసాగాడు. అది సోమదేవుని కెంతో కష్టాన్ని కలిగించింది. త్రిపురాంతకుడు సైనిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొంటున్నాడని, అందువల్ల సైన్యంలోని పటుత్వం సడలిపోతుందని అతడు రాజుతో చెప్పాడు.

సోమదేవుని మాటల్లోని సత్యాన్ని వీర రాజేంద్రుడు గమనించాడు. కాని అతడు మంత్రి నేమీ అనజాలక పోయాడు. త్రిపురాంతకుడు సోమదేవుని లాటివాడుగాడు. కొంత మత్సరుడు. సోమదేవుణ్ణి మందలించలేదని యిప్పటికే అతడు కినుక వహించి ఉన్నాడు. ఇలా ఎందుకు చేస్తున్నావని అడిగితే మరింత కోపగించుకొంటాడు. ఆ కోపాన్ని తనముందు ప్రకటించక పోయినప్పటికీ మనస్సులో పెట్టుకొని ఏదో కుట్ర గావిస్తాడు.

సోమదేవుడంటే వీర రాజేంద్రునికి అనురాగం హెచ్చు. అందువల్ల అతణ్ణి దగ్గరకి చేరదీస్తుంటాడు. కనుక అతనికి రాజ కుటుంబంతో చాలా సన్నిహిత సంబంధ మేర్పడింది.

అంతేగాదు. సోమదేవుడే యువరాజైన అధిరాజేంద్రునికి స్వయంగా రణవిద్యను నేర్పాడు. అందులో ఉన్న మర్మాల నన్నిటినీ క్షుణ్ణంగా తెలియజేశాడు. కనుక అధిరాజేంద్రునికి సోమదేవుడంటే ప్రేమేగాక భక్తి గూడ ఉంది. అది మంత్రియైన త్రిపురాంతకునికి ఏమాత్రం యిష్టం లేకపోయింది.

వీరరాజేంద్రుడు చాల బలహీనంగా ఉన్నాడు. ఏదో తెలియని రుగ్మత అతణ్ణి తినివేస్తున్నది. వైద్యులెందరో పరిశీలించారు గాని ఆ రుగ్మతను నయం గావించడానికి వారికి చేతగాక పోయింది. అస

లా రోగ మిదియని గ్రహించడమే వారికి కష్టమైపోయింది. రాజు ఎప్పటిలాగే ఉంటున్నాడు. కాని నానాటికీ బలహీనపడిపోతున్నాడు. ఇంక ఎంతకాల మతడు జీవిస్తాడో ఎవరూ చెప్పలేకున్నారు. అలాటి పరిస్థితిలో రాజు ఎన్నడైనా తటాలున మరణి స్తే—

త్రిపురాంతకు డాలోచింపసాగాడు.

అధిరాజేంద్రునిపై తన కాధిపత్యం ఉంటుందా ! అతడు తన మాట వింటాడా ? అప్పుడు తన పరిస్థితి ఏమికావాలి?

త్రిపురాంతకుని గుండె గుభేలుమన్నది. ఆలోచించేకొద్దీ అత నికి తన భవిష్యత్తు అంధకారబంధురంగా కనబడసాగింది. దుర దృష్టవశాత్తు రాజే మరణించి, యువరాజే రాజైతే తనకంటె సేనా నాయకుడైన సోమదేవుని పలుకుబడి హెచ్చుతుంది. అప్పుడు శైవం నశించి వైష్ణవానికి ప్రాబల్యం వస్తుంది. అలావస్తే తను గాంచిన కలలన్నీ ఏమౌతాయి ?

'అలా కాగూడదు. అలా ఎన్నటికీ కాగూడదు. అధిరాజేం ద్రుడు రాజు కాగూడదు'. అనుకొన్నాడు త్రిపురాంతకుడు.

ఆనాటినుండి త్రిపురాంతకునికి యువరాజంటే ఇష్టం లేక పోయింది. అతణ్ణి రాజుగాకుండా చూడడానికి పన్నాగాలు పన్నా లనిపించింది.

సోమదేవు డున్నంతవరకు అది సాధ్యమయ్యే పనేనా ? అతని కేమి చేయాలో తోచలేదు.

రాజు పరిస్థితి నానాటికి క్షీణించుచున్నందువల్ల రాజకార్యాలను చూడడానికి అధిరాజేంద్రుని కవకాశం కలిగించమన్నాడు సోమదేవు డొకనాడు రాజుతో. అది మంచిదే ననిపించింది రాజుకు. మంత్రి యైన త్రిపురాంతకుణ్ణి పిలిచి యువరాజుకు రాజ్య వ్యవహారా లప్ప గిస్తున్నానని, ఇకమీద అతని అధిపత్యం క్రిందనే పరిపాలనను కొనసాగించమని ఆదేశించాడు రాజు. మొదట మంత్రి కది చీకాకు కలిగించినప్పటికీ, ఏవిధంగానైనా అధిరాజేంద్రుణ్ణి తన వైపుకు తిప్పుకోవచ్చునని తలచి తన మనస్సును సమాధానపరచుకొన్నాడు

అధిరాజేంద్రుడు చిన్నవాడు. రాజ్య వ్యవహారాలను స్వయంగా చూచుకోలేడు. అందువల్ల త్రిపురాంతకునిమీద ఆధార పడివలసి వున్నది. కాని అత డలా చేయలేదు. సోమదేవుని సలహా ననుసరించి స్వతంత్రంగా రాజకార్యాలను నిర్వహించడానికి పూను కొన్నాడు. అది త్రిపురాంతకుని మనస్సుకెంతో కష్టం కలిగించింది.

ఒకనాడు త్రిపురాంతకుడు అధిరాజేంద్రుని వద్దకు వెళ్ళి నమ స్కరించి ఏకాంతంగా,

'యువరాజా!' అన్నాడు.

యువరాజు తల ఎత్తి చూచాడు.

'మీతో మాట్లాడాలని వచ్చాను.'

మాట్లాడమన్నట్లుగా తలఊపాడు యువరాజు.

'సోమదేవుని గూర్చి మీకు బాగా తెలిసినట్లు లేదు.'

యువరాజు కేమీ అర్థం కాలేదు.

'మీరు నన్నపార్థం కావించుకోకుంటే మీ కొక విషయాన్ని చెప్పాలని ఉంది.'

'చెప్పండి' అన్నాడు యువరాజు మందహాసంతో.

'మీరు చిన్నవారు. సోమదేవుడు మిమ్మల్ని తన గుప్పెట్లో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.'

యువరాజుకు కోపం వచ్చింది. కాని దాన్ని ప్రకటించలేదు.

అతనికి కోపం వచ్చిందని మంత్రి గ్రహించాడు.

'సోమదేవుణ్ణి గూర్చి నేనేమి చెప్పినప్పటికీ మీ కిప్పు డర్థం కాదు - కాని........'

'మీరు చెప్పదలచిం దేదో చెప్పండి.' అన్నాడు యువరాజు విసుగ్గా.

'సేనానాయకుడు శైవాన్ని నాశనం గావించి వైష్ణవాన్ని...'

'వైష్ణవాన్ని....?'

'వైష్ణవాన్ని రాజ్య మేలించాలని చూస్తున్నాడు'.

'అని మీ రెలా చెప్పగలరు?'

'దానికి తగిన ఆధారా లున్నవి.'

యువరా జేమీ మాట్లాడలేదు.

'అమాయకులైన మిమ్మల్ని తన అధీనంలో ఉంచుకొని యీ రాజ్యాన్ని తన యిష్టం వచ్చినట్లు పాలించాలని అతడు ఉవ్విళ్ళూరు తున్నాడు. కాని శక్తియుక్తులు గలిగిన మీ ముందు అది కొనసాగు తుందని నే ననుకోను.' అన్నాడు మంత్రి.

'గౌరవనీయుడైన సేనా నాయకునిమీద ఆరోపణలు చేయ డానికంటె అతనితో కలిసి పని చేస్తే మంచిది.' ముక్తసరిగా అన్నాడు యువరాజు.

'మీరు మంచివారు. అందువల్ల అలా అంటారు. కాని అతని మనస్సు మీకు తెలియదు'. మరేదో చెప్పబోయాడు మంత్రి.

'ఆ విషయం మీ కక్కరలేదు. మీ పని ఏదైనా ఉంటే చెప్పండి.' అన్నాడు యువరాజు. తన మాట లతని చెవి కెక్క లేదని మంత్రి అర్థం గావించుకొన్నాడు.

అధిరాజేంద్రుడు రాజ్య వ్యవహార బాధ్యతను స్వీకరించి నప్పటినుండి సోమదేవుని సలహాలనే పాటిస్తూ వస్తున్నాడు. మంత్రి యైన త్రిపురాంతకుణ్ణి అప్పుడప్పుడూ సంప్రతిస్తున్నప్పటికీ అతని సలహాలు సరిగా లేనందువల్ల అతడు వాటిని పాటించడం లేదు. రాజైన వీర రాజేంద్రుడుగూడ తన కుమారుడు సోమదేవుని సహా యంతో రాజ్యాన్ని కొనసాగిస్తున్నందు కెంతో సంతోషించాడు.

'నాకు ప్రత్యేకమైన పని ఏముంటుంది, పరిపాలనా వ్యవహా రాలు తప్ప?' అన్నాడు మంత్రి వ్యంగ్యంగా.

'వాటిని గూర్చే మాట్లాడండి. సోమదేవునిగూర్చి ఎందుకు చెబుతారు?' అన్నాడు యువరాజు.

'అతని వర్తనకు, పరిపాలనకు ఎంతో సంబంధముంది.' అన్నాడు మంత్రి.

'ఆ విషయం నా కక్కరలేదు. రాజ్య వ్యవహారా లేమైనా వుంటే చెప్పండి. వినడానికి సంసిద్ధంగా ఉన్నాను. నేను మిమ్మ

న్నెలా గౌరవిస్తున్నానో సేనానాయకుణ్ణి గూడ అలాగే గౌరవిస్తు న్నాను. మీ రతని విషయమై అలా మాట్లాడడం నా కేమాత్రం ఇష్టం లేదు.' అన్నాడు యువరాజు ఖచ్చితంగా.

ఇక మాట్లాడి లాభం లేదనుకొన్నాడు త్రిపురాంతకుడు. యువరాజుకు నమస్కరించి తిరుగుముఖం పట్టాడు.

యువరాజును సందించిన తరువాత మంత్రి మనస్సులోని మత్సరం మరింత హెచ్చింది. సోమదేవుని మీద ఉన్న కోపం అధి రాజేంద్రుని మీదికి మళ్ళింది. యువకుడుగా ఉన్న యువరాజు గూడ తన్ను తృణీకరిస్తాడా? అతని కెంత ధైర్యం? తన శక్తి సామ ర్థ్యాలను చూపే అదను వచ్చిం దనుకొన్నాడు మంత్రి. ఇక అధి రాజేంద్రుడు రాజు కాకూడదనుకొన్నాడు. అతడు రాజుగాకుండా చేయడానికోసం తన ప్రాణాలనైనా పణం పెట్టాలనుకొన్నాడు.

త్రిపురాంతకుడు వెళ్ళిపోయిన పిదప యువరాజు మనస్సు కలవరపడింది. అతడు వెళ్ళిన పద్ధతి యువరాజు కంత సగిపడ లేదు. అతడు కోపంతో వెళ్ళాడని అనిపించింది.

'త్రిపురాంతకుడు మంత్రిగావచ్చు. అంతమాత్రాన తనముందర, తన కెంతో పూజ్యుడైన, అహరహం తన క్షేమాన్ని కాంక్షించి తన పురోభివృద్ధికి, చోళరాజ్య విస్తరణకు పాటు పడుతున్న సోమదేవుని మీద తనతో పితూరీలు చెప్పవచ్చునా? అది తన మనస్సు నెంతో నొప్పిస్తుందని అతనికి తెలియదా?' అనుకొన్నాడు యువరాజు. కాని ఆ విషయాన్ని సోమదేవునితో చెప్పలేదు.

సోమదేవు డెన్నడూ త్రిపురాంతకుని విషయమే ఎత్తుకోడు. పైగా ఏ క్లిష్టసమస్య వచ్చినప్పటికీ తన సలహా యివ్వడమేగాక మంత్రి సలహానుగూడ తీసుకొమ్మని చెబుతుంటాడు. తన సలహా యిచ్చినా దానినే పాటించాలని నిర్బంధించడు. అంతేగాక తను చెప్పినదానిలో ఏవైనా తప్పులుండవచ్చు గనుక స్వతంత్రంగా ఆలో చించి నిర్ణయాలు తీసుకొమ్మని ప్రోత్సహిస్తుంటాడు. ఆవిధంగానే తానుగూడ వ్యవహరిస్తున్నాడు. అందువల్ల లాభమే కలుగుతున్నది గాని నష్టం కలగడంలేదు. అత డెన్నడూ తనవద్ద శైవవైష్ణవ

మతాలనుగూర్చి ప్రస్తావించి ఉండలేదు. పైగా పరిపాలనా వ్యవహారాలలో ఆమాట నెన్నడూ అత డెత్తుకొని ఉండలేదు.

సోమదేవునికి వైష్ణవమంటే యిష్టమని యువరాజుకు తెలుసు. శైవంపేరుతో త్రిపురాంతకుడు వైష్ణవులను కష్టపెట్టడం అతని కేమాత్రం ఇష్టంలేదని అధిరాజేంద్రునికి తెలుసు, నిజమే. మతంపేరిట ఎవరికైనా ఎందు కన్యాయం చేయాలి? అనుకున్నాడు యువరాజు. సోమదేవుని విధానం ఆ విషయంలో సమర్థింపదగినదే అనుకున్నాడతడు.

ఒకసారి త్రిపురాంతకుడు వైష్ణవుడైన కాంచీపుర మండలాధిపతిని తీసివేశాడు. ఆ విషయం యువరాజు దృష్టికి వచ్చింది. ఆ అధికారి చాల మంచివాడు. పేరుప్రతిష్ఠలు గలవాడు. ఎంతో సమర్థతతో పరిపాలనగావించాడు. విచారించబోతే అతని తప్పేదమేమీ లేదనిపించింది యువరాజుకు అతడు వైష్ణవమతస్థుడు కావడమే అతనిని పదవీచ్యుతుణ్ణిచేయడానికి కారణమని తెలుసుకున్నాడు యువరాజు. వెంటనే అతని కా పదవి తిరిగియిస్తూ ఉత్తరువులు చేశాడు. ఆ ఉత్తరువు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించాయి.

త్రిపురాంతకుడు వేసిన ఉత్తరువులేవీ అంతవరకు రద్దయి ఉండలేదు. అలా రద్దుగావడం ఇదే ప్రథమం. మంత్రి చండశాసనుడని అందరికీ తెలుసు. అతని ఆజ్ఞకు తిరుగులేదనిగూడ అందరికీ తెలుసు. రాజైన వీరరాజేంద్రుడుగూడ అతని ఉత్తరువులను దేనినీ అంతవరకు మార్చి ఉండలేదన్న విషయంగూడ అందరికీ తెలుసు. అందువల్లనే యువరాజు గావించిన ఉత్తరువు అందరినీ ఆశ్చర్యచకితుల్ని గావించింది.

తాను తీసివేసిన మండలాధిపతిని యువరాజు మరల అధికారంలో ఉంచడం మంత్రికి సహించరాని విషయమయింది. సోమదేవుని సలహాలేకుండా అధిరాజేంద్రు డలా చేసివుండ డనిపించిం దతనికి. ఆ సంఘటనవల్ల ఆ రాజ్యంలో తనప్రతిష్ఠ నాశనమయిం దనిపించింది. అందువల్ల అతని కెంతో కోపం వచ్చింది. ఈ చిన్నవిషయంలోనే యువరా జీవిధంగా ప్రవర్తిస్తే ఇక క్లిష్ట

సమస్య లేర్పడినప్పుడు. సోమదేవునికి, తనకు పట్టుదలలు వచ్చినప్పుడు యువరాజు తనమాట ఎందుకు వింటాడు? ఆ ఆలోచన అతని గుండెను నలిపివేసింది. అతనిహృదయం ఉన్నట్లుండి క్రుంగినట్లయింది. అతని పాదాలక్రిందఉన్న భూమి ఒక్కసారిగా జరిగిపోయినట్లయింది. హిమగిరిశిఖరాగ్రంనుండి ఒక్కమాటుగా అతడు అధఃపాతాళానికి పొరలిపోయినట్లనిపించింది.

ఇక ఏమాత్రం ఆలసించడానికి వీలులేదు. ఇక ఎన్నోనాళ్ళు వీరరాజేంద్రుడు జీవించడు. అతడు బ్రతికినా ఒకటే, బ్రతుకకున్నా ఒకటే. ఇక అతణ్ణిగూర్చి ఆలోచించి లాభంలేదు. యువరాజైన అధిరాజేంద్రుణ్ణి అధఃపతనంగావించాలి. ఇకనుండి సోమదేవుడు గాదు తనవిరోధి. యువరాజైన అధిరాజేంద్రుడు. అతని అంతం చూచితీరాలి అనుకున్నాడు త్రిపురాంతకుడు.

# 3

## విషాన్నం

*శ్రీ రామానుజుడు తిరుమంత్రాన్ని అందరికీ చెప్పివేశాడన్న వార్త శ్రీరంగంలో త్వరగా తెలిసిపోయింది. ఆ వార్తను విన్న ప్రజ లందరు చాల సంతోషించారు. ఆ మంత్రాన్ని తెలుసుకోవాలన్న కుతూహలంతో జనులందరూ రామానుజు డున్న వనానికి గుంపులు గుంపులుగా వెళ్ళసాగారు. వచ్చినవా రందరికీ అత డా మంత్రిం ఉపదేశింప సాగాడు.*

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు - కడకు పంచములు గూడ - రామానుజుని వద్దకు వెళ్ళి తిరుమంత్రాన్ని తెలుసుకొన్నారు. పురుషులేగాక స్త్రీలుగూడ అతని సన్నిధికి వెళ్ళి ఆ మంత్రాన్ని విని వచ్చారు. శ్రీరంగంలో ఎచ్చట చూచినా అతనిపేరే వినవచ్చింది. ఏ వీధిలో చూచినా, ఏ వాడలో

పరికించినా. ఏ యింటిలో తిలకించినా ప్రతివారు రామానుజునిగూర్చే చర్చింపసాగారు అతడు మహానుభావుడని, మహాపురుషుడని, దైవాంశసంభూతుడని, ప్రజల కందరికీ ముక్తిని ప్రసాదించడానికి జన్మించాడని, అతనికంటె మించినవాడు శ్రీరంగమంతా వెతికినా కనబడడనీ వారు చెప్పుకొనసాగారు. రామానుజుడు గోష్ఠీపూర్ణుని వద్దకు వెళ్ళడం, తిరుమంత్రాన్ని చెప్పడాని కతడు నిరాకరించడం, తాను పట్టువదలకుండా ఎన్నిమార్లైనా తిరుకొట్టియూరుకు పయనం సాగించడం, గోష్ఠీపూర్ణుణ్ణి మెప్పించడం, తిరుమంత్రాన్ని తెలుసుకోవడం, ఆ గ్రామంలో వున్న గోపురం ఎక్కి దాని నందరికీ చెప్పివేయడం — వీటి నన్నిటినీ వారు గాథలుగా వర్ణింపసాగారు.

రామానుజు డున్న వనం ప్రతిదినం ప్రజలతో కిటకిట లాడ జొచ్చింది. శ్రీరంగంలోనేగాక అతని ప్రభ అన్ని గ్రామాలకు వ్యాపించింది. రైతులు, కూలీలు తదితర గ్రామస్థులు వేనవేల మంది రామానుజుని దర్శనానికి వచ్చారు. అతని ఉపదేశాన్ని పొంది తరించామని సంతృప్తి చెందారు. ఈవిధంగా రామానుజుని ప్రతిష్ఠ దినదినానికి అభివృద్ధి పొందసాగింది.

రామానుజుని యశస్సు ఎంతగా వ్యాప్తి జెందిందో అతని మీద ద్వేషంగూడా అంతగా హెచ్చసాగింది. శ్రీరంగంలో వున్న వైష్ణవులందరికీ రామానుజునిపై కోపం వచ్చింది. 'రహస్యంగా ఉంచవలసిన తిరుమంత్రాన్ని అత డందరికీ చెప్పివేశాడు. కడకు పంచములకు గూడ చెప్పివేశాడు. సంఘమంతా వెనక్కి నెట్టిన పంచముల్ని తనవద్దకు రానిస్తున్నాడు సంఘ సంప్రదాయాలను, మత విధానాలను అన్నిటినీ నాశనం గావిస్తున్నాడు' అనుకొన్నారు వారు.

శ్రీరంగంలోని వైష్ణవుల కందరికీ యామునాచార్యుడు ఆదర్శ పురుషుడు. వారందరూ అతని అడుగుజాడల్లో నడుస్తున్నారు. కాని యామునాచార్యు డెన్నడూ రామానుజునిలాగా ప్రవర్తింపలేదు. ఇత డా ఆచార్యునికంటె గొప్పవాడా? మహామహులకేగాని తెలియగూడని తిరుమంత్రాన్ని అందరికీ చెప్పివేస్తాడా? సంఘంలో హెచ్చు తగ్గు

లన్నీ మానవ కల్పితాలే నని బోధిస్తాడా? తానేదో దైవాంశసంభూతుడులాగా ప్రవర్తిస్తాడా? అతనిమాటే చెల్లుబడి అయ్యేటట్లయితే ఇక వర్ణా లనేవి నిలుస్తాయా? వర్ణాలు నిలువకపోతే హైందవం అనేది వుంటుందా?'' అనుకొన్నారు వారు.

వైష్ణవు లేమనుకొన్నప్పటికీ రామానుజుడు మాత్రం తన విధానాన్ని మార్చుకోలేదు. ప్రజల్ని చేరదీయడం మానలేదు. తిరుమంత్రాన్ని చెప్పడం వదలివేయలేదు. ఇది అచ్చటి వైష్ణవులకు మరింత బాధాకరమయింది.

దానికితోడు మరికొన్ని సంఘటనలు గూడ జరిగాయి. శ్రీరంగ దేవాలయానికి రామానుజుడు ప్రతిదినం వచ్చి అర్చన గావింపసాగాడు. అతని అర్చనా విధానానికి, అర్చకులు చేస్తున్న అర్చావిధానానికి తేడా వచ్చింది. అది చూచి అర్చకులకు కోపం వచ్చింది. పాత పద్ధతి ప్రకారమే అర్చన జరగాలని పట్టుబట్టారు. లేకుంటే అచ్చట అర్చన చేయడానికే వీలులేదన్నారు. కాని రామానుజుడు మాత్రం తన పద్ధతి ప్రకారమే అర్చన చేయసాగాడు. అది వారి కెంతో కోపకారణ మయింది.

ఒకనా డీ విషయమై ఆలయ ప్రధానార్చకుడైన భృంగాచార్యుడు రామానుజుణ్ని తీవ్రంగా ఆక్షేపించాడు.

గతంలో శ్రీరంగదేవాలయంలో వైఖానస - ఆగమ విధానాన్ని అనుసరించి అర్చనలు జరుగుతుండేవి. కాని ఆనాడు పాంచరాత్రాగమ విధానాన్ని అనుసరించి రామానుజుడు పూజలు చేయసాగాడు. అది చాల తప్పు, అపరాధం, దైవద్రోహం అన్నాడు భృంగాచార్యుడు.

పాంచరాత్రాగమ విధానం తాను కనిపెట్టిన విధానం కాదని, వైష్ణవులందరూ ఏ మహాపురుషుణ్ని తమ కాదర్శప్రాయంగా ఉంచుకొన్నారో, ఎవరిని గౌరవించి, ఎవరి సూత్రాల నామోదించారో ఆ మహాపురుషుడైన యామునాచార్యుడు ప్రతిపాదించిన విధానమే అన్నాడు రామానుజుడు. ఆ యాచార్యుడు రచించిన 'ఆగమప్రామాణ్యం' లో ఆ విధానముందని. దాని నందరు గౌరవించవలసి ఉంటుం

దని చెప్పాడు రామానుజుడు. కాని భృంగాచార్యు డందు కంగీక రించలేదు. పాత పద్ధతి ప్రకారమే పూజలు కొనసాగాలన్నాడు. దేవాలయార్చకు లే విధానాన్ని అనుసరించినా తాను తప్పుబట్ట బోనని, తన అర్చా విధానానికి మాత్రం అడ్డు తగలవద్దని అర్థించాడు రామా నుజుడు. కాని భృంగాచార్యుడు వినలేదు.

అర్చావిధానంపై చెలరేగిన యీ దుమారం శ్రీరంగమంతటా పర్విన్నది. ప్రజలలో చాలమంది రామానుజుణ్ణి సమర్థించారు. తిరు మంత్రాన్ని సామాన్య ప్రజల కందరికీ చెప్పివేశాడని కోపించుకొన్న వైష్ణవులలో చాలమంది గూడ రామానుజుని వాదమే సరియైన దన్నారు. ఎందుకంటే అది తమ ఆచార్యుడైన యామునాచార్యుడు ప్రతిపాదించిన విధానం. అంబుపల్లి వారు దానిని సమర్థించారు.

యామునాచార్యుడు సామాన్యుడుగాడు. చాల గొప్పవాడు. మహాపండితుడు. వేదవేదాంగవేత్త. అద్వైతాన్ని ఎదిరించి వైష్ణవులకు ప్రతిష్ఠను కొనితెచ్చినవాడు. అతని సూత్రాలే ఆనాడు వైష్ణవులకు వజ్రకవచాలు. ఎవరితో వాదించాలన్నా వారికి యామునా చార్య ప్రతిపాదితమైన వాదాలు కావాలి. కాని అతని పూజావిధానం మాత్రం పనికిరాదు. విన్నవారికల్లా ఇది పరస్పరవిరుద్ధంగా కన బడింది. అందువల్ల యామునాచార్యునిమీద అభిమానమున్న వైష్ణవు లందరూ రామానుజునివాదమే సరియైన దనవలసివచ్చింది. అలా కాకపోతే మహామహుడైన యామునాచార్యుణ్ణి అవమానించినట్లని వారనుకున్నారు.

దినాలుగడచినకొద్దీ భృంగాచార్యుని వాదానికి బలం తగ్గి పోయింది. శ్రీరంగంలో ఆ ఆచార్యునికి ఒక స్థానం ఉంది. వైష్ణ వులలో ఆతడు ప్రతిభావంతుడని, పండితుడని ప్రతీతి. అంతేగాక అర్చావిధానాన్నిగూర్చి సాధికారంగా చెప్పగలవా డతడొక్కడేనన్న ప్రతిష్ఠగూడ అతనికున్నది. కాని రామానుజునివల్ల ఆ ప్రతిష్ఠ దెబ్బ తిన్నది.

అర్చనావిధానంలో రామానుజునితో పేచీ వచ్చేవరకు వైష్ణవు లందరూ అతనితోనే ఉన్నారు. తిరుమంత్రాన్ని ప్రజలకందరికీ

చెప్పివేయడం క్షమించరాని తప్పిదమని అతడన్నప్పుడు వైష్ణవు లందరూ అతణ్ణే సమర్థించారు. కాని ఆనాడు వారిలో చాలమంది రామానుజుణ్ణి సమర్థిస్తున్నారు అది భృంగాచార్యుని కాశ్చర్యమని పించింది. గురుద్రోహం, దైవద్రోహం గావించిన రామానుజుణ్ణి వైష్ణవు లలా సమర్థిస్తున్నారే అని అతనికెంతో బాధ కలిగింది. రామాను జుణ్ణి సమర్థించడం తప్పని, అతణ్ణి ఏవగించడం తమ కర్తవ్యమని ఆచార్యుడు తనకు కావలసిన వైష్ణవులందరినీ పిలిచి చెప్పి చూచాడు. మందలించాడు. బెదిరించాడు. కొందరతని మాటలకు చెవియొగ్గారు. చాలమంది అతని వాదాన్ని నిరాకరించారు అది అతని మనస్సును గట్టిగా గాయపరచింది. అతని అభిమానాన్ని దెబ్బగొట్టింది. అందు వల్ల అత డుగ్రుడయ్యాడు. వైష్ణవులందరూ తనమాట వినకపోవ డానికి రామానుజుడే కారణమనుకొని అతనిపై పగ తీర్చుకోవా లనుకొన్నాడు.

రామానుజుణ్ణిగూర్చి తా నెంత విమర్శించాడో అంతకంతా భృంగాచార్యుని పలుకుబడి తగ్గిపోజొచ్చింది. తొలుత తన్ను సమ ర్థించిన వైష్ణవులుగూడ మెల్లిగా జారుకొనసాగారు. అర్చకులలో గూడ కొద్దిమంది అతనిపట్ల విముఖులయ్యారు. కాని భృంగాచార్యు డంటే వారికున్న భయంకొద్దీ, అతనికి వ్యతిరేకంగా ఏమీ చెప్ప లేకపోయారు.

ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగలిగినదిట్ట భృంగాచార్యుడు. వైష్ణవులలో తనయెడల హెచ్చుతున్న వ్యతిరేకత నతడు గుర్తిం చాడు. అర్చకులలోగూడ తనపై పెరుగుతున్న వైమనస్యాన్ని గమనించాడు. దీనికంతటికీ కారణం రామానుజుడే ననుకొన్నాడు. అతని నంతమొందిస్తే ఇక సమస్యే ఉండదనుకొన్నాడు. కాని అలా చేయడం ఎలా? అతని కేమీ తోచలేదు.

రామానుజాచార్యుడున్న వనానికి మొదట్లో అంతమంది వెళ్ళేవారుగాదు. కాని తిరుక్కొట్టియూరు సంఘటనతరువాత అతణ్ణి దర్శించాలనే కుతూహలంతో ప్రజ అచ్చటికి హెచ్చుగా రాజొచ్చారు.

దేవాలయంలో అర్చనావిధానాన్నిగూర్చి, సంఘర్షణ యేర్ప డిన తరువాత తీర్థయాత్రకు వచ్చినట్లుగా ప్రజ లచ్చటికి రాసాగారు. అది భృంగాచార్యునికి మరింత మనఃక్లేశాన్ని కలిగించింది. రామాను జుణ్ణి అంతమొందించి తేగాని తన మనస్సుకు శాంతి చేకూరదనిపించింది. కాని ఆకార్యం నెరవేరేమార్గం అతనికి తోచలేదు. ఆలోచించినకొద్దీ ఆపని చాల కష్టమనిపించింది. ఒకవేళ ఆవిషయం యితరులకు తెలిస్తే తనకే ప్రమాదమని తోచింది. అందువల్ల తన అభిప్రాయాన్ని ఎవ్వరికీ చెప్పకుండా ఆలోచిస్తూ కూచున్నాడతడు.

ఒకనాడు అర్చకులలో ఒకడైన శేషాచార్యు డతనియింటికి వచ్చాడు. అర్చకులనుగూర్చి, ముఖ్యంగా భృంగాచార్యుల్నిగూర్చి ప్రజ లెంత హేయంగా మాట్లాడుకొంటున్నారో అతడు వివరించాడు. ప్రజలేగాక అంతవరకు తనను పెద్దగా గౌరవిస్తున్న వైష్ణవులు గూడ ఏవిధంగా అపహాస్యిస్తున్నారో ఆచార్యునికి చెప్పాడు. ఆ విషయంలో ఏమైనా చేసి రామానుజుని ప్రతిష్ఠను తగ్గించకపోతే తమకు మహాప్రమాదం రానున్నదనిగూడ అతడు సూచించాడు.

'మనం ఏమిచేయగలం శేషూ. ప్రజలలో అతని పలుకుబడి హెచ్చుతున్నదని నీవే చెబుతున్నావుగదా,' అన్నాడు భృంగాచార్యుడు.

'అవును.'

'మన వైష్ణవులైనా, కడకు మన అర్చకులందరైనా మనతో ఉంటే అతణ్ని ఏమైనా చేయవచ్చు. అలా లేదుగదా,' నిట్టూర్చాడు భృంగాచార్యుడు.

'నిజమే. అదే ఇప్పు డడ్డువస్తున్న సమస్య. లేకుంటే రామానుజుడు మన కొక లెక్కా?' అంటూ భృంగాచార్యుణ్ని పరికించాడు శేషాచార్యుడు.

'వైష్ణవాన్ని సమర్థించవలసివచ్చినప్పు డే యామునాచార్యుని సూక్తుల్ని మనం ఉదాహరిస్తూవచ్చామో, ఆ యామునాచార్యునిచేత ప్రతిపాదితమైన పూజావిధానాన్ని అత డనుసరిస్తున్నాడు. మనం దానిని వ్యతిరేకిస్తున్నాము. అతనికి వచ్చిన బలమంతా దానివల్ల.

వైష్ణవులందరికీ ఆ ఆచార్యుడేగదా ఆదర్శపురుషుడు' అన్నాడు భృంగాచార్యుడు విచారంగా.

'రామానుజుడు చెప్పినప్పుడే మనం పూజావిధానాన్ని మార్చుకొని ఉండవలసింది. ఇప్పుడు మనం అలా చేయలేము గదా?'

'అప్పుడే మనం అంగీకరించివున్నా అతని ఘనతే పెరిగి ఉండేది. ఇప్పుడు మనం ఏమనుకొనీ లాభంలేదు.'

'ఈ క్లిష్ట పరిస్థితిని దాటడానికి మార్గ మేమీలేదా?'

'నాకేమీ కనబడడంలేదు' అన్నాడు భృంగాచార్యుడు, తల ఆడిస్తూ. అతని ముఖం విచారావృతమయింది.

'ఈవిధంగా చేస్తే' భృంగాచార్యుని కళ్ళలోకి చూస్తూ అన్నాడు శేషాచార్యుడు.

'ఏవిధంగా?'

'రామానుజుణ్ణి అంతమొందిస్తే?'

ఆమాట వినేసరికి భృంగాచార్యుడు తమ్నతానే నమ్మలేక పోయాడు. తనకు తోచినట్టుగానే శేషాచార్యునికీ తోచడం అతని కాశ్చర్యం కలిగించింది. కొన్నిక్షణా లతడేమీ మాట్లాడలేదు.

'ఏమి టాలోచిస్తున్నారు?' ప్రశ్నించాడు శేషాచార్యుడు.

'అలాచేస్తే ప్రజ లూరుకుంటారా? వైష్ణవు లూరుకుంటారా?'

'ప్రజల విషయం నేను చెప్పలేనుగాని వైష్ణవులు తప్పని సరిగా ఊరకుండవలసివస్తుంది.'

'ఎందువల్ల?'

'మొదట వారుగూడ కొంత ఆగ్రహించవచ్చు. కాని తిరు మంత్రాన్ని అందరికీ చెప్పివేసిన మహాపాపి అంతమయినా, ఫరవా లేదని వారికి తిన్నగా నచ్చజెప్పవచ్చు.'

'కాని ప్రజలు?'

'ప్రజలేమున్నది? ఒకసారి గప్పుమంటారు. మరలా ఊరు కుంటారు. పైగా రామానుజుని హత్యకు కారకు లెవరో తెలిస్తే గదా?' అంటూ ఏదో చెప్పబోయాడు శేషాచార్యుడు.

'ఇంతకూ అతణ్ణి అంత మొందించే దెలా ?'

'ఆ విషయాన్ని నాకు వదలిపెట్టండి. రేపు సాయంత్రానికి చూడండి. ఏమి జరుగుతుందో మరి.'

'అది సరే. జాగ్రత్తగా ఉండాలి. ఏమాత్రం పొరబాటుబడినా మన ప్రాణానికే ముప్పువస్తుంది.' అన్నాడు భృంగాచార్యుడు, ఇటూ అటూ చూస్తూ.

ఆ తరువాత ఆచార్యు లిద్దరూ హెచ్చుగా మాట్లాడుకోలేదు. భృంగాచార్యునివద్ద సెలవుదీసుకొని శేషాచార్యుడు వెళ్ళిపోయాడు.

శేషాచార్యుడు ఇంటికివెళ్ళి భోజనంచేస్తూనే తన భార్యను దగ్గరకు పిలిచాడు.

'భిక్షకై రామానుజుదు రేపు మన వీధికి వస్తాడు. అప్పుడు మనం అతనికి భోజనం పెటాలి' అన్నాడు.

భర్తమాటలు విని తిరుక్కొచ్చి ఆశ్చర్యపడింది. ఎల్లప్పుడూ రామానుజుని విమర్శిస్తున్న తనపతి ఆ రామానుజునికి భిక్షపెట్టాలనడం ఆమెకు నిజంగా అచ్చెరువు కలిగించింది.

'ఏమి, మాట్లాడవు ?' ప్రశ్నించా డాచార్యుడు.

'ఏమీలేదు. మీ మనస్సు మారడాన్నిచూచి' అన్నదామె.

శేషాచార్యుడు రామానుజుణ్ణిగూర్చి ఏమేమో విమర్శించే వాడు. అతడు గురుద్రోహియని, పాపాత్ముడని, మహామహులకు మాత్రమే చెప్పదగిన తిరుమంత్రాన్ని, దాని రహస్యాన్ని అందరికీ చెప్పివేసి దైవదూషణకు పాల్పడ్డాడని, పంచములనుగూడ చేరదీస్తున్నాడని, వర్ణాలతో నిమిత్తంలేకుండా, సంప్రదాయాలనన్నిటినీ భగ్నం గావిస్తున్నాడని, తనను మించినవాడు లేడని గర్విస్తున్నాడని, అందరిదీ ఒకపద్ధతయితే ఆతనిదిమాత్రం మరొకపద్ధతి అనీ, కడకు ఆలయంలో వందలాదివత్సరాలనుండి వస్తున్న పూజావిధానాన్ని గూడ ఆత డంగీకరించడంలేదని, ఆలాటి తిరుగుబాటుదారుణ్ణి తా నెచ్చటా చూచిఉండలేదని, వైష్ణవులలో ఆలాటి భ్రష్టు దెవ్వడూ లేడని....ప్రతిదినం అంటూఉండేవాడు శేషాచార్యుడు, ఆలాటివా

వానాడు రామానుజునికి భిక్షపెట్టాలని అన్నప్పు డతని మనస్సు మారిందేమోనని అనుకొన్నది తిరుక్కొచ్చి.

శేషాచార్యుడు నవ్వాడు.

తిరుక్కొచ్చికి మాత్రం భర్త విమర్శ ఏమాత్రం పరిపడేది గాదు. ఆమెకు రామానుజుడంటే సానుభూతేగాక భక్తిగూడ ఏర్పడి ఉంది. ఆమెకే గాదు. ఆ చుట్టుపక్కల గృహాలలో ఉన్న స్త్రీలకు గూడ ఆయనంటే ఎంతో ఆప్యాయత ఉన్నది. వారు నలుగురూ కలుసుకొన్నప్పుడు రామానుజుణ్ణి గూర్చే మాట్లాడుకొంటూ ఉంటారు. శైవులైన స్త్రీలకుగూడ అతడంటే భక్తి ఏర్పడి ఉన్నది.

శేషాచార్యుడు రామానుజుని విమర్శించినప్పుడెల్లా తిరుక్కొచ్చి అతని కడ్డు తగిలేది. రామానుజుడు దైవాంశసంభూతుడని చెప్పేది. ఆ మహానుభావు ణ్ణిలా విమర్శించడం మంచిది గాదనేది. ఏనాటికైనా అతడు తన మనస్సును మార్చుకొనక తప్పదని పలికేది. తా నన్నట్లే తన భర్త మారాడు. అందువల్లనే రామానుజునికి భిక్ష పెట్టాలంటున్నాడు - అనుకొన్నదామె. అందుకే, భర్తతో 'నే నన్నట్లే జరిగింది. ఏనాడో ఒకనాడు మీరు మారక తప్పదని నే నన్నది ఇన్ని దినాలకు నిజమయింది.' అన్నది ఆనందంతో.

శేషాచార్యుడు మరల నవ్వాడు.

'పిచ్చిదానా! ఇత డెన్నడూ మారేవాడు గాదు. నీవు భ్రమ పడుతున్నావు. ఆ మహాపాపిని తుదముట్టించాలనే అతణ్ణి రేపు భిక్షకు పిలవాలని నే ననుకొన్నాను.'

ఆ మాటలు విని తిరుక్కొచ్చి అదిరిపడింది.

'రేపు రామానుజుడు వచ్చినప్పుడు నీవే అతణ్ని భిక్షకు పిలవాలి. నీ చేతులారా అతనికి విషాన్నం పెట్టాలి. తెలిసిందా?'

వికటంగా నవ్వాడు శేషాచార్యుడు. అప్పటికిగాని ఆమెకితని మనస్సు అర్థం గాలేదు. ఆ మాట వినడంతోటే ఆమె కంపించింది.

రామానుజునికి తన చేతితో విషాన్నం పెట్టడమా? అది సాధ్యమా? తా నెన్నటికీ అలా చేయజాలదు అనుకొన్నదామె.

'తిరుక్కొచ్చీ, యిటుచూడు. అందులో ఏమాత్రం తప్పు లేదు. అతడు మహా పాపి. గురుద్రోహి, వైష్ణవద్రోహి. అతణ్ణి హతమారిస్తే పుణ్యం వస్తుందిగాని పాపం రాదు.'

ఆమె మాట్లాడలేదు. ఏమి మాట్లాడాలో గూడ ఆమెకు తోచలేదు.

'నేను విషం తెచ్చి ఉన్నాను. దానిని నేనే స్వయంగా అన్నంలో కలుపుతాను. నా యెదుటనే నీ వా అన్నాన్ని అతనికి పెట్ట వలసి ఉంటుంది.' అన్నాడు శేషాచార్యుడు.

భయంతో అతనివైపు చూచింది తిరుక్కొచ్చి. అతనిముఖం వికృతంగా కనబడ్డది. అత డొక మృత్యుదేవతలాగా అగుపడ్డాడు.

'చూడు, ఆలోచించి లాభం లేదు. మనస్సు రాయి చేసుకో వాలి. ఇది వైష్ణవోద్ధరణకు చేయబడే పని. మన మతోద్ధరణ కోసం మనమేమైనా చేయవలసి వుంటుంది.' అన్నాడు శేషాచార్యుడు.

'ఆ పని నేను చేయలేను.'

'అలా అంటే లాభం లేదు, నీవు చేయకుంటే నేనైనా ఆ పని చేయవలసి వుంటుంది. గత్యంతరం లేదు. కాని నే నా పని చేస్తే అది అందరికీ తెలిసిపోతుంది. అందువల్ల నీవే చేయవలసి వుంటుంది. నాకోసం నీ వా పని చేసి తీరాలి.'

'ఆ పాపకార్యాన్ని నేను చేయలేను. అందులోను మహాభాగు డైన రామానుజుణ్ని హతమార్చడం అంటే నే నంగీకరించను.'

'లాభం లేదు. నీ వా పని చేసితీరాలి. నేను మాట యిచ్చి వున్నాను.'

ఆమె కేమీ పాలుపోలేదు. ఏమిచెప్పాలో తోచలేదు.

శేషాచార్యుడు చాల కఠినుడు. అనుకొన్న పని నేలాగైనా చేసి తీరుతాడు. అందుకోసం ఏమైనా చేస్తాడు. ఎవ రడ్డొచ్చినా ఆగడు. అతని స్వభావం అందరికీ తెలుసు, తిరుక్కొచ్చికి మరింత చక్కగా తెలుసు. అందువల్ల ఆమె భయపడజొచ్చింది.

'ఏం, మాట్లాడవు! చెప్పు మరి. చేస్తావు గదా!'

ఆమె మాట్లాడలేదు.

'చూడు తిరుక్కొచ్చీ. పాపమని భయపడితే లాభంలేదు. నీ వా పని నేను చెప్పినందువల్ల చేస్తున్నావు. ఒకవేళ ఆ పని పాపమే అయితే అది నాకే వర్తిస్తుంది.'

'పాపమో కాదో నా మన స్సంగీకరించలేదు.'

'బాగుగా ఆలోచించుకో. భర్త కెదురాడడం చాల తప్పు.'

ఆమె మాట్లాడలేదు.

'నేను చెబుతున్నాను విను. నీ వా పని చేసితీరాలి. లేకుంటే....' అతని ముఖం మరింత వికృతమయింది. అతని క్రూరత్వం అతని మోములో ప్రతిఫలించింది. దానిని చూచి ఆమె భయపడింది.

తన భర్త ఎంతకైనా తెగిస్తాడని ఆమెకు తెలుసు, అతని మాట వినకుంటే చావమోదుతాడు. ఇంటినుండి గెంటివేస్తాడు. ఒక మా రీలాగే ఇద్దరిమధ్య తగువు వచ్చింది. అప్పు డత డామెను తరిమివేశాడు. మరల రెండేండ్లు ఇల్లు తొక్కనివ్వలేదు. ఆ విషయం జ్ఞప్తికివచ్చి ఆమె కంపించింది.

'అర్థమయిందా ! ఏం మాట్లాడవు ?' అతడు గద్దించాడు.

ఏమి చెప్పాలో ఆమెకు తోచలేదు.

'ప్రాణాలతో ఉండాలంటే నేను చెప్పినట్లు చేయాలి, లేకుంటే అతనికి బదులు నిన్నే....' లేచి కొట్టబోయాడు.

ఆమె అదిరిపడింది. ఇక తనకాపురం చెడుతుందని భయ పడింది. మరల తాను నిరాశ్రయురాలు కావలసివస్తుందని బెదిరి పోయింది. గతంలో తన తల్లైనా జీవించి ఉండేది, తన్నాదుకోవ డానికి. ఈనా డెవ్వరూలేరు. పైగా అప్పుడున్న శక్తిగూడ తన కిప్పుడులేదు.

'ఎందుకలా మీదబడుతారు ? అలాగే చేస్తాను లెండి' అన్న దామె.

'నిజంగానే చెబుతున్నావా ?' తిరిగి గద్దించా డతడు.

'అవును, నిజంగానే చెబుతున్నాను' అన్నదామె.

'రంగనాథుని సాక్షిగా చెప్పు.'

'రంగనాథుని సాక్షిగా'. ఆమాట అన్నప్పు డామె కళ్ళలో నీళ్లు తిరిగాయి.

శేషాచార్యుడు నవ్వాడు. 'అప్పుడే ఆమాట అనివుంటే ఎంత బాగుండేది? దేవునికైనా దెబ్బేగురువంటారు. గద్దించంది దేనినీ అంగీకరించవుగదా?'

ఆమె ఏమీ మాట్లాడకుండా కళ్ళనీళ్లు తుడుచుకొన్నది.

'సరే, వెళ్ళి పడుకో. ఉదయమే లేచి ఆపనిచూద్దాం.'

ఆమె వెళ్ళి పడుకున్నది. కాని నిద్ర రాలేదు. అదివరకు తా నే మహామహుణ్ని ఆరాధించిందో ఆ మహావ్యక్తికే తా నిప్పుడు విషాన్నం పెట్టవలసిఉన్నది. అంతకంటె దారుణమైన విషయ మే మున్నది?

ఆవిధంగా చేయకుంటే తనప్రాణం పోతుంది. పోతేమాత్ర మేమి? తను మరణిస్తే విచారించేవా రెవ్వరు? కాని ఆ మహా భాగుడు మరణిస్తే లోకాని కెంతో నష్టం కలుగుతుంది. కాని తాను తనభర్త నెదిరించగలుగుతుందా? ఎదిరించి మన గలుగుతుందా? తన కంత ధైర్యమున్నదా?

ఏవిధంగానైనా ఆ మహాత్ముణ్ని రక్షించాలి. కాని ఎలా రక్షించడం? ఆమె కేమీ తోచలేదు. ఆమె మనస్సేమీ బాగుగాలేదు. ఆమె బాధ చెప్పతరంకాదు.

తెల్లవారింది. ప్రొద్దెక్కుతున్నది. తిరుక్కొచ్చి ఎంతో రుచి కరమైన పదార్థాలను వండసాగింది. ఆ పదార్థాలను రామానుజునికి పెట్టి ఆనందించగలభాగ్యం తనకులేకున్నది. ఆ పదార్థాలతోనే ఆ దివ్యపురుషుని ప్రాణాలను హరించవలసిన దౌర్భాగ్యం తన నుదుట వ్రాసి ఉన్నది. ఆమెకు దుఃఖం వచ్చింది. అశ్రువులు కట్టలు తెంచు కొన్నవి భర్త చూస్తాడేమోనని ఆమె తనచీర చెరగుతో కన్నీ రొత్తుకొన్నది. కాని ఆమె దుఃఖ మాగలేదు. ఏలాగో ఒకలాగు దుఃఖాన్ని దిగమింగుకొని వంట పూర్తి గావించింది.

రామానుజుడు భిక్షాపాత్రను తీసుకొని బయలుదేరాడు. శేషాచార్యుడున్న వీధికి వచ్చాడు. మలుపు తిరుగుతూనే ఆ వీధిలో రెండో యిల్లు ఆచార్యునిది. గబగబా అతడు లోనికివెళ్ళి భార్యను పిలిచాడు. వెళ్ళి రామానుజుణ్ణి భిక్ష కాహ్వానించమన్నాడు. తిరుక్కొచ్చి కంపిస్తూ వీధిలోకి వెళ్ళింది. రామానుజుణ్ణి చూస్తూనే ఆమెకు దుఃఖం పొంగి పొరలింది. దుఃఖాన్ని దిగమింగుతూ, కన్నీటిని ఒత్తుకొంటూ ఆమె ఆ యతీశ్వరుణ్ణి భిక్షకు పిలిచింది. అతడు మందహాసవదనంతో ఆ ఇంటిముందు నిలిచాడు.

రామానుజు డానాడు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు.

ప్రతిదినం అత డుదయం కొంత ప్రొద్దెక్కిన తరువాత భిక్షకు వస్తుంటాడు. పదిండ్లవద్ద భిక్ష తీసుకొంటాడు. సరిపోతే ఒక యింటితోనే చాలిస్తాడు. చాలక పోయినప్పటికీ పదిండ్లతో ఆ భిక్షను పూర్తిచేసుకుంటాడు. ఆ విధంగానే ఆనాడు అతడు భిక్ష కోసం ఆ వీధికి వచ్చాడు. అలా వస్తాడని శేషాచార్యునికి తెలుసు. అందుకనే అతడు ముందుగానే తన భార్యను హెచ్చరించి భోజనం సిద్ధం గావించాడు.

తిరుక్కొచ్చి లోనికి వెళ్ళేసరికి శేషాచార్యుడు భోజనంలో విషం కలుపుతున్నాడు. ఒకటి రెండు క్షణాలలో అతడు తన పనిని పూర్తిగావించి ఆ భోజనాన్ని విస్తరిలో పెట్టమన్నాడు. ఆమె ఆ పదార్థాలను మార్చివేస్తుందేమో నని ప్రక్కనే నిలబడి చూడసాగాడు. అందువల్ల ఆమె ఏమీ చేయలేక ఆ విస్తరి నొక పాత్రలో పెట్టుకొని వెలుపలికి వచ్చింది. రామానుజుణ్ణి చూస్తూనే ఆమె హస్తాలు కంపించాయి. ఆమె నరాలు వణికాయి. ఆమె గుండె ఆగిపోయిం దనిపించింది. ఎలాగో ఒకలా గామె ఆ భోజనాన్ని ఆమహామహుని భిక్షాపాత్రలో ఉంచగలిగింది. వెంటనే కిందికొరిగి అతని పాదాలమీద బడిపోయింది.

తన పాదాలమీద ఆమె ఏదో వ్రాస్తున్నట్లు రామానుజుడు గమనించాడు. 'తినకండి', 'తినకండి' అని రెండుమార్లామె తన అడుగులమీద వ్రాసిన ట్లనిపించిం దతనికి. అతని కామె అలాచేయడం

ఆశ్చర్యాన్ని కలిగించింది. రామానుజు డామె నాశీర్వదించాడు. ఆమె లేచి నమస్కరించి పాత్రను తీసుకొని లోనికివెళ్లింది. శేషాచార్యుడు గూడ ఆమెతోటే లోనికి వెళ్ళాడు. అతని ఆనందానికి మేరలేక పోయింది. అతడు తిరుక్కొచ్చిని కౌగిలించుకొన్నాడు. భార్య అంటే అలా ఉండాలన్నాడు. ఇక రామానుజుడు అంతమైనక్లేనని ఉప్పొంగిపోయాడు. ఆ విషయాన్ని భృంగాచార్యునికి చెప్పి రావడానికి వెంటనే వెళ్ళిపోయాడు.

తిరుక్కొచ్చికి కంప మింకా ఆగలేదు. తాను చేసిన సంజ్ఞను రామానుజుడు గ్రహించాడో లేదో నన్నసందేహం ఆమెను పట్టుకొన్నది. ఒకవేళ గ్రహించకున్నట్లయితే - ఆమె వణికిపోయింది. ఆ మహామహుణ్ణి రక్షించమని ఆమె పరాత్పరుణ్ణి ప్రార్థించింది.

# 4

## రాజేంద్రుడు

రాజేంద్రుడు చక్రకూటంపైకి దండెత్తి వెళ్ళాడు. వెడుతున్నప్పుడు తన పినతండ్రియైన విజయాదిత్యుణ్ణి వేంగిరాజ్యానికి తాత్కాలికంగా అధిపతిని గావించాడు.

రాజేంద్రుడు తమమీదికి వస్తున్నాడని చక్రకూటాధిపతికి తెలిసింది. వెంటనే అతడు యుద్ధాకి సిద్ధమయ్యాడు. ఉన్న సేనల్ని సమాయత్తం గావించుకొని రాజేంద్రుణ్ణి ఎదుర్కొన్నాడు.

రాజేంద్రుడు యువకుడు. రాజరాజు మరణిస్తూనే అతడు రాజ్యానికి వచ్చాడు. రాజ్యానికి వస్తూనే దండయాత్రను ప్రారంభించాడు. తన అపార సేనావాహినుల్ని తీసికొని చక్రకూటంమీదికి వెళ్ళాడు.

వేంగిరాజుబలం చక్రకూటరాజుకు తెలియకగాదు. తాను జయించగలననే విశ్వాసంతోగాదు రాజేంద్రుణ్ణి ఎదుర్కొనడం, యుద్ధంచేయకుండా లొంగిపోవడం రాజధర్మం కాదని. అందువల్ల అతడు రాజేంద్రునితో పోరాడడానికే నిశ్చయించుకొన్నాడు.

చక్రకూటసైన్యం సన్నద్ధమై ముందుకువచ్చింది. చాళుక్య సేన దానిని మార్కొన్నది. యుద్ధం భయంకరంగా జరిగింది. రెండు వైపులా చాలనష్టం కలిగింది. అయినప్పటికీ ఎవ్వరూ వెనుకంజ వేయలేదు. చక్రకూటరాజైన మణవాలుడు మధ్యందిన మార్తాం డునిలాగా విజృంభించి పోరాడాడు. అతని వీరత్వమే అతని సైన్యానికి ఆదర్శప్రాయమయింది. అందువల్ల చక్రకూటసైన్యం వెనుకంజ వేయకుండా పోరాడింది.

రాజేంద్రుడుగూడ సామాన్యుడుగాడు. నారనదేవు డతని సైన్యాధిపతి. యుద్ధాలలో కాకలుతీరిన మేటి శూరుడు నారనదేవుడు. అసామాన్యమైన అతని వ్యూహరచనావిధానము, అనన్యమైన రాజేంద్రుని పరాక్రమము చక్రకూటసైన్యాన్ని చిందరవందర గావించాయి. నారనదేవుని చేతిలో చక్రకూటరాజైన మణవాలుడు అసువులు కోల్పోయాడు. అప్పుడు విధిలేక సైన్యం చాళుక్యసైన్యా నికి లోబడిపోయింది.

రాజేంద్రుడు చక్రకూటాన్ని పట్టుకొని అచ్చట రామనాయ కుణ్ణి అధిపతిగావుంచి పూర్వరాజ్యాల మీదికి వెళ్ళాడు. అచ్చటగూడ అతనికి విజయం చేకూరింది. తరువాత అతడు తన రాజ్యానికి వెళ్ళడాని కుపక్రమించాడు. అప్పటికి అతనితో ఉన్న సైన్యం చాల వరకు దెబ్బతిని ఉంది. ఉన్న సైన్యంగూడ చాల అలసిపోయివుంది.

రాజేంద్రుడు వేంగిరాజ్యపు పొలిమేరలలో ప్రవేశించేసరికి విజయాదిత్యుని సైనికులువచ్చి అతడు లోనికి రావడానికి వీలులే దన్నారు. అలా వస్తే ఎదిరించమని తమరాజైన విజయాదిత్యుడు తమ్మాదేశించాడని వారన్నారు. ఆ మాట విని రాజేంద్రునికి చాల కోపంవచ్చింది. పొలిమేరలను దాటి లోనికి వెళ్ళమని అతడు తన

సైన్యానికి ఆజ్ఞయిచ్చాడు. ఇంతలో నారనదేవుడువచ్చి రాజేంద్రునితో -

'మహారాజా! త్వరపడడం మంచిదికాదు. పరిస్థితుల్ని తెలుసుకొని ఆమీద ఏమైనా చేద్దాము. ఇప్పు డాగడం మంచిది.' అన్నాడు.

నారనదేవుడంటే రాజేంద్రునికి చాలగౌరవముంది. అందువల్ల అతడు తన సేనాని మాటల్ని గౌరవించి సైన్యాన్ని ఆగమన్నాడు. సైన్యం ఆ పొలిమేరలవద్దనే గుడారాలు వేసుకొని ఆ రాత్రి కక్కడే విడిసింది. ఈలోగా నారనదేవుడు తన వేగులవారిని పంపి ఉదయమయ్యేసరికి వాస్తవమైన విషయాలను సేకరించగలిగాడు.

రాజేంద్రుడు వేంగిరాజ్యాన్ని వీడి వెళ్ళగానే విజయాదిత్యుడు తన్నే రాజుగా ప్రకటించుకున్నాడని, దాని కంగీకరించక తిరుగుబాటు గావించిన సైనికాధికారుల్ని, ఇతరుల్ని బంధించి ఉంచాడని అప్పటినుంచి ఆ సరిహద్దులో సైన్యాన్ని హెచ్చించి తనకు విశ్వాసపాత్రులయిన సేనానుల్ని అచ్చట కాపలా ఉంచాడని, రాజేంద్రుడు తిరిగివస్తే మరలిపొమ్మని మొదట హెచ్చరించి, వినకపోతే తరుమగొట్టమని, అవసరమైతే అతణ్ణి పట్టితెమ్మని ఆజ్ఞ ఇచ్చాడని, ఆ సరిహద్దులలో అసంఖ్యాకమైన సేన విడిసి ఉన్నదని, ఆ సేనతో ఢీకొనడం చాల కష్టమని నారనదేవునికి తెలిసింది.

ఆ విషయాలను సేనాని తన రాజుకు చెప్పాడు. ఆ సమయంలో విజయాదిత్యుణ్ణి ఎదుర్కొనడం మంచిదికాదని, ఎదుర్కొన్నప్పటికీ ఫలితం శూన్యమని, పైగా చాలనష్టదాయకమని, అందువల్ల చక్రకూటానికి తిరిగివెళ్ళి అచ్చట ఆ రాజ్యంతోపాటు పూర్వరాజ్యాలనుగూడ ఏకం గావించి పరిపాలిస్తుంటే ఏనాడైనా సమయం రాకతప్పదని, అప్పుడు వేంగిరాజ్యాన్ని విజయాదిత్యుని హస్తాలనుండి రక్షించవచ్చునని అతడు రాజేంద్రునికి నచ్చజెప్పాడు. సేనాని సలహా ననుసరించి ఆ రాజు తన సైన్యాన్ని తీసుకొని చక్రకూటానికి వెళ్ళి అచ్చటే రాజ్యపరిపాలన గావింపసాగాడు. కాని అతనికి తృప్తి కలగలేదు.

వేంగిరాజ్యం తనరాజ్యం. దండయాత్రకి బయలుదేరుతూ తన పినతండ్రి నా రాజ్యానికి తన ప్రతినిధిగా వుంచి వెళ్ళాడు తాను. కాని అతడు విశ్వాసఘాతకుడయ్యాడు. ఆ రాజ్యాన్ని తానే కబళించాడు. అందువల్ల తాను చక్రకూటంలో ఉండవలసి వచ్చింది. చక్రకూటం గూడ తన చేతుల్లోకి రాకుండావుంటే ఏమైవుండేది? రాజేంద్రు డాలోచించాడు. అతనిమనస్సు వ్యగ్రమయింది. ఏవిధంగానైనా తన రాజ్యాన్ని తాను సాధించాలనిపించిం దతనికి. కాని సాధించడమెలా ?

చక్రకూటానికి తిరిగివచ్చిన తరువాత రాజేంద్రుడు త్వరత్వరగా తన సైన్యాన్ని హెచ్చింపనారంభించాడు. పదాతుల్నేగాక అశ్వికదళాన్నిగూడ రెండురెట్లు గావించాడు. కాని ఆ బలం చాలదు. వేంగిరాజ్యాన్ని జయించడానికి. ఏమి చేయాలి తాను ? ఏలాగైనా తన రాజ్యాన్ని పట్టుకొని తన పినతండ్రి కొక గుణపాఠం చెప్పాలి. అతణ్ణి తుత్తునియలుగావించి గృధ్రాలకు, సృగాలాలకు వేయించాలి. అతని మనస్సు ప్రతిక్రియాకాంక్షతో దహించుకు పోయింది.

చోళరాజైన వీరరాజేంద్రుడు సాయమడిగితే — అతని హృదయం ఒక్కసారి మెరిసింది. అతడు తన బంధువు. అందువల్ల తప్పనిసరిగా సాయంగావిస్తాడు ఆ ఆలోచన అతనికెంతో ఉత్సాహాన్ని, ఆనందాన్ని కలిగించింది.

రాజేంద్రుడు తూర్పుచాళుక్య వంశానికి చెందినవాడు. చాళుక్యులకు, చోళులకు మొట్టమొదటనుండి బాంధవ్యముంది. రాజేంద్ర చోళునికి తూర్పుచాళుక్యుడైన మలయాదిత్యుడు బావమరిది. ఆ మలయాదిత్యుని కుమారుడే మహాభారత కృతిభర్తయైన రాజరాజ నరేంద్రుడు.

రాజరాజనరేంద్రుని కాలంలో ఆంధ్రులు చాల ఉన్నతస్థితికి వచ్చారు. ఆ రోజుల్లో కళలలోనేగాక వ్యాపారంలో గూడ ఆంధ్ర రాజ్యం అత్యున్నతి నందింది.

బాల్యంలో రాజరాజు తన తాతగారైన చోళరాజు ఇంటి వద్దకు వెళ్ళినప్పుడు తమిళ భారత పఠనాన్ని విన్నాడని, తెలుగులో

గూడ మహాభారతాన్ని రచింపజేస్తే బాగుంటుందని అప్పు డత డనుకొన్నాడని, ఆ తరువాత తాను రాజైనప్పుడు మహాకవుల నంద రినీ రావించి ఆ గ్రంథాన్ని అనువదించమన్నాడని, సంస్కృతం నుండి తెలుగులోకి భారతం అనువదించబడాలంటే దానికి కావలసిన పదజాలం తెనుగులో లేదని, అందువల్ల మొట్టమొదట కొన్ని సంస్కృతపదాలను తెలుగులో ఇముడ్చుకోవలసివుంటుందని వారు చెప్పారని, అప్పు డా రాజు నన్నయ భట్టారకుని ఆధ్వర్యాన కవుల తోను, పండితులతోను గూడిన ఒక సదస్సు నేర్పరిచాడని, ఆ సదస్సు చాలకాలం చర్చలు కొనసాగించి కొన్ని సూత్రాలను రూపొందించి ఆ సూత్రాల ప్రకారం ఏఏ సంస్కృత పదాలను తెలుగులో యిముడ్చుకొనడానికి వీలుంటుందో వాటిని నిర్ధారణ గావించిందని, ఆ తరువాతనే మహాభారతాన్ని తెనుగు చేయడానికి రాజరాజు నన్నయభట్టారకుణ్ణి నియమించాడని, సదస్సుకు ఆధ్వ ర్యం వహించి దాని కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించి భారతేతిహాసాన్ని సంస్కృతం నుండి తెనుగుచేయడానికి పూను కొన్నందువల్లనే ఆ భట్టారకునికి వాగనుశాసను డనే బిరుదు వచ్చిం దని ఒక ప్రతీతి ఉంది. అది నిజమో కాదో గాని, రాజరాజు కాలంలో ఆంధ్రభాష చాల అభివృద్ధి జెందిందని, ఆంధ్రసాహిత్య చరిత్రలో అదొక అభ్యుదయ ఘట్టమని చెప్పవలసి ఉంటుంది.

రాజరాజనరేంద్రుని కాలంలోనే గొప్ప గణిత శాస్త్రజ్ఞుడైన మహా వీరాచార్యుని గణితసార సంగ్రహాన్ని పావులూరి మల్లనకవి తెనుగులోకి అనువదించాడు. ఆవిధంగా సంస్కృతానువాదాలకు రాజరాజు చాల ప్రోత్సాహమిచ్చాడు.

రాజరాజనరేంద్రుడు చోళరాజైన ప్రథమ రాజేంద్రుని కుమా ర్తెను పరిణయమాడాడు. ఆమెపేరు అమ్మంగదేవి. ఆ విధంగా తూర్పు చాళుక్యులకు, చోళులకు రెండవతరంలో గూడ బంధుత్వ మేర్పడింది.

రాజరాజు కుమారుడే రాజేంద్రుడు. అతడు రెండవరాజేంద్ర చోళుని కుమార్తెయైన మధురాంతకిని వివాహమాడాడు. ఆనాడు

కాంచీపురాన్ని పాలిస్తున్న వీరరాజేంద్ర చోళుడు రెండవ రాజేంద్రుని సోదరుడు. కనుక వీరరాజేంద్రుడు రాజేంద్రునికి ఒకవిధంగా మామ గావలసి ఉన్నది. కనుకనే రాజేంద్రునికి చోళుల సహాయాన్ని కోరాలనే ఆలోచన పొడమింది.

రాజేంద్రుడు వెంటనే తన సేనానియైన నారనదేవుని రప్పించి ఆ విషయమై సలహా అడిగాడు. ఆ ఆలోచన చక్కగానే ఉన్నదన్నాడు నారనదేవుడు.

చోళుల సాయాన్ని అర్థించాలన్న నిర్ణయానికి వచ్చిన తరువాత వారివద్ద కెవడు వెళ్ళాలన్న ప్రశ్న ఉదయించింది.

'మీరే వెళ్ళి రావాలి.' అన్నాడు రాజేంద్రుడు.

'మరెవరినైనా పంపితే.........'

'లాభంలేదు. మీరే వెళ్ళి రావాలి. కాంచీపురంలో మీకు తెలియని వారు లేరు. మీరు వెడితే వారిని సమ్మతింపజేయడానికి వీలుంటుంది.' అన్నాడు రాజేంద్రుడు.

నారనదేవుడు మారు మాట్లాడలేదు. కాంచీపురానికి వెళ్ళి రావడాని కంగీకరించాడు.

నారనదేవుడు తనతోపాటు మరికొంత పరివారాన్ని తీసుకొని కాంచీపురానికి బయలుదేరాడు. ఆ పట్టణం చేరడానికి రెండు క్రోసులున్న దనగానే అచ్చట శిబిరాలు వేయించి తమరాకను వీరరాజేంద్రుని కెరిగించడానికి ప్రధానోద్యోగుల నిద్దరిని పంపాడు. వారు వెళ్ళినప్పుడు వీరరాజేంద్రు డస్వస్థుడై యున్నాడు. అందువల్ల వారు యువరాజైన అధిరాజేంద్రుణ్ణి కలుసుకొని నారనదేవుని రాక నతని కెరిగించారు. యువరాజు వెంటనే తన సేనానియైన సోమదేవుణ్ణి పిలిచి నారనదేవుణ్ణి ఆహ్వానించడానికి కావలసిన ఏర్పాట్లు చేయమన్నాడు.

సోమదేవు డొక సేనానికి తగినట్లు నారనదేవుణ్ని ఆహ్వానించి తన భవనానికి తీసుకొని వెళ్ళాడు అచ్చట అతడు చాళుక్య సేనానికి, అతని పరివారానికి విందు గావించాడు. ఆ రాత్రి నారనదేవుడు, అతని పరివారం తమ కివ్వబడిన విడిది గృహాలలో విశ్రాంతి తీసుకొన్నారు.

నారనదేవు డుదయమే లేచి తాను రాజుగారిని కలుసుకొనే ఏర్పాట్లు గావించమని సోమదేవునికి కబురంపాడు. సోమదేవుడు రాజుగారితో మాట్లాడి వారిద్దరూ ఏకాంతంగా చర్చించుకొనడానికి వీలు కలిగించాడు.

వీరరాజేంద్రుడు చాలా మెత్తని పాన్పుపైన శయనించి ఉన్నాడు. అతడు చాల బలహీనంగా ఉన్నాడు. నారనదేవుడు లోన ప్రవేశించే సరికి అచ్చట ఉన్న సేవకులు వెలుపలికి వెళ్ళిపోయారు.

నారనదేవుడు మహారాజుగారికి నమస్కరించాడు. సేనానిని కూర్చోమని చెప్పడానికని వీరరాజేంద్రుడు లేవబోయాడు. లేవవద్దని నారనదేవు దతణ్ణి వారించి అచట గల ఆసనంమీద కూర్చున్నాడు.

'రాజేంద్రుడు బాగున్నాడా ?' ప్రశ్నించాడు వీరరాజేంద్రుడు. అతని స్వరం చాల బలహీనంగా ఉంది. అదిగూడ ఆ దేముకైనా ప్రోవులోనుండి బలవంతంగా వెలువడుతున్నట్లనిపించింది.

'బాగున్నాడు. మీకు తన నమస్కృతు లందజేయమన్నాడు. మీ ఆరోగ్య మెలా ఉంది ?'

'ఇలావుంది' అన్నాడు రాజు. అతని కళ్ళలో విచారం వ్యక్తమయింది. నారనదేవునికిగూడ రాజు స్థితిని చూచి దుఃఖం వచ్చింది.

నారనదేవు డా రాజును చాలమార్లు కలుసుకొని ఉన్నాడు. రాజరాజుగాని, మరెవ్వరుగాని అతనంతబలంగా ఉండేవారుగారు ముందురోజుల్లో. అట్టివా డిలా అయ్యాడు. పరమేశ్వరుని కరుణ తప్పితే అంతే కాబోలు అనుకొన్నాడు.

'ఏం పనిమీద వచ్చారు ?' అని అడిగాడు రాజు సూటిగా.

'వేంగిరాజ్యాన్ని విజయాదిత్యు డక్రమంగా కాజేయడం మీకు తెలిసే ఉంటుందనుకొంటాను. ఆ తరువాత రాజరాజుకుమారుడైన రాజేంద్రరాజు చక్రకూటంనుండి పరిపాలన సాగించవలసిన దుస్థితి ఏర్పడిందనిగూడ మీకు తెలుసుననుకొంటాను. తన రాజ్యమైన వేంగిరాజ్యాన్ని తిరిగి సంపాదించడానికి మీ సాయాన్ని అర్థించమన్నారు' అన్నాడు నారనదేవుడు.

అధిరాజేంద్రుడు మాట్లాడలేదు.

'మీరిప్పుడు చేయి ఇవ్వకపోతే అధర్మం జయించినట్లే.'

'నా స్థితిని చూస్తున్నావుగదా! నేనిప్పు డేమీచేయలేని పరిస్థితిలో ఉన్నాను. అధిరాజేంద్రుడే అన్ని వ్యవహారాలను చూస్తున్నాడు. అతనితో సంప్రతిస్తేనే మంచిది.'

ఆ రెండుమాట లన్నందుకే రాజు కెంతో అలసట గలిగింది. ఇక అతణ్ణి మాట్లాడించి ప్రయోజనం లేదనుకొన్నాడు నారన దేవుడు. పూర్తిగా విశ్రాంతి తీసుకొనవలసిందని, ఇతర రాజ్యాల నుండి వైద్యుల్ని రప్పించి పరిశీలనచేయించుకోవలసిందని, ఇక ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ కాలం గడపివేయవలసిందని సలహాఇచ్చి, నమస్కరించి రాజుగారివద్ద సెలవుదీసుకొని తన విడిదికి వెళ్ళాడు.

ఆ తరువాత కొంత సేపట్లో నారనదేవుని కలుసుకోవడానికి సోమదేవుడు వచ్చాడు. మధ్యాహ్నం యువరాజుగారు అతనికోసం విందుగావిస్తున్నాడని, ఆ విందులో మంత్రిగారైన త్రిపురాంతకుడు కూడ పాల్గొంటాడని, అప్పుడు సహాయం విషయమై చర్చించ బడుతుందని సోమదేవుడు చాళుక్యసేనానికిచెప్పి వెళ్లాడు. మధ్యాహ్నం అవుతూనే మరల వచ్చి నారనదేవుని తీసుకొని యువరాజు మందిరానికి వెళ్ళాడు.

సోమదేవుడు, నారనదేవుడు వెళ్ళేసరికే యువరాజు, మంత్రి త్రిపురాంతకుడు అచ్చట కూర్చొని ఉన్నారు. అధిరాజేంద్రుడు పెద్ద వాడైన తరువాత అతణ్ణి తాను చూడడ మదే మొదటిసారి. రాజ రాజుతో అతడు కాంచీపురానికి వచ్చినప్పు డతడు చాల చిన్నవాడు. ఇప్పుడు మంచి యౌవనంలో ఉన్నాడు.

నారనదేవు డధిరాజేంద్రునికి గౌరవపురస్సరంగా నమస్కరించాడు. మంత్రి త్రిపురాంతకుడు లేచి మందహాసంచేస్తూ నారన నాహ్వానించాడు. యువరాజు ఆ సేనానిని కూర్చోమన్నాడు. పరిచయ వాక్యాలయినతరువాత వారు భోజనాలుగావించి రహస్యమందిరంలోకి వెళ్ళారు.

'మీరు వచ్చిన పనినిగూర్చి నాన్నగారు నాకు క్లుప్తంగా చెప్పారు' అన్నాడు యువరాజు చిరునవ్వునవ్వుతూ.

'ఆ విషయమై మీ రేమాలోచించారు?'

'మంత్రిగారు మీకు సాయంచేయడమే మంచిదంటున్నారు.'

'మరి మీసేనాధిపతిగా రేమంటున్నారో?' నవ్వుతూ సోమ దేవునివైపు చూచాడు నారన.

'నాదేమున్నదంటీ? యువరాజెలా చెపితే అలా. సేనాధి పతులమైన మనం పోరాడమంటే పోరాడడానికి సిద్ధంగా ఉంటాము' అన్నాడు సోమదేవుడు.

'మా రాజుగారికి సాయంచేయడమంటే ధర్మంవైపు నిల బడడం, అధర్మాన్నెదుర్కొనడం.'

'అది నిజమే. కాని___'

నారనదేవుడు యువరాజు కళ్ళల్లోకి చూచాడు.

'మాకు రాజేంద్రుడెంతో విజయాదిత్యుడుగూడ అంతే. ఒకరు మామగారు, ఒకరు బావమరిది. అందువల్ల సంకోచిస్తున్నాను. అంతేగాక నాన్నగారి కారోగ్యం సరిగా లేదు. వారి కేవేళ ఏమౌతుందో నని ఉంది'

నారనదేవుని మనస్సు కొంత చిందువడింది. అతనికి కలిగిన ఆశాభంగం అతని ముఖంలో ప్రస్ఫుటమవుతూనే ఉంది.

'రాజేంద్రుణ్ణి ఏమీ అనుకోవద్దని చెప్పండి. ఎప్పుడూ అతని క్షేమాన్ని కాంక్షిస్తూ ఉంటామని చెప్పండి' అన్నాడు యువ రాజు.

'మన కెన్ని కష్టాలున్నప్పటికీ రాజేంద్రరాజుగారికి సాయం చేయడమే మంచిదనిపిస్తున్నది నాకు' అన్నాడు మంత్రి.

'మీరు చెప్పిన విషయాలనన్నిటినీ నేను సాకల్యంగా పరిశీ లించాను. కాని ఇద్దరూ మనకు కావలసినవారు గనుక ఎవరికీ సాయంచేయకుండా ఉండడానికే నిర్ణయించుకొన్నాను.'

త్రిపురాంతకు డేమీ మాట్లాడలేదు.

రాజేంద్రునికి శైవమతమంటే చాల యిష్టమని త్రిపురాంతకునికి తెలుసు. అందువల్ల ఆ రాజును బలపరచడమంటే అతనికి చాల యిష్టం. కాని యువరాజందు కంగీకరించడంలేదు. ఏమి చేయాలి?

అధిరాజేంద్రుని చేతుల్లో అధికారం ఉన్నంతవరకు తనమాట యేమాత్రం సాగదు. రాజ్యవ్యవహారబాధ్యతను వహించిన తరువాత అతడు తన సలహా నొక్కదానినిగూడ స్వీకరించలేదు. అది ఆ మంత్రికి చాల కష్టాన్ని కలిగించింది.

'యువరాజుగా రలా అభిప్రాయపడినప్పుడు మీరుమాత్రం ఏమిచేయగలరు? మీరాజుగారితో ఆ విషయాన్ని చెప్పండి' అన్నాడు మంత్రి.

త్రిపురాంతకుడు మాట్లాడిన పద్ధతి యువరాజు కేమాత్రం నచ్చలేదు. ఆమాట లతనికి కొంతకోపాన్నిగూడ కలిగించినవి. కాని అతడు దాన్ని అణచుకొని——

'మీకు తెలియని దేమీలేదు. కావలసినవారిమధ్య పొరపులు వచ్చినప్పుడు వీలయితే వాటిని సరిచెయ్యాలి, లేకుంటే వూరుకోవాలి గాని ఒకపక్షంవహించి యుద్ధం చెయ్యడం నాకేమాత్రం నచ్చదు.'

'మీయిష్టం. మీరు చెప్పిన మాటల్ని మా రాజుగారితో చెబుతాను' అన్నాడు నారనదేవుడు.

ఆ తరువాత ఆ సమస్యను విడిచి తక్కిన విషయాలనుగూర్చి వారు కొంత తడవు మాట్లాడుకొన్నారు.

మాటలయినపిదప నారనదేవుడు యువరాజువద్ద సెలవు తీసుకొని వెళ్ళాడు. సోమదేవుడు ఆ సేనానితోవెళ్ళి విడిదిలో దిగ విడిచి వచ్చాడు. వారివెంటవెళ్ళిన త్రిపురాంతకుడు సోమదేవుడు వెళ్ళగానే, 'మేము మీకు సాయం చేయలేకపోయినందుకు చింతిస్తున్నాను. మీరు దీనిని మనస్సులో పెట్టుకోకండి. మా కెన్నడైనా సాయం కావలసివచ్చినప్పుడుమాత్రం మీరు కాదనగూడదు' అని నవ్వుతూ అన్నాడు.

'అప్పుడు మేముగూడ ఆలోచించవలసి ఉంటుందిగదా?' అన్నాడు నారనదేవుడు మందహాసంచేస్తూ.

'ఆలోచించవలసిందే. కాని అది రాజుగారికి లాభదాయక మైనప్పు డెందుకు చేయకూడదు?'

'అప్పుడు తప్పనిసరిగా చేయవచ్చు' అన్నాడు సేనాని.

'జ్ఞాపక ముంచుకోండి. ఆ పరమేశుని కరుణ ఉంటే త్వర లోనే కలుసుకొంటాము. వస్తాను' అంటూ సెలవుతీసుకొని వెళ్ళాడు త్రిపురాంతకుడు.

ఆ మంత్రిమాటలు నారనదేవుని కేమీ అర్థంగాలేదు. తను వచ్చినపని వృథాఅయినందు కతని కెంతో వ్యథగా ఉంది. 'రాజేమీ చేయలేని స్థితిలో ఉన్నాడు. యువరాజు కనుభవంలేదు. ఏమి చేయాలి?' అనుకొంటూ శయనించాడు.

# 5

## యజ్ఞమూర్తి

రామానుజుని కెవరో విషంపెట్టడానికి యత్నించారని, ఆ యత్నం విఫలమై పోయిందన్నవార్త యెలాగో ఒకలాగు శ్రీరంగ మంతా వ్యాపించింది. అలా చేయడానికి సాహసించినవా రెవరై వుంటారన్న ప్రశ్న అందరినీ కలతపెట్టింది. ఆ మహాపట్టణంలో ఉన్న ప్రతివారు ఆ విషయాన్నిగూర్చే చర్చింపసాగారు.

శైవులెవరో విద్వేషంతో అలా చేసిఉంటారని కొందరు, వైష్ణ వాన్ని ప్రచారంచేస్తున్నందువల్ల చాలమంది అద్వైతులకు క్రోధంగా ఉందని కొందరు, పంచముల్ని చేరదీస్తున్నందువల్ల ఎవరికో కోపం వచ్చి ఉంటుందని కొందరు, వైష్ణవులలోగూడ అతడంటే గిట్టని వారెందరో ఉన్నారని కొందరు, ఏమైతేనేమి - అతడేవిధంగానో

బతికి బయటపడ్డాడని మరికొందరు అనుకున్నారు. కాని విషం పెట్టిం దెవరోమాత్రం ఎవరికీ స్పష్టంగా తెలియలేదు.

నగరంలో యీ వార్త పొక్కిన తరువాత ప్రజలలో రామానుజునిమీద మంచి సానుభూతి యేర్పడింది. చాలమందికి భక్తి కూడ కుదిరింది.

శేషాచార్యుని భార్యయైన తిరుక్కొచ్చి విషాన్నాన్ని పెట్టి దానిని తినవద్దని పాదాలమీద వ్రాసిన తరువాత రామానుజుడా అన్నాన్ని భుజించకుండా తీసుకొని వెళ్ళి కావేరినది గట్టున పారవేశాడు. అప్పు డొక కుక్క వచ్చి దానిని తినబోయింది. రామానుజు డెంత వారించినా అది పోలేదు. దాని కాకలి హెచ్చుగా ఉన్నందువల్ల అది ఆ అన్నాన్ని త్వరత్వరగా తినివేసింది. ఆ భోజనాన్ని తిన్నదో లేదో వెంటనే ఆ శునకం అచ్చేపడి గిలగిల లాడింది. రామానుజుడు వాన్నిచూచి చాల బాధపడ్డాడు. అది ఆ మహాభాగ్యుని కళ్ల యెదుటనే ప్రాణాలు విడిచింది. దాని దుర్మరణాన్ని చూచి అతనికళ్ళు చెమ్మగించాయి.

ఆ అన్నాన్నితిని శునకం అలా మరణించినప్పుడు తిరుక్కొచ్చి తన పాదాలమీద వ్రాసిన తరువాత అతనికి విశదమయింది. తనప్రాణం పోయినా బాగుండేదిగాని తనవల్ల ఒక శునకం మరణించడం అతని కెంతో కష్టాన్ని కలిగించింది. ఆ రాత్రంతా అతని కేమాత్రం నిద్రపట్టలేదు.

తా నెవ్వరికీ ద్రోహంచేయలేదు. ఎవరి మనస్సునూ నొప్పించలేదు. ఎవరినీ నొవ్వనాడలేదు. కాని తనమీద ఇంత పగ ఎవరికో? శేషాచార్యుడు తనకు తెలుసు. అతడు శ్రీరంగనాథస్వామి ఆలయంలో సామాన్యమైన అర్చకుడుగా ఉన్నాడు. అతణ్ణి తా నెన్నడూ పలకరించి ఉండలేదు. కాని అతని కెందుకు తనమీద క్రోధం రావాలి? తన భార్యద్వారా తనకు విషం పెట్టించవలసిన అవసరం అతనికేమి కలిగింది? రామానుజుని కేమాత్రం అర్థం కాలేదు.

శేషాచార్యుడు శైవుడుగాడు. వైష్ణవుడు. నిజంగా తన్ను ద్వేషించవలసింది శైవులు. కాని ఆ వైష్ణవు డెందుకు తన్ను తుద ముట్టించా లనుకొన్నాడు?

పూజావిధాన విషయంలో అర్చకులకు, తనకు పేచీ వచ్చిన మాట నిజమే. కాని ప్రాణం తీయడాని కది కారణ మవుతుందా? అంతకంటె లోతైన మరొక కారణ మేమైనా ఉందేమో! తనకు తెలియదు. ఏమైనా చింతించవలసిన అవసరంలేదు. ప్రాణాలు అనశ్వరాలు. వాటికోసం తాపత్రయపడరాదు. ఆ భగవంతుని మీద ఆధారపడి ముందుకు వెళ్ళాలి అనుకొన్నా డతడు.

కాలం గడవసాగింది. రామానుజుని ఖ్యాతి పెరగసాగింది. అతని శిష్యగణంగూడ హెచ్చసాగింది.

కూర మనే గ్రామంలో కూరేశుడనే ధనవంతు డుండేవాడు. అతడు యువకుడు. ఉత్సాహవంతుడు. మంచిమేధావి. మొట్టమొదట అతడు రామానుజుని ఉపదేశాలను నిరసించాడు గాని తరువాత ఆ మహాత్మునికి శిష్యుడయ్యాడు.

ఆవిధంగానే దాశరథి అనే మరొక యువకుడు గూడ రామానుజుని గురుత్వాన్ని అంగీకరించాడు. దాశరథిది కాంచీపురానికి తూర్పునఉన్న పురుషమంగళం. ఆ గ్రామంలో అనంతదీక్షితుడనే బ్రాహ్మణు డుండేవాడు. అతడు రామానుజుని సోదరిని పెళ్ళాడాడు. వారిద్దరికీ జన్మించినవాడు దాశరథి. అతణ్ణి ముదలియాండాన్ అని గూడ ద్రావిడులు పిలిచేవారు.

మూడవవాడు గోవిందమిశ్రుడు. అతడు శైవుడు. అతడు రామానుజునికి దగ్గర బంధువైనప్పటికీ అతనికి శైవమంటే ప్రాణం. కాని అతడు చాల మంచివాడు. చాల గొప్పవాడు. చాల తెలివి గలవాడు. చాల పట్టుదలగలవాడు. అందువల్ల అతణ్ణి ఎలాగైనా వైష్ణవుణ్ణి చేయాలని రామానుజులు హెచ్చుగా పట్టుబట్టారు.

గోవిందమిశ్రుడు కాళహస్తిలో కాపుర ముండేవాడు. అందువల్ల అతణ్ణి ఏలాగైనా మార్చవలసిందని రామానుజుడు తిరుపతిలో ఉన్న తన మామగారైన శ్రీశైలపూర్ణునికి చెప్పివంపాడు. శ్రీశైల

పూర్ణుణ్ణి తిరుమలనంబి అనిగూడ అంటారు. అతడు తిరుమలలోనే ఉండిపోవడంవల్ల అతని కాపేరు వచ్చింది.

శ్రీశైలపూర్ణుడు వైష్ణవుడు. గొప్ప మేధావి. తిరుమలలో నున్న వైష్ణవులకందరికీ అతడు పెద్దగా ఉండేవాడు. రామానుజుని చిన్నతనంలో అత డతణ్ణి తనయింట బెట్టుకొని ఒక సంవత్సర కాలానికి రామాయణాన్ని వ్యాఖ్యానసహితంగా బోధించి ఉన్నాడు. వైష్ణవాన్నిగూర్చి, యామునాచార్యుని సూత్రాలనుగూర్చి యెరుకపరచి ఉన్నాడు.

శ్రీశైలపూర్ణునికి రామానుజు డంటే చాల యిష్టం. రామానుజుని ముఖ వర్చస్సును చూచి అతడు పొంగిపోతుంటాడు. వైష్ణవాన్ని వ్యాప్తిచేయడాని కతడే తగినవాడని ఆ తిరుమలనంబి అభిప్రాయం. అంతేగాక అతడు గొప్పమతకర్త కాగలడనిగూడ అతని విశ్వాసం. ఆ విశ్వాసానికి కారణం లేకపోలేదు.

యామునాచార్యుడు తా నవసానదశలో ఉన్నప్పుడు రామానుజుణ్ణి చూడగోరాడు. కాంచీపురంలో యాదవప్రకాశుని సరసనున్న ఆ యువకుణ్ణి చూచినప్పుడే ఆ యాచార్యుని కతడు చాల గొప్ప వాడవుతా డనిపించింది. ఆనాడు రామానుజుణ్ణి ఆశీర్వదించాడు గాని ఏమీ మాట్లాడలేదు. అయినప్పటికీ అతని మనస్సు ఆ యువకుని మీదనే ఉండిపోయింది. తన అవసానకాలంలో తన సిద్ధాంతాల నన్నిటినీ రామానుజునికి చెప్పి వెళ్ళా లనిపించింది యామునాచార్యునికి. గోష్ఠిపూర్ణుడు మొదలైన దిగ్దంతు లతనికి శిష్యులుగా ఉన్నప్పటికీ అతని మనస్సు రామానుజుని మీదే ప్రాలింది. అతడే తన ఆశయాన్ని నెరవేర్చగల డన్న విశ్వాసం అతనిలో కుదిరింది.

రామానుజుడు శ్రీరంగం చేరేసరికే యామునాచార్యుడు మరణించాడు. అది రామానుజునికి చాల దుఃఖాన్ని కలిగించింది. ఆయన శ్మశానవాటికలో ఆ యాచార్యుని అంతిమదర్శనం గావించుకొన్నాడు. అప్పుడు ఆ యామునాచార్యుని కుడిచేతిలో మూడు వ్రేళ్ళు ముడువబడి ఉన్నాయి. ఆ వ్రేళ్ళెందు కలా ఉన్నాయో చెప్పవలసిందని రామానుజు డచ్చట ఉన్న పెద్దల నందరినీ కోరాడు. ఆ సమయంలో

తిరుమలనంబి గూడ అచ్చటే ఉన్నాడు. కాని యెవ్వరూ అందుకు సరియైన కారణాన్ని చెప్పలేక పోయారు. అప్పుడప్పుడు ఆ ఆచార్యుడు అంటూ ఉండిన మాటల్ని చెప్పి ఒకవేళ అవే కారణమై ఉండవచ్చునన్నారు.

'కృష్ణవ్యాసునికి, పరాశరునికి కృతజ్ఞులుగా ఉండాలి అన్నదా మాటల్లో ఒకటి. నమ్మాళ్వారును ప్రేమించాలి అన్నది మరొకటి. బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయాలి అన్నది ఇంకొకటి.' అన్నారు వారు.

'ఆ వ్రేళ్ళు అలా ముడువబడడానికి ఆ మాటలే కారణమైతే నేను వాటిని తప్పనిసరిగా నెరవేర్చుతాను' అన్నాడు రామానుజుడు. ఆ ప్రతినను తిరుమలనంబి విని ఉన్నాడు. అంతేగాక అతనికి రామానుజుని సునిశిత మేధాశక్తినిగూర్చి, వేద వేదాంగాలలో అతని కున్న పాండిత్యాన్ని గూర్చి, అతని పట్టుదలను గూర్చి చక్కగా తెలుసు. అందువల్లనే రామానుజునిమీద శ్రీశైలపూర్ణుని కంత విశ్వాసం. కనుకనే గోవిందమిశ్రుణ్ణి మార్చి రామానుజునికి తోడు జేదామనుకొన్నాడతడు. రామానుజుని లేఖ అందగానే కాళహస్తికి ప్రయాణమై వెళ్ళాడు. గోవిందమిశ్రుణ్ణి మార్చడానికే ప్రయత్నించాడు. కాని అతనియత్నం ఫలించలేదు. ఆ విషయం రామానుజునికి కబురు చేశాడు.

రామానుజునికి గోవిందమిశ్రుణ్ణి ఏలాగైనా తనవద్దకు రప్పించుకోవాలని ఉంది. అందువల్ల మరొకసారి ఆ విషయమై శ్రీశైలపూర్ణునికి కబురుపంపాడు. ఈ మారతనికి సాధ్యంకాకపోతే స్వయంగా తానే వస్తానన్నాడు. అందువల్ల శ్రీశైలపూర్ణుడు మరల కాళహస్తికి వెళ్ళాడు. అచ్చట కాళహస్తీశ్వరుని ఆలయంలో కూర్చొని 'తిరువాయిమొళి'కి వ్యాఖ్యానం వ్రాయసాగాడు. గోవిందమిశ్రు డచ్చటికివచ్చి వ్రాస్తున్న దేమిటని శ్రీశైలపూర్ణు నడిగాడు. తాను చెప్పినదంతా పూర్తిగా వినేటట్లయితే చెబుతానన్నాడు ఆ వైష్ణవోత్తముడు. అలాగే చెప్పమన్నాడు గోవిందమిశ్రుడు. ఆ వ్యాఖ్యానం అంతటినీ విన్నతరువాత గోవిందమిశ్రుడు పూర్తిగా

మారిపోయాడు. శ్రీశైలపూర్ణునితో వెళ్ళడానికంగీకరించాడు. కాని కాళహస్తిలోనున్న శైవ ఒంటికు సమ్మతించలేదు. గోవిందమిశ్రుడు వారికేలాగో నచ్చజెప్పి వారినందరిని గూడ వైష్ణవులుగా మార్చి తాను శ్రీశైలపూర్ణునితోగూడ తిరుపతికివెళ్ళి అచ్చటనుండి శ్రీ రామానుజుని వద్దకు ప్రయాణం సాగించాడు. గోవిందమిశ్రుని చూచినదే తడవు రామానుజుడు పట్టరానిసంతోషంతో అతణ్ణికౌగిలించుకొన్నాడు. ఆ విధంగా రామానుజునికి అతిమేధావంతుదైన శిష్యులు కుదిరారు. వారిమూలంగా అతడు తన సిద్ధాంతాలను ప్రచారం గావించడానికి పూనుకున్నాడు. వారి ప్రచారాన్ని కాదనేవారా శ్రీరంగంలో ఎవరూ లేకపోయారు.

రామానుజుని ప్రభావం పెరుగుతున్నకొద్దీ శైవుల కతనిపై క్రోధం పెరగసాగింది. కాని వారతని వాదానికి ప్రతివాదం చేయలేక అదనువేచి ఉన్నారు. రామానుజుణ్ణి ఓడించడానికి కాంచీపురంలో ఉన్న అతని పూర్వగురువైన యాదవ ప్రకాశుణ్ణిగూడ ఆహ్వానించారు, కాని రావడాని కతడు భయపడ్డాడు. అందువల్ల శైవమతాన్నిగూర్చిగాని, అద్వైతతత్వాన్ని గూర్చిగాని రామానుజునితో వాదించగలిగినవారు ఆనాడెవ్వరూ లేకపోయారు.

రామానుజునివల్ల వైష్ణవం వ్యాప్తిచెందుతున్నప్పటికీ, ఆ మతానికొక ప్రతిష్ఠ వస్తున్నప్పటికీ భృంగాచార్యులకుగాని, శేషాచార్యులకుగాని, వారి అనుయాయులకుగాని ఏమాత్రం ఆనందం లేకపోయింది. పైగా చాల బాధ గూడ కలిగింది. అంతేగాక తమ పన్నాగం విఫలమైన నాటినుండి అతనిమీద మత్సరం మరింత పెరిగింది. కాని ఎవరేమనుకొంటారో నని భయపడి వారు పైకేమీ అనలేక హృదయాలలోమాత్రం విషాన్ని నింపుకోసాగారు.

ఈలోగా శైవులకు, భృంగాచార్యులు మొదలైన వైష్ణవులకు ఒక మంచి అదను లభించింది.

యజ్ఞమూర్తి అనే శైవుడు అద్వైతంలో గట్టి దిట్ట అనిపించుకొన్నాడు. అతడు కాశికి వెళ్ళి అచ్చటినుండి రామేశ్వరానికి తిరిగి వెడుతూ తాను తొక్కిన ప్రాంతాలలోవున్న ఇతరమతస్థుల

నందరినీ వాదానికి పిలిపించాడు. బౌద్ధుల్ని, జైనుల్ని, వైష్ణవుల్ని ఒక రేమిటి అన్ని మతాలవారిని అతడు సవాలు గావించాడు. కాని అతనితో వాదించిన వారెవ్వరూ అత డెదుర్కోలేకపోయారు. అది అతనికి మంచి ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, కొంత గర్వాన్ని గూడ కలిగించింది.

యజ్ఞమూర్తి చాల గట్టివాడు. గొప్ప మేధావి. సకలశాస్త్ర పారంగతుడు. మంచిపండితుడు. మంచి వాక్పటుత్వం కలవాడు. అందువల్లనే ఉద్దండులైన ఇతర తత్త్వవేత్తలుగూడ అతనికెదురు నిలవలేక పోయారు.

యజ్ఞమూర్తి దారిలోనున్న శ్రీరంగానికి గూడ వచ్చాడు. అతని జయాలను గూర్చి వింటున్న శైవులు వెంటనే అతనికెదురేగి అతివైభవంగా అతణ్ణి ఊరేగించి నగరంలోకి తీసుకొనివచ్చారు. వైష్ణవంపట్లనున్న వ్యతిరేకతను వా రలా వ్యక్తీకరించారు.

ఎన్నో దినాలనుండి శ్రీరంగంలో ఉన్న శైవులు ఏమీచేయ లేని స్థితిలో ఉన్నారు. వైష్ణవుల ప్రాబల్యాన్ని సహించలేక పోయినప్పటికీ ఏలాగో ఒకలాగు గడుపుతున్నారు. కాని యజ్ఞమూర్తి రాకతో వారొక్కసారిగా విజృంభించారు. ఇక వైష్ణవులందరి నోళ్లూ మూయించవచ్చు ననుకొన్నారు. అందుకే వా రంత ఆశతో, ఆనం దంతో యజ్ఞమూర్తి కెదురేగి, పూలమాలలతో అలంకరించి, హారతులెత్తి పాదాలకు మ్రొక్కి అతణ్ణెంతో ఆదరంతో తీసుకు వచ్చారు.

మరునాడు ఆ శైవులందరూ యజ్ఞమూర్తిని రామానుజు నితో వాదించవలసిందని అర్థించారు. రామానుజుణ్ణి ఓడించకపోతే అద్వైతాని కిక చోటే వుండబోదన్నారు. ఇన్ని దినాలుగా తామం దరూ వైష్ణవులవద్ద తలలు వాల్చి ఉండవలసిన దుర్గతి పట్టిం దన్నారు. అందువల్ల తమ్ము రక్షించడానికైనా రామానుజునితో వాదించమని వారు యజ్ఞమూర్తి నర్థించారు. యజ్ఞమూర్తి అందు కెంతో ఆనందంతో అంగీకరించాడు. అప్పుడు శైవులందరూ ఉప్పొంగిపోయారు.

శైవులలో కొందరికి గోవిందమిశ్రుడు తెలుసు. శైవమతాని కొకప్పుడతడొక మూలస్తంభంగా వుండడాన్ని వారు మరువలేదు. రామానుజుని కేదైనా వార్త పంపాలంటే ముందు అతణ్ణి కలుసుకొని అతనిద్వారా దాని నందించడం మంచిదన్న నిర్ణయానికి వచ్చారు. యజ్ఞమూర్తి సవాలునందుకొని అతనితో వాదించవలసిందిగా రామానుజునికి చెప్పవలసిందని శివతేజుడనే శైవుని ద్వారా వారు గోవిందమిశ్రునికి వార్త పంపారు. గోవిందమిశ్రుడు ఆ విషయాన్ని రామానుజునితో చెప్పాడు. మేధావంతుడైన యజ్ఞమూర్తితో వాదించడానికంటె ఆనందకరమైన విషయం మరొకటి లేదని, తానందుకు సంసిద్ధంగా ఉన్నానని రామానుజుడు గోవిందమిశ్రునితో అన్నాడు. గోవిందమిశ్రుడు తన గురువు చెప్పిన మాటల్ని శివతేజుని ద్వారా శైవులకు చెప్పి పంపాడు.

కాని ఆ మాటలు యజ్ఞమూర్తికి సంతృప్తిని కలిగించలేదు, రామానుజు డొకవేళ తనతోడి వాదంలో ఓడిపోతే శైవుడు గావడానికి సమ్మతించాలి. అప్పుడే అతనితో వాదించడానికి వీలవుతుందని యజ్ఞమూర్తి ఒక షరతు పెట్టాడు. తా నా శైవమతాధిపతిని తనవైపుకు తిప్పుకోలేక ఓడినట్లయితే తప్పనిసరిగా తాను అద్వైతమతాన్ని స్వీకరించగలనని రామానుజుడు కబురు పంపారు. అది యజ్ఞమూర్తికి సంతృప్తి కలిగించింది.

యజ్ఞమూర్తి రామానుజునితో వాదించనున్నాడన్న వార్త త్వరగా అంతటా ప్రాకిపోయింది. అది శ్రీరంగ ప్రజలలో ఒక ఉత్తేజాన్ని కలిగించింది. యజ్ఞమూర్తి గెలుస్తాడని శైవులు, రామానుజుడే గెలుస్తాడని వైష్ణవులు గట్టి విశ్వాసంతో ఉన్నారు. ఎచ్చట చూచినా ఆ విషయాన్నే చెప్పుకొంటూ చర్చలు చేసుకొంటున్నారు.

భృంగాచార్యుడు, శేషాచార్యుడు, వారి అనుయాయులూ వైష్ణవులైనప్పటికీ, రామానుజు డోడిపోవాలనే తమ హృదయాలలో కోరుకొన్నారు. అత డోడిపోతే పూజలు చేయిస్తామని దేవుళ్ళకు మొక్కుకొన్నారు. ఎవరైనా జరుగనున్న చర్చనుగూర్చి ప్రస్తావించినప్పుడు 'ఆ యీ రామానుజుడు ఆ యజ్ఞమూర్తికొక లెక్కా ? అత

రక్షించుడు.' అని రామానుజుణ్ణి తగ్గించి చెప్పడంద్వారా సంతృప్తి పొందసాగారు.

రామానుజుడు, యజ్ఞమూర్తి ఇద్దరూ వాదించడానికని, వారు వాదిస్తున్నప్పుడు పెద్దలు, పిన్నలు అందరూ వినడానికని కావేరీనది తీరాన ఒక పెద్ద పందిరి వేయబడింది. ఆ స్థలమంతా పరిశుభ్రం చేయ బడి చక్కగా అలంకరింపబడింది.

రామానుజుడు, యజ్ఞమూర్తి కూర్చోవడానికి తగిన వేదికలు సిద్ధంచేయబడ్డాయి. స్త్రీలకు, పురుషులకు స్థలాలు ప్రత్యేకించబడ్డాయి. ఇరుపక్షాలపెద్దలకు ఆసనా లమర్చబడ్డాయి

చర్చ ప్రారంభం కాకముందే పందిరి అంతా ప్రజలతో క్రిక్కిరిసిపోయింది. శ్రీరంగంవారేగాక ఇతరప్రాంతాలనుండిగూడ చాలమంది ఆ చర్చను వినడాని కిచ్చటి కరుదెంచారు. రామానుజుని గురువులైన మహాపూర్ణుడు, గోష్ఠిపూర్ణుడుగూడ ఆసభ కరుదెంచారు.

తిరుమంత్రాన్ని అందరికీ చెప్పివేశాడని మొదట్లో గోష్ఠి పూర్ణుడు కోపించినప్పటికీ, పెరుగుతున్న రామానుజుని ప్రతిష్ఠను విని అతడు లోలోననే సంతసింపసాగాడు. వైష్ణవాన్ని ఉద్ధరించ గలిగినవా డతడొక్కడేనన్న నమ్మకానికి వచ్చాడు. అందువల్ల ఆనాడు ఆ చర్చను విందామనే కుతూహలంతో అక్కడకు వచ్చాడు.

శైవులలోగూడ పెద్దలందరూ ఎంతో ఉత్సాహంతో చర్చను వినడానికవి ఏతెంచారు. అందరూ ఉత్సుకతతో యజ్ఞమూర్తికోసం వేచిచూడ సాగారు. ఇంతలో యజ్ఞమూర్తి తనతోవస్తున్న శైవుల పెద్దలతో చర్చావేదికవద్దకు వచ్చాడు. శైవులందరూ జయజయ ధ్వానాలు గావించారు.

ఆ తరువాత కూరేశుని, గోవిందమిశ్రుని, దాశరథిని, తదితర శిష్యుల్ని వెంటనిడుకొని రామానుజు లాపందిరిలో ప్రవేశించాడు. అప్పుడు వైష్ణవులందరూ జయజయధ్వానాలు గావించారు. ఆ ధ్వానాలు నభాన్ని అందుకొని ప్రతిధ్వనించాయి.

కూరేశుడు పందిరిలో ఆసీనులైవున్న గోష్ఠిపూర్ణుణ్ణి, మహా పూర్ణుణ్ణి, తక్కిన పెద్దలను రామానుజునికి చూపాడు. అప్పుడతడు

వారివద్దకువెళ్ళి వారికి నమస్కరించి వారి ఆశీస్సుల నందుకొన్నాడు. గోష్ఠీపూర్ణుడు 'విజయీభవ' అన్నప్పుడు రామానుజుని శరీరం పులకరించింది. తరువాత రామానుజుడు వేదికవద్దకువెళ్ళి శైవుల పెద్దలకు, ప్రజలందరికీ ఒకసారి నమస్కరించాడు. యజ్ఞమూర్తిని గాంచి చేతులు జోడించి చిరునవ్వుతో పలకరించాడు. యజ్ఞమూర్తి రామానుజుణ్ణి కుశలప్రశ్న వేశాడుగాని, అతనికి ప్రతినమస్కారం చేయలేదు. దాన్ని చూచి వైష్ణవులందరికీ కోపం వచ్చింది. వారు దానిని అణచి పెట్టుకొన్నారు.

చర్చ మొదలు కానున్నది. యజ్ఞమూర్తి, రామానుజుడు గంభీరాకృతిని దాల్చారు. వారిద్దరూ అపర శివునిలాగా, అపర విష్ణువులాగా కనబడ్డారు. యజ్ఞమూర్తి లలాటంమీదనున్న విభూతి రేఖలు రామానుజుని నుదుటనున్న ఊర్ధ్వపుండ్రాల కొక సవాలు లాగ కనబడ్డాయి. ఇద్దరూ కొన్ని క్షణాలు తమ యిష్టదైవాన్ని ప్రార్థించారు.

చర్చ మొదలయింది.

రామానుజుడు :- ప్రమాణాలు సత్యాలా కావా?

యజ్ఞమూర్తి :- కావు.

రా :- వేదం ప్రమాణం అవుతుందా, కాదా?

య :- అవుతుంది.

రా :- అయితే వేదం సత్యం కాదన్నమాట.

య :- అవును.

రా :- సత్యంగాని వేదంద్వారా సత్యమైన బ్రహ్మాన్ని తెలుసుకోవ డానికి వీలవుతుందా?

య :- దానికేం, తెలుసుకోవచ్చు. రజ్జువును మొదట సర్పంగా భ్రమిస్తాము. ఆ భ్రమద్వారా సత్యమైన రజ్జువును గుర్తి స్తాము. ఆలాగే అసత్యమైన వేదంద్వారా సత్యమైన బ్రహ్మము తెలుసుకొంటాము.'

రా :- ఈ ఉదాహరణ ఏమాత్రం సమంజసంగాలేదు. (నవ్వుతూ) అసత్యంద్వారా సత్యాన్ని తెలుసుకోవచ్చు నన్నదే అద్వైత

మైతే దాని నంగీకరించడానికి నేను సిద్ధంగాలేను.

వైష్ణవులందరూ నవ్వారు. శైవులకు కోపంవచ్చింది. కాని వారూరుకొన్నారు.

యజ్ఞమూర్తి (ఉద్రేకంతో):- ఆత్మ, పరమాత్మలకు భేదం లేదని మీ రంగీకరిస్తారా ?

రా :- నే నంగీకరించను.

య :- మీరు వేదాల నంగీకరించరా ?

రా :- అంగీకరిస్తాము.

య :- ఆత్మ, పరమాత్మలకు భేదంలేదని వేదాలు చెప్పడంలేదా ?

రా :- చెబుతున్నాయి.

య :- అయినప్పుడు___

గెలిచినట్లుగా రామానుజునివైపు చూచాడు యజ్ఞమూర్తి.

శైవులు కరతాళధ్వనులు గావించారు. వైష్ణవుల కది అవ మాన మనిపించింది. కాని రామానుజు డుద్రేకపడలేదు. ఎప్పటిలాగే.

రామానుజుడు :- (ఎప్పటిలాగే నవ్వుతూ) ప్రత్యక్షప్రమాణం ఏక త్వాన్ని అంగీకరించదు. భిన్నత్వాన్నే అంగీకరిస్తుంది. ప్రమాణాలలో వేదాలు ఒకానొకటి మాత్రమే. ప్రత్యక్ష ప్రమాణానికి, వేదాలకు వైరుధ్యం వచ్చినప్పుడు వేదాలను ప్రత్యక్ష ప్రమాణాని కనుకూలంగా సమన్వయం చేసుకో వాలి. లేకుంటే వేదాలన్నీ వైరుధ్యాలతో కూడుకున్న ప్రయోజనంలేని గ్రంథా లనిపించుకొంటాయి.

యజ్ఞమూర్తి :- అలా ఎందుకనుకోవాలి ?

రా :- ఎందు కనుకోవాలంటారా ? చెబుతాను వినండి. వేదాలు బ్రహ్మను సగుణుడని కొన్నిచోట్ల, నిర్గుణుడని మరికొన్ని చోట్ల నిర్వచిస్తాయి. వేదా లలా చెప్పాయి గాబట్టి రెంటినీ అంగీకరించమంటారా ? అంగీకరించినట్లైతే అది సరిగా ఉంటుందా ? అంగీకరించకపోతే వేదా లసత్యాలని అనవలసి ఉంటుంది గదా ? వేదా లసత్యాలెలా అవుతాయి ? అందువల్ల

వేదప్రమాణానికి, ప్రత్యక్షప్రమాణానికి వైరుధ్యం కలిగి నప్పుడు మొదటిదానిని రెండవదాని కనుకూలంగా సమ న్వయం చేసుకోవాలని నేనన్నాను.

ఈ విధంగా యజ్ఞమూర్తి రామానుజుల మధ్య ఎడతెగకుండా వాదం జరిగింది. రామానుజుని వాదం పైబడినప్పుడు వైష్ణవులు, యజ్ఞమూర్తి వాదం మించినప్పుడు శైవులు కేకలువేసి, కరతాళ ధ్వనులు గావించి తమ ఉత్సాహాన్ని తెలియజేస్తూ వచ్చారు. వాదం మూడుదినాలు జరిగింది.

ప్రపంచం మిథ్య అని యజ్ఞమూర్తి, అది సత్యమని రామా నుజుడు నాలుగవ దినమంతా వాదించారు. జ్ఞానం గొప్పదని యజ్ఞ మూర్తి, భక్తి గొప్పదని రామానుజుడు 3-వ దినం వాదించారు.

వారివాదాలు చాల చక్కగా విజ్ఞానబోధకంగా ఉండడంవల్ల వాటిని వినడానికి అచ్చటికి వచ్చే ప్రజలు ప్రతిదినం వేల సంఖ్యలో హెచ్చసాగారు. శ్రీరంగంలో ఆలాటిచర్చ లెన్నడూ జరిగి ఉండ లేదు. ఆలాటి వాదోపవాదా లెన్నడూ కొనసాగి ఉండలేదు. వాటిని విన్నవారందరూ తామిక తరించినట్లే అనుకొన్నారు.

అంతకు ముం దెన్నడూ శ్రీరంగంలోని ప్రజలకు రామా నుజు డంత గొప్పవాడని తెలియదు. అతడు వాదిస్తుంటే అందరూ విస్తుపోయారు. అతని వాక్పటిమకు, అతని వాదబలానికి అందరూ ఆశ్చర్యపడ్డారు సమాధానం చెప్పలేకపోయినప్పు డెన్నోమార్లు యజ్ఞమూర్తి కోపించుకొన్నాడు. ఉద్రేకపడ్డాడు. గద్దించాడు. బెదిరించడానికి ప్రయత్నించాడు. కాని రామానుజుడు మాత్రం ఏమాత్రం తొణకలేదు. బెణకలేదు ఎల్లప్పుడూ నవ్వుతూనే సమాధాన లిచ్చాడు. యజ్ఞమూర్తి చెప్పినది చాల సహనంతో విని జాగ్రత్తగా సగౌరవంగా అతనికి బదులు చెబుతూ వచ్చాడు. అది వైష్ణవులనే గాక శైవులనుగూడ చక్కగా ఆకర్షించింది. వాదమంటే అలా ఉండాలి అనుకొన్నారు వాళ్లు.

గోష్ఠీపూర్ణుడు రామానుజుని ప్రతిభకు ముగ్ధుడయ్యాడు. మహా పూర్ణుడు తన్నుతాను మరచి అతని వాదాన్ని ఏకాగ్రతతో ఆలకింప సాగాడు.

రామానుజుడు ఆత్మస్వరూపాన్ని గూర్చి, దాని నిత్యత్వాన్ని గూర్చి, జీవన్మరణాలనుగూర్చి, బ్రహ్మాన్నిగూర్చి, ఆత్మకు పర మాత్మకు ఉన్న సంబంధాన్నిగూర్చి, జ్ఞానాన్నిగూర్చి, భక్తివైరాగ్యా లనుగూర్చి, మోక్షసాధనాన్నిగూర్చి చర్చిస్తున్నప్పుడు, యజ్ఞ మూర్తితో వాదిస్తున్నప్పుడు ఆ సభలో ఉన్న శ్రోతలందరూ, మతా లతో నిమిత్తం లేకుండా స్తంభించి విన్నారు. ఎవరో మహాపురుషుడు, మహాప్రవక్త అచ్చట మూర్తీభవించాడా అనిపించింది వారికి.

అయిదవనాటి మధ్యాహ్నానికి యజ్ఞమూర్తి అలసిపోయాడు. రామానుజునితో వాదించలేకపోయాడు. తా నోడిపోయానని అంగీక రించాడు. రామానుజుని పాదాలమీద బడి తన్ను శిష్యునిగా అంగీక రించమన్నాడు. ఆ దృశ్యాన్ని చూచి వైష్ణవులు ఉప్పొంగి పోయారు. శైవులలో చాలమంది కుంగిపోయారు. యజ్ఞమూర్తి పాదాక్రాంతు డయినందుకు భృంగాచార్యులు, శేషాచార్యులుగూడ దిగాలుపడ్డారు.

తన అడుగులమీద బడిన యజ్ఞమూర్తిని రామానుజుడెత్తి ప్రేమతో కౌగిలించుకొన్నాడు. అప్పుడా సభలోనివారు ఆనందంతో జయజయధ్వానాలు గావించారు.

# 6

## కుట్ర

అది అర్ధరాత్రి సమయం. ఎచ్చట చూచినా గాఢాంధకారం. కన్ను పొడుచుకున్నా కనబడని పరిస్థితి. ఆ సమయంలో భటుడొకడు వచ్చి సోమదేవుని గది తలుపు తట్టాడు. గాఢనిద్రలో వున్న వేనాని ఉలిక్కిపడి లేచి 'ఎవరు' అని ప్రశ్నించాడు.

'నేనే ప్రభూ. వేగులవారు మీకోసం కాచుకొని ఉన్నారు. ఏదో వెంటనే తమతో మాట్లాడవలసి ఉన్నదట.' అన్నాడు భటుడు.

'రమ్మను.' అంటూ సోమదేవుడు తలుపుతీశాడు. భటుడు వెళ్ళి కొన్ని క్షణాలలో వేగులవారిని తీసుకొని వచ్చాడు. వారు చాల కంగారుగా ఉన్నారు

'ఏమిటి ఈ వేళలో వచ్చారు?' ప్రశ్నించాడు సోమదేవు డాదుర్దాతో.

'శత్రువులు దండెత్తి వస్తున్నారు' అన్నాడు గూఢచారులలో ఒకడు. అతడు కంపిస్తున్నాడు.

'ఏ శత్రువులు?'

'చక్రకూట సైన్యాలు' అన్నాడు గూఢచారి.

'చక్రకూట సైన్యాలా? ఆ సైన్యాలు మనమీద కెందు కొస్తాయి?'

'మన మంత్రి త్రిపురాంతకుడు వారి నాహ్వానించాడని తెలిసింది' అన్నాడు మరొక గూఢచారి.

'ఆఁ. అనుకొన్నట్లే జరిగింది. ఈ విషయాన్ని రాజుగారికి చెప్పారా?' ఆవేశంతో అడిగాడు సోమదేవుడు.

'లేదు ప్రభూ, మొట్టమొదట మీవద్దకే వచ్చాము.' అన్నారు వేగులవారు.

'వెంటనే వెళ్ళి రాజుగారికి చెప్పండి. త్వరగా వెళ్ళండి. నేను గూడ వెంటనే వస్తాను.' అంటూ లోనికి వెళ్ళాడు సోమదేవుడు.

ఆనాడు కాంచీపురానికి అధిరాజేంద్రుడు రాజుగా ఉన్నాడు. వీరరాజేంద్రుడు గతించి అప్పటికి కొన్ని నెలలు గడచాయి.

వీరరాజేంద్రుడు మరణించినప్పటినుండి రాజ్యంలో పొరపులు హెచ్చాయి. శైవులమధ్య, వైష్ణవులమధ్య ఘర్షణలు పెరగసాగాయి. కాంచీపురంలో రామానుజుని శిష్యులు హెచ్చయ్యారు. వారి ప్రాబల్యం తిన్నగా అధికం కాసాగింది. రాజుగారు మరణించి యువరాజు రాజైన తరువాత ఆ ప్రాబల్యం మరింత హెచ్చింది.

రామానుజుని ప్రభావం రానురాను అన్ని ప్రాంతాలలోను వ్యాపించింది. చాల మేధావంతుడైన, అద్వైత తత్త్వశాస్త్రంలో

సాధికారంగా వాదించ గలిగిన యజ్ఞమూర్తి రామానుజునితో చర్చింప లేక పోయి అతనికి శిష్యుడుగా మారినప్పటినుండి అతని ప్రభావం చాల హెచ్చైపోయింది. సోమదేవుడేగాక అధిరాజేంద్రుడు గూడ రామానుజుని ప్రఖ్యాతిని విని అతనివంక కాకర్షించబడ్డాడు.

అధిరాజేంద్రుడు రాజైన తరువాత త్రిపురాంతకుని మాట ఏ మాత్రం సాగలేదు. మతం పేరుతో ఇతరులను దండించడాన్ని ఆ రాజు ఏ మాత్రం అంగీకరించలేదు. ప్రతివారు తమకు తోచిన మతాన్ని స్వీకరించ వచ్చునని, తన కిష్టం వచ్చిన దైవాన్ని ఆరాధించవచ్చునని, తమ కిచ్చ వచ్చిన విశ్వాసాన్ని కలిగి ఉండవచ్చునని ఆరాజు బహిరంగంగా చెప్పసాగాడు. అది శైవుల ప్రాబల్యానికి ఒక గొడ్డలి పెట్టయింది. అంతవరకు శైవుల ఆధిపత్యానికి లొంగివుండిన వైష్ణవులు గూడ అప్పటినుండి తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను ప్రచారం గావింప జొచ్చారు.

వైష్ణవుల నరికట్టడానికి కాంచీపురంలోని శైవులకు సాధ్యం కాలేదు. గోవిందమిశ్రుడొక మహా పండితుడికి వచ్చి రామానుజుడు ప్రతిపాదించిన విశిష్టాద్వైతాన్ని గూర్చి ఉపన్యాసా లిచ్చి వెళ్ళాడు. అందువల్ల శైవమతానికి మూలస్తంభమైన యాదవప్రకాశుడు గూడ వైష్ణవుల నెదిరించలేక పోయాడు. కనుక అధిరాజేంద్రుని కాలంలో శైవ ప్రాబల్యం తగ్గి వైష్ణవం వేళ్ళానుకొన నారంభించింది.

తమ రాజ్యంలో వచ్చిన యీ మార్పు త్రిపురాంతకునికి కంటకి ప్రాయమయింది. అతని మతంతోపాటు అతని అధికారం గూడ లుప్తమైపోతుంటే అతడు సహించలేకపోయాడు. దానికి తో డతడు గావించిన ఉత్తరువులను గూడ అధిరాజేంద్రుడు మన్నించలేదు. వాటినతడు తన ఇష్టం వచ్చినట్లు మార్చివేశాడు. అది భరించరాని పరిస్థితి. ఇక ఒక క్షణంగూడ తా నధిరాజేంద్రుని క్రింద పనిచేయ లే నవిపించిం దతనికి. కాని తన పదవిని వదలి అత డెచ్చటికి పోగలడు?

త్రిపురాంతకు డా విషయాన్ని గూర్చి చాల దీర్ఘంగా ఆలోచించాడు. ఏవిధంగానైనా అధిరాజేంద్రుణ్ణి నాశనం చేయాలను కొన్నాడు. కాని అది ఎలా జరుగుతుంది?

—రాజేంద్రుడు చక్రకూటాన్ని పరిపాలిస్తున్నాడు. అతడు శైవుడు తన రాజ్యంలో శైవాన్ని బాగుగా పెంపొందించాడు. వైష్ణవాన్ని దృఢహస్తంతో అణచివేశాడు. శివాలయాల నెన్నిటినో నిర్మించాడు. అతడు గనుక యీ రాజ్యాన్ని ఆక్రమింపదలిస్తే తన కోరిక నెరవేరుతుంది. వైష్ణవాన్ని అణచివేసే మిషతో అతణ్ణి కాంచీపురానికి రావించాలి. అతనికి తాను తోడ్పడాలి. అప్పు డధిరాజేంద్రుణ్ణి తొలగించడానికి వీలవుతుంది. కాంచీపుర రాజ్యంలో శైవాన్ని పునః ప్రతిష్ఠించడానికి వీలవుతుంది. అప్పుడు తన అధికారం తిరుగులేని దవుతుంది అనుకొన్నాడు త్రిపురాంతకుడు.

తన పథకాన్ని గూర్చి తన అంతరంగికులైన శైవులతో ఆలోచించాడు త్రిపురాంతకుడు. వా రందరూ ఆ పన్నుగడ గట్టిగా సమర్థించారు. సైన్యంలో వున్న శైవసైనికాధికారులలో కొందరిని పిలచి రహస్యమంతనాలు జరిపాడు. వారు గూడ సమయం వచ్చినపు డధిరాజేంద్రుని మీద తిరుగుబాటు చేయడానికి మాట ఇచ్చారు అందువల్ల త్రిపురాంతకునికి పట్టరాని ఆనందం గలిగింది.

ఒకనాడు త్రిపురాంతకుడు తనకెంతో ఆప్తుడయిన, మిత్రుడయిన త్రిలింగమూర్తిని రావించాడు. అతనితో తన ఆలోచనను చెప్పాడు.

త్రిలింగమూర్తి వీరరాజేంద్రుని సైన్యంలో పనిచేసిన సైనికాధికారి. వృద్ధాప్య దశ వచ్చినందువల్ల అతడు తన పదవిని విరమించుకొని విశ్రాంతి తీసుకొంటున్నాడు. అతనికి శైవమన్నా, అద్వైతమన్నా చాల యిష్టం. అతడు వైష్ణవులకు బద్ధ విరోధి. వారిని పాతాళానికి తొక్కివేయా లనేవాడు. యజ్ఞమూర్తి రామానుజునిచేత ఓడింపబడ్డాడని విన్నప్పుడు రెండు దినాలు సరిగా భోజనం చేయలేదు. శైవం తింటున్న దెబ్బను చూచి అతని కెంతో కష్టం కలిగింది. పడిపోతున్న శైవాన్ని నిలబెట్టడ మేలాగా అని ఆలో

చిస్తున్నాడు. అందువల్ల త్రిపురాంతకుడు చేసిన ఆలోచన అతనికి చాల నచ్చింది.

'నీకు నచ్చివుంటే నీవే యీ పనిని సాధించాలి.' అన్నాడు త్రిపురాంతకుడు.

'నేనా? ఏవిధంగా?' ఆశ్చర్యపడుతూ అడిగాడు త్రిలింగమూర్తి.

'నీవు నారనదేవునివద్దకువెళ్ళి అతనిద్వారా రాజేంద్రరాజును చూచి నామాటలుగా ఇలా చెప్పాలి—'రాజేంద్రరాజా! మీరు కోరి నప్పుడు మేము మీకు సాయం చేయలేకపోయాము. అందుకు మీరు మమ్మల్ని మన్నించాలి. ఇప్పుడు మీరు మాకు తప్పనిసరిగా సాయం చేయాలి. ఇచ్చట శైవం పతనమైపోతున్నది. అధిరాజేంద్రుడు వైష్ణవుడై పోయాడు. సోమదేవుని ఆధిక్యానికి అవధిలేకున్నది. శైవులందరూ హింసించబడుతున్నారు. ఇచ్చట శైవం రక్షించ బడాలంటే మీరు కాంచీపురాన్ని స్వాధీనం గావించుకోవాలి. కాంచీ పురం మీ స్వాధీనమైతే వేంగిరాజ్యాన్ని సాధించడం ఒక లెక్క లోనిదిగాదు. అప్పుడు మీరు దక్షిణాపథానికంతా సార్వభౌములు కాగలుగుతారు.'

'మే మిచ్చట మీకోసం యెదురుచూస్తున్నాము. మీకు సాయం చేయడానికి చాలమంది సైనికాధికారులుగూడ సిద్ధంగా ఉన్నారు.'

'చెబుతాను. చెప్పినంతమాత్రాన వా రంగీకరిస్తారా?' సందేహాన్ని ప్రకటించాడు త్రిలింగమూర్తి.

'ఏమాత్రం సందేహించడు. అవసరమైతే నేను నీ కొక లేఖనుగూడ వ్రాసి ఇస్తాను' అన్నాడు త్రిపురాంతకుడు.

త్రిలింగమూర్తి త్రిపురాంతకుని లేఖను తీసుకొని చక్రకూటానికి వెళ్ళాడు. అచ్చట నారనదేవునిద్వారా రాజేంద్రుని దర్శించాడు. రాజేంద్రుడు త్రిలింగమూర్తి చెప్పినదంతా విన్నాడు. త్రిపురాంతకుని లేఖను జాగ్రత్తగా పరిశీలించాడు. కాంచీపురంమీదికి దండెత్తడాని కంగీకరించాడు. ఫలానాదినం ఆ నగరానికి రాగలనని హామీ ఇచ్చాడు. త్రిలింగమూర్తి సంతోషంతో తిరిగి వచ్చాడు.

వేగులంవారు సోమదేవుని లేపిన నాటిరాత్రి త్రిపురాంతకుడు తన మందిరంలో తనకు కావలసిన సైనికాధికారులతో రహస్య మంతనాలు జరుపుతున్నాడు.

'మరునాటిరాత్రికంతా రాజేంద్రుడు తన సైన్యాలతో కాంచీ పురంమీద పడనున్నాడు. ఆ సమయానికి మనమందరం సంసిద్ధంగా ఉండాలి' అన్నాడు త్రిపురాంతకుడు. 'అంతేకాదు, అతడు వచ్చే సరికి మీరందరూ మన రాజుగారిని, సోమదేవుణ్ణి బంధించివేయాలి. అప్పుడు రాజేంద్రుడు సులభంగా మన పట్టణాన్ని పట్టుకొనగలుగు తాడు. మనకుగూడ అంత కష్టముండదు.'

ఆ సలహాను సైనికాధికారులందరూ అంగీకరించారు.

'అంతేగాదు. సోమదేవునికి పట్టుగొమ్మలుగా ఉన్న ఒకరిద్దరు సేనానుల్నిగూడ బంధించాలి' అన్నా డందులో ఒక సైనికాధికారి.

అంతలో వెలుపల సైనికులు వచ్చిన అలికిడి అయింది. ఆ మందిరాన్ని వారు చుట్టు ముట్టివున్న సవ్వడి వినబడింది. అశ్వాల డెక్కలచప్పుడు స్పష్టంగా వినవచ్చింది.

త్రిపురాంతకు డా గాఢాంధకారంలో వెలుపలికి చూచాడు. స్పష్టంగా కనబడకపోయినప్పటికీ అశ్వికులు వచ్చి తనమందిరాన్ని చుట్టుముట్టిన ట్లతని కనిపించింది. సైనికాధికారులకుగూడ అలాగే అనిపించింది.

'మనమందరం పట్టుబడిపోయాము' అన్నా డొక సైనికాధి కారి.

'ఈ రహస్యం ఎలా బయటపడింది?' ప్రశ్నించాడు త్రిలింగ మూర్తి.

త్రిపురాంతకు డదిరిపోయాడు. అతని నోట మాటరాలేదు.

'ఇక మనకు దారేది?' ప్రశ్నించా డొక సైనికాధికారి.

'దారేమున్నది? మరణంతప్ప' అన్నాడు త్రిలింగమూర్తి.

ఉషఃకాలమయింది. ఆకాశాన తెల్లని రేకలు పొడగట్టసాగాయి. ఆ వెలుగులో ఆ మందిరాన్ని చుట్టు ముట్టిఉన్న అశ్వికసైన్యం ఆ

భవనంలో ఉన్నవారికి బాగుగా కనబడింది. దాన్నిచూచి వారు హతాశులయ్యారు. ఆ కుట్రలో ఎందుకు చేరామా అనుకొన్నారు. పన్నాగం భగ్నమయినందు కెంతో చింతించారు. తమ దుస్థితికి వారు కన్నీరుగార్చారు.

వేగులవారు వచ్చి చెప్పిన వెంటనే సోమదేవుడు వెళ్ళి రాజు గారిని కలుసుకొన్నాడు. రాజుతో చర్చించి త్రిపురాంతకుణ్ణి బంధించాలని నిర్ణయించుకొని అతని మందిరాన్ని చుట్టివేయవలసిందని తన ఆశ్వికుల కాజ్ఞయిచ్చాడు. అతని ఆజ్ఞననుసరించి ఆ యాశ్వికులు త్రిపురాంతకుని మందిరాన్ని చుట్టివేశారు. ఆ సమయంలోనే కుట్రలో చేరిన సైనికాధికార్లుగూడ అచ్చటే ఉన్నారు గనుక వారిని ప్రత్యేకంగా బంధించవలసిన అవసరం లేకపోయింది.

మరల సోమదేవుడు వచ్చి రాజుగారితో రహస్యంగా ఏదో చర్చించాడు. అధిరాజేంద్రుని అనుమతి తీసుకొని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే సోమదేవుడు తనకు విశ్వాసపాత్రులయిన సేనానుల్ని రావించాడు. వారికి వివరాలన్నీ చెప్పాడు. వెంటనే యుద్ధానికి సన్నద్ధం గమ్మన్నాడు.

ఉదయమయ్యేసరికి సైన్యమంతా సన్నద్ధమయింది. పదాతులు, ఆశ్వికులు, కాంచీపురానికి కొంత దవ్వేగి బయలుదేరి నిల బడ్డారు. వారికి తోడుగా గజయూథంగూడ వెళ్ళింది. సోమదేవుడు స్వయంగా సేనకు నాయకత్వం వహించాడు.

ఆ నాటిరాత్రి రెండవయామున చక్రకూటసైన్యం కాంచీపురాన్ని సమీపించింది. చోళసైన్యం చాళుక్యసైన్యాన్ని ఎదుర్కొన్నది.

కాంచీపురసైన్యం అంత సన్నద్ధంగా ఉంటుందని రాజేంద్రుడుగాని, సేనానియైన నారనదేవుడుగాని అనుకోలేదు. రాజును, సోమదేవుణ్ణి బంధించి త్రిపురాంతకుడు తన సైనికాధికారులతో తమరి నాహ్వానించడాని కెదురువస్తాడని వారు భావించారు. కాని అలా జరగలేదు. కాంచీపురసైన్యం ప్రాణాలకు తెగించి పోరాడడానికి సిద్ధమై అచ్చటికి వచ్చి ఉన్నది.

ఇక ఆలోచించడానికిగాని, ఆలస్యం చేయడానికిగాని వీలు లేదు. పరమేశ్వరునిమీద భారంవేసి ముందుకు వెళ్ళమన్నాడు రాజేంద్రుడు. నారనదేవుడు తన సైన్యాల్ని ముందుకు నడిపించాడు.

పక్షందినాలు పోరుఘోరంగా జరిగింది. కాని కాంచీపురం పట్టుబడలేదు. సోమదేవుని సేనానాయకత్వంక్రింద చోళసైన్యం గట్టిగా పోరాడుతున్నది. 'హర హర' అని చాళుక్య సైనికులు ముందుకు రాసాగారు. వారిని నిలవరించడం చోళసైనికులకు కష్ట సాధ్యమయింది. సోమదేవుదేగాక అధిరాజేంద్రుడుగూడ యుద్ధ రంగానికి వచ్చాడు. ఎంతో పరాక్రమంతో పోరాడసాగాడు.

చాళుక్యసైన్యంలో ఉన్న పట్టుదల చోళసైన్యంలో లేక పోయింది. అది శైవసైన్యం. అందువల్ల వారు మతావేశంతో పోరాడుతున్నారు. చోళసైన్యం మిశ్రమసైన్యం. వైష్ణవులు. శైవులు అందులో ఉన్నారు. సైనికాధికార్లు వైష్ణవులైనప్పటికీ సైనికులలో నూటికి అరవైపాళ్ళు శైవులు. యుద్ధంలో ప్రథమ శ్రేణిలో నిలిచి పోరాడడానికి శైవులు జంకినట్లు నటించి వెనక్కు తగ్గ నారంభించారు. 'హరహర' అనే చాళుక్యుల యుద్ధనినాదం వారిని వెనుకంజవేయింపసాగింది. తమ మతస్థుల్నే తామెదుర్కొ నడం వారి కిష్టంలేకపోయింది. పైగా శైవులైన సైనికాధికారులు కనబడకపోవడంవల్ల, వారు బంధించబడ్డారని తెలియడంవల్ల వారు యుద్ధం గావిస్తున్నట్లు నటించారుగాని మనస్ఫూర్తిగా సమరం సాగించలేదు. కాంచీపురసైన్యాలు చక్రకూటసైన్యాలకంటె హెచ్చుగా ఉన్నప్పటికీ శైవవైష్ణవభేదాలవల్ల చోళసైన్యం చాళుక్యసైన్యం యొక్క ధాటికి ఆగలేకపోయింది.

తమ సైన్యాలు వెనుకంజ వేస్తున్నందుకు సోమదేవుడు దిగులుపడ్డాడు. వారినెంత ప్రోత్సహించినప్పటికీ, ఎంత ఉత్సాహ పరచినప్పటికీ వారు ముందంజవేయలేక పోయారు. అనుకున్న విధంగా విక్రమాదిత్యుని సైన్యం తమకు సాయం రాలేక పోయింది.

ఆరవ విక్రమాదిత్యు డధిరాజేంద్రుని బావమరిది. అతణ్ణి తమకు సాయంగా రావలసిందని అధిరాజేంద్రుడు చారుల్ని పంపాడు. వా రేమైనారో, విక్రమాదిత్యు డేమన్నాడో ఏమీ తెలియరాలేదు. ఇక ఓటమి తప్పదనిపించింది రాజుకు. సేనానికి. ఏమైనాసరే కడవరకు పోరాడడానికే నిశ్చయించుకొన్నారు వారు.

యుద్ధంలో అధిరాజేంద్రుడు ప్రథమశ్రేణిలో నిలిచి పోరాడ సాగాడు. అతని ధాటికి నారనదేవుడు గూడ ఆగలేకపోయాడు. ఇంతలో వెనుకనుండి ఎవరో ఒక సైనికు డతణ్ణి వీపునపొడిచాడు. అప్పుడతడు కెవ్వున కేకబెట్టి అశ్వంనుండి క్రిందికి కొరిగిపోయాడు. అంతలో రాజును పొడిచిన సైనికుణ్ణి తక్కినవారు ముక్కలు ముక్కలు గావించారు

రాజు పడిపోవడాన్ని చూచి చోళసైన్యం చెదిరి వికావిక లయింది. దాన్ని సమీకరించడానికి సోమదేవునికిగూడ సాధ్యంకాక పోయింది. శైవులయిన సైనికులు చాళుక్యసైన్యంతో చేరిపోయారు. వైష్ణవులు మాత్రం మిగిలిపోయారు. కాని సోమదేవుడు వెనుకంజ వేయలేదు. ఏ విధంగానైనా కాంచీపురాన్ని కాపాడుదామనుకున్నాడు. చాళుక్యసైన్యాన్ని అతిధైర్యంతో ఎదిరింపసాగాడు.

అతిపరాక్రమంతో పోరాడుతున్న సోమదేవుని ధాటికెవ్వరూ నిలబడలేకపోయారు. అందువల్ల రాజేంద్రుడే ముందుకువచ్చి అతణ్ణి ఎదుర్కొన్నాడు. ఇద్దరికీ పోరు ఘోరంగా జరిగింది. యువకుడైనప్పటికీ రాజేంద్రుడు సోమదేవుని దెబ్బకు తట్టుకోలేక పోయాడు. కోపంవచ్చి ఖడ్గాన్నితీసి సోమదేవుణ్ణి విసరికొట్టాడు. ఆ దెబ్బకు సోమదేవుని ఖడ్గం విరిగిపోవడమేగాక అతడు అశ్వంనుండి వాలిపోయాడు. వెంటనే అతణ్ణి చాళుక్యసైన్యం బంధించివేసింది.

తమ రాజు మరణించాడాన్ని, తమసేనాని బంధింపబడడాన్ని తిలకిస్తూనే కాంచీపురసేన పరుగెత్తడానికి ప్రారంభించింది. చాళుక్య సేన ఆ సైనికుల్ని తరుముకొని కాంచీపుర దుర్గంలో ప్రవేశించింది. ప్రధాన కార్యాలయాల నన్నిటినీ ఆక్రమించుకొన్నది.

చాళుక్యసేనతో చేరిపోయిన శైవసైనికులు నారనదేవునికి త్రిపురాంతకుడు బంధింపబడి ఉన్నమందిరాన్ని చూపారు. వారిని విడుదల చేయవలసిందని చాళుక్యసేనాని ఆజ్ఞాపించాడు. చాళుక్య సైనికులు వారిని విడుదల చేశారో లేదో వెంటనే కోటబయట కోలా హలం హెచ్చింది.

ఎచ్చటినుండో సైన్యంవచ్చి చాళుక్యసైన్యంమీద బడింది. అది విక్రమాదిత్యునిసైన్యం. ఆ సైన్యం రావడానికి కొంత ఆలస్య మయింది. వెళ్ళిన చారులు అనుకున్న వేళకు విక్రమాదిత్యుణ్ణి కలుసుకొనలేక పోయారు. సైన్యాన్ని సిద్ధంగావించడానికి వారికి చాల వ్యవధి పట్టింది. అందువల్ల వారు చాల ఆలస్యంగా రావడం జరి గింది. వచ్చేసరికి కాంచీపురం చాళుక్యుల హస్తగతమైపోయింది.

అంతమాత్రాన విక్రమాదిత్యుడు ఆశ వదలుకోలేదు. అక్ర మంగా వచ్చి కాంచీపురాన్ని ఆక్రమించిన రాజేంద్రుని కొక గుణ పాఠం చెప్పాలనుకున్నాడతడు. అధిరాజేంద్రుడు మరణించిన విషయంగాని, సోమదేవుడు బంధించబడిన విషయంగాని అతనికి తెలియదు.

కొత్తగావచ్చి పైబడిన సైన్యాన్ని ఎదిరించమని ఆజ్ఞ యిచ్చాడు రాజేంద్రుడు. విక్రమాదిత్యునిసైన్యానికి, చాళుక్యసైన్యానికి మూడు దినాలు భయంకరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో విక్రమా దిత్యునిసైన్యం దెబ్బతినింది. విజయోత్సాహంతో చాళుక్యసైన్యం ముందుకు నడిచింది. గత్యంతరంలేక విక్రమాదిత్యుడు పలాయనం గావించాడు.

విజయగర్వంతో రాజేంద్రుడు, నారనదేవుడు కాంచీపుర వీధుల్లో ఊరేగారు. తన మందిరంనుండి విడిపింపబడిన త్రిపురాంత కుడు అతనితోఉన్న త్రిలింగమూర్తి భక్తితో వారి కెదురుగా వచ్చి నమస్కరించారు.

# 7

## తిల్య

*రామానుజుడు ధ్యానసమాధిలో నిమగ్నుడై వున్నాడు. కూరేశుడు, దాశరథి తక్కినవారందరూ ఏవో వ్రాసుకుంటున్నారు.*

అరుళాళ ప్పెరుమా ళెంబెరుమానార్ కూరేశునివద్దకు వచ్చి ఏవో చర్చించి వెళ్ళాడు. ఈ అరుళాళప్పెరుమాళెంబెరుమానారే యజ్ఞ మూర్తి.

యజ్ఞమూర్తి ఓడిపోయిన తరువాత అతడు రామానుజుని శిష్యరికాన్ని అంగీకరించాడు. అప్పుడు రామానుజు డతని కా పేరు బెట్టి ప్రత్యేకంగా ఒక మఠాన్ని నెలకొల్పి దాని కతణ్ణి అధిపతిని గావించాడు. మరుధగ్రామ పూర్ణుణ్ణి, భక్తగ్రామపూర్ణుణ్ణి, అనంతా ళ్వారును, యజ్ఞేశుణ్ణి అతనికి శిష్యులుగా అప్పగించాడు. అప్పటి నుండి యజ్ఞమూర్తి ఆ మఠాధిపతిగాఉండి వైష్ణవాన్ని ప్రబోధిస్తు న్నాడు. వైష్ణవంలో తనకేదైనా సందేహాలు వచ్చినప్పుడు కూరే శుణ్ణిగాని, రామానుజుణ్ణిగాని అడిగి తెలుసుకొని వెడుతూంటాడు

కూరేశుడుగూడ రామానుజు నంతటివాడే. అతడు గురువుకు మించిన శిష్యుడు. అందువల్లనే ఏవైనా సందేహాలు కలిగిన వైష్ణవులు ముందు కూరేశుని వద్దకు వచ్చి తమ సందేహాలు తీర్చుకొంటారు. అప్పటికి గూడ తమ సందియాలు తీరకపోతే రామానుజుని వద్దకు వెడుతుంటారు. అందువల్లనే యజ్ఞమూర్తిగూడ కూరేశునితో చర్చించి వెళ్ళాడు.

రామానుజుడు ధ్యాన సమాధినుండి లేచాడు. కూరేశు డతని వద్దకు వచ్చి మీకోసం తిల్య అనే వనిత వచ్చి ఉందని చెప్పాడు.

'ఎవరామె?' రామానుజుడు ప్రశ్నించాడు.

'తనది చిదంబరమని చెప్పింది.'

'సరే, రమ్మని చెప్పు.'

కూరేశుడు వెళ్ళాడు.

రామానుజుడు ధ్యానం గావించుకొంటున్నప్పుడుగాని, ఆ తరువాత కొంతసేపుగాని యెవ్వరూ ఆతని వద్దకు రారు. కూరేశునికి మాత్రమే ఆ స్వాతంత్ర్య ముంది. ఎవరైనా రామానుజుణ్ణి చూడాలనుకొన్నప్పుడు కూరేశుని ద్వారా ఆతణ్ణి చూడాలి. కూరేశుడు లేనప్పుడు దాశరథి ద్వారా దర్శించాలి.

కూరేశుడు తిల్యను వెంటబెట్టుకొని వచ్చాడు. ఆమె చాల అందంగా ఉంది. యౌవనంలో ఉంది. ఆమెకు దాదాపు ఇరవై ఐదు ఏళ్ళుంటాయి. తిల్య వస్తూనే రామానుజుని పాదాలకు సాష్టాంగ పడింది. రామానుజు డామె నాశీర్వదించాడు.

తిల్య ఒక వారాంగన. ఆమె అందానికి మేరలేదు. ఆమె నవ్వితే పూలు రాలిన ట్లుంటుంది. ఆమె నడిస్తే హంస నడిచిన ట్లుంటుంది. ఆమె మాట్లాడితే ముత్యాలు ఒలకబోసినట్లుంటుంది.

తిల్యది చిదంబరం. ఆమె వారాంగనగా పుట్టింది. ఆమెకు యౌవనం వస్తూనే ఆమె గోవిందరాజస్వామి గుడిలో నృత్యం గావింపసాగింది. చిదంబరంలో ఉన్న కవులు, గాయకులు, రూపవంతులు, ధనవంతులు అందరూ ఆమె నృత్యాన్ని చూడడానికి వెళ్ళారు. ఆమె నృత్యం గావిస్తూ హావభావ విలాసాలను ప్రదర్శిస్తున్నప్పుడు ప్రతివాడు ఆమె తన్ను చూచే నవ్విందని, తన్నే పిలిచిందని, తన్నే వలచిందని, తన్నే సంబోధించిందని అనుకొన్నారు. వారిలో చాలమంది ఆమెకోసం తాపత్రయపడ్డారు. ఆమె ఒకసారి తమ్ము కన్నారా చూస్తే చాలునని, తమ్ముచూచి మనసారా ఒక నవ్వు నవ్వితే చాలునని, ఆమె తమతో ఒక పలుకు పలికితే చాలునని కాచుకొని కూచున్నారు.

కాని ఆమె అలా చేయలేదు. ఆమె వారాంగనల కుటుంబంలో పుట్టినప్పటికీ ఆమె కా అలవాట్లు లేవు. ఆమెకు చిన్నప్పటి నుండి గోవిందరాజస్వామి మీద భక్తిమెండు. ఆమె తన్ను తాను ఆ భగవానుని కర్పించుకొన్నది. ఆతణ్ణి ఆనందింప జేయడానికే

నృత్యం నేర్చుకొన్నది. అతణ్ణి సంతసింప జేయడానికే అతని యెదుట నృత్యం గావిస్తున్నది. కాని ఆ విషయం తక్కినవారికి తెలియదు.

తన వృత్తిలో ప్రవేశింపమని తిల్యై తల్లియైన కుముదిని ఆమె నెంతో ప్రోత్సహించింది. ఎంతో బలవంత పరిచింది. కాని తిల్యై అందు కంగీకరించలేదు. దీప మున్నప్పుడే ఇల్లు సరిపెట్టు కోవా లన్నది తల్లి, యౌవనం జారిపోయిన తరువాత చింతించ వలసి ఉంటుం దన్నది. మనస్సు మార్చుకొమ్మని ప్రతిమ లాడింది. కాని తిల్యై వినలేదు. తనరూపం, యౌవనం అంతా ఆ దేవదేవునికే అర్పిస్తానని, తన అందాన్నంతటినీ అతని పాదాల కడనే ఒలకబోస్తాననీ, తన నృత్యాన్నంతటినీ అతణ్ణి సంతృప్తి పరచడానికే ప్రదర్శిస్తాననీ, తన్నిక యేమాత్రం బలవంతం చేయ వద్దనీ తల్లితో గట్టిగా చెప్పివేసింది. కుముదిని గూడ ఏమీ చేయలేక ఊరకున్నది.

తిల్యై గోవిందరాజస్వామి ఆలయానికి వస్తున్నప్పుడు పురు షులేగాక స్త్రీలుగూడ వీధుల్లో నిలబడి ఆమె రూపురేఖల్ని, అస మానమైన ఆమె సౌందర్యాన్ని తిలకించేవారు. ఆమె ఆలయంలో నృత్యం గావిస్తున్నప్పుడు వందలకొద్దీ చేరి ఆ నృత్యాన్ని కాంచేవారు. ఆమె నెంతచూచినప్పటికీ, ఆమె నృత్యం ఎన్నిమార్లు పరికించి నప్పటికీ వారికి సంతృప్తి అంటూ ఉండేదిగాదు.

చిదంబరంలో ఉన్న ధనవంతులైన యువకు లెంతోమంది ఆమె హస్తంకోసం తాపత్రయపడ్డారు. ఆమె నేలాగైనా ముద్దిడు కోవాలని తహతహలాడిపోయారు. ఒక చుంబనానికే వేలవరహాలను కుమ్మరిస్తామని చెప్పిపంపారు. కాని ఆమె అంగీకరించలేదు. ఆమెకు శారీరకసుఖా లక్కరలేదు. భోగభాగ్యా లంతకంటె పనిలేదు. ఆమెకు కావలసింది గోవిందరాజస్వామి. ఆయన కరుణాకటాక్షం. అంత కంటె ఆమె కేమీ అవసరంలేదు. అందువల్ల ఆమె వారినందరినీ తృణీకరించింది.

గోవిందరాజస్వామి ఆలయంలో ఆమె నృత్యం చేస్తున్నప్పుడు తన్నే రాధగా, గోవిందరాజస్వామిని కృష్ణుడిగా భావించుకొనేది. ఆ భావనలో ఆమె లీనమయ్యేది. కృష్ణుణ్ణి మురిపించాలని రాధ ఎంతగా ప్రయత్నించిందో అంతగా ఆమె తన స్వామిని మురిపించాలని ప్రయత్నించింది. ఏవిధంగా రాధ కృష్ణునిమీద అలిగిందో ఆమె గూడ అలాగే తన స్వామిమీద అలిగింది. ఏవిధంగా రాధ కృష్ణుని కానకుండా తహతహలాడుతూ విరహంతో బృందావనమంతా వెతికిందో, అలాగే ఆమెగూడ తన స్వామిని కనుగొనడానికి ఆ ఆలయాన్నంతటినీ వెతికింది. ఏవిధంగా రాధిక కృష్ణునిగానక విరహవేదనతో కన్నీరు కార్చిందో ఆవిధంగానే తిల్య తన స్వామినిగానక ఆవేదనతో అశ్రువుల్ని జార్చింది.

దుఃఖాన్ని సంతసాన్ని-సంతృప్తిని అసంతృప్తిని - వేదనను ఆనందాన్ని ప్రకటిస్తూ - ఏడుస్తూ నవ్వుతూ, అన్వేషిస్తూ, పరిభ్రమిస్తూ ఆమె నృత్యం గావిస్తుంటే నిజంగా ఆమె రాధికలాగే ఉండేది. అప్పు డామెను చూచిన వారందరూ తన్మయులయ్యేవారు.

తిల్యకు గోవిందరాజస్వామితప్ప మరేమీ కాబట్టలేదు. అతడే తన మనోనాథు డని యెంచుకొని అతనికోసమే తాను బ్రతకజొచ్చింది.

ఒకనాడు దేవుని ఆలయంలో నృత్యంచేయడానికి వెళ్ళినప్పుడు రామానుజుణ్ణిగూర్చి అచ్చట ఉన్న అర్చకులు చెప్పుకుంటుంటే ఆమె విన్నది. ఆ అర్చకులు వైష్ణవులు. వారికి రామానుజుడంటే భక్తి ఎక్కువ. అందువల్ల రామానుజునికి సంబంధించిన విషయాలను వారు కలుసుకొన్నప్పుడెల్లా చెప్పుకొనేవారు. అనా డామె వారి మాటల్ని విన్నది. అప్పటినుండి ఆమెకు రామానుజుణ్ణిగూర్చి తెలుసుకోవాలనిపించింది.

రామానుజుడు చాల గొప్పవాడట. దైవాంశసంభూతుడట. అగ్రవర్ణాలవారినేగాక, శూద్రుల్ని, పంచముల్నిగూడ దగ్గరచేరుస్తాడట. వారికందరికీ వేదరహస్యాలను చెబుతాడట. అతని సన్నిధిలో

వర్ణభేదమే లేదట. వైష్ణవంలో మనిషికి మనిషికి జన్మతః తేడా లేదని అంటాడట.

రామానుజుని యశస్సు దినదిన ప్రవర్ధమాన మవుతున్నదట. ఆ కీర్తిని చూచి కొందఱికి చాల అసూయ కలుగుతున్నదట. ఆ మహో మహూనికి విషాన్నం తినిపించాలనీ ప్రయత్నం జరిగిందట. కాని దేవుని దయవల్ల అది తప్పిపోయిందట.

రామానుజుడు తన గురువైన యాదవప్రకాశుణ్ణి అధిక్షేపించాడట. అతని సన్నిధిలోనే అద్వైతాన్ని కాదన్నాడట విశిష్టాద్వైత మతాన్ని ప్రతిపాదించాడట. ఉద్దండుడైన అద్వైతతత్వవేత్తల్ని ఓడించాడట. మేధానిధియైన యజ్ఞమూర్తినిగూడ ఓడించి తన శిష్యుణ్ణి చేసుకున్నాడట.

ఈవిధంగా ఎన్నోవిషయాల నామె విన్నది.

అంతేగాక మరొక సంఘటననుగూర్చి గూడ ఆమె ఆలకించింది. ఆ సంఘటన ఆమె నెంతో ఆకర్షించింది. అది యిది.

శ్రీరంగానికి సమీపంలో ధనుర్దాసు డనునతడుండేవాడు. అతడు నవయౌవనుడు. గొప్ప మల్లుడు. చూడడానికి చాల అందంగా ఉండేవాడు. అతడు పొణ్ణాచ్చి అనే కన్యను ప్రేమించాడు. ఆమె ఒక వారాంగన.

ధనుర్దాసునికి ఆ పొణ్ణాచ్చిమీద ఎంతో ప్రేమ. ఆమెరూప లావణ్యాల కతడు విభ్రమంజెంది ఆమె నెన్నడూ వదలకుండేవాడు.

ఒకప్పుడు శ్రీరంగంలో రంగనాథుని ఉత్సవాలొచ్చాయి. చైత్రమాసంలో ఆ ఉత్సవాలు వస్తాయి. ఆ సమయంలో శ్రీరంగం చుట్టుప్రక్కలనుండి పల్లెప్రాంతాలనుండేగాక సుదూర ప్రాంతాల నుండిగూడ రంగనాధస్వామిని దర్శించడానికని వేనవేలప్రజలు వస్తారు. ఆ ఉత్సవాలలో శ్రీరంగం జనాలతో క్రిక్కిరిసి నయనానందకరంగా ఉంటుంది.

పొణ్ణాచ్చికిగూడ శ్రీరంగని ఉత్సవాలు చూడాలని మనస్సు పుట్టింది. అందుకోస మామె శ్రీరంగానికి బయలుదేరింది. ధనుర్దాసుడుగూడ ఆమెను వీడలేక వెంబడించాడు.

శ్రీరంగానికి వచ్చిన తరువాత పొణ్ణాచ్చి ఎచ్చటికి వెడితే అచ్చటికి కతడు వెళ్ళసాగాడు. ఆమె నొక్క నిమిషమైనా వీడి ఉండ లేకపోతున్నాడు. ఆమె కావేరీనదికి స్నానం చేయడానికి వెళ్ళు తున్నది. తానుగూడ తోడు వస్తా నన్నాడా మల్లుడు.

అది ఉదయకాలం. కొంత ప్రొద్దు ఎక్కింది. సూర్యుడు చాల తీక్ష్ణంగా వెలిగిపోతున్నాడు. అతని కిరణాలు కావేరీనదికి వెళ్ళే వారిమీద పడుతున్నాయి. ఆ కిరణాలకు పొణ్ణాచ్చి నెమ్మోము కంది పోతుందని, ఆమె కనుదామరలు వాడిపోతాయని భయపడి ధనుర్దాసుడు నన్నాసి తన అంగవస్త్రాన్ని ఆమె ముఖాని కడ్డంగా పెట్టి వెనక్కి వెనక్కి నడవసాగాడు. ఆ దృశ్యాన్ని చూచిన యాత్రికు లందరూ కడుపుబ్బ నవ్వసాగారు. కాని ధనుర్దాసుడు మాత్రం తన పనిని మానలేదు.

పొణ్ణాచ్చి, ధనుర్దాసుడు అలా వెళుతున్నప్పుడు రామానుజుడు కావేరీనదిలో స్నానం గావించి తన శిష్యులతోగూడ ఆ దారిని వస్తున్నాడు. అప్పు డాయనగూడ ఆ దృశ్యాన్ని పరికించాడు. అతని కామె మీద ఉన్న వ్యామోహానికి ఆశ్చర్యపడ్డాడు. ఆయనకి ధనుర్దా సుని మీద చాల జాలి గలిగింది. 'ఇంత మమకారమే దేవునిమీద అతని కున్నట్లయితే——' అనుకొన్నాడు రామానుజుడు. ధనుర్దాసుని తనవద్దకు పిలవనంపాడు. ధనుర్దాసు డతనివద్దకు వచ్చాడు.

రామానుజుని కతణ్ణి చూస్తూనే ఎందుకో అతనిమీద ఎంతైనా ప్రేమ గలిగింది. కరుణారస తరంగిత హృదయంతో ఆయన ధను ర్దాసుణ్ణి చూచి——

'నాయనా, నీ దేవూరు?' అని ప్రశ్నించాడు.

'నాది ఉరయూరు.'

'నీ వేమీ అనుకోకుంటే ఒకమాట చెప్పాల నుంది.'

రామానుజుణ్ణి చూస్తూనే ధనుర్దాసునికి తనలో ఏదో మార్పు వచ్చిన ట్లనిపించింది. ఎన్నడూ లేని నమ్రభావ మబ్బింది.

'చెప్పండి, వింటాను.'

'నీ ప్రియురాలి మీద ఎంత ప్రేమ ఉన్నప్పటికీ నీలాగా ఇలా ప్రవర్తించేవా రున్నారా?' అని అడిగాడు రామానుజుడు.

'ఏమి చేయమంటారు? ఆమె కళ్ళు చాల అందంగా ఉంటాయి. అవి చాల కోమలంగా ఉంటాయి. పద్మాలకంటే సున్నితంగా ఉంటాయి. అవి ఎలా ఈ మంచు తెంపను సహించ గలుగు తాయి చెప్పండి. అందుకని ఇలా....' అని ఆగాడు ధనుర్దాసుడు.

రామానుజునికి నవ్వు వచ్చింది.

'ఆమె అందం కందిపోతే నాకు బాధ కలుగుతుంది. అందు వల్ల ఇలా చేశాను. ఇందులో తప్పుంటే చెప్పండి.' అన్నాడు ధనుర్దాసుడు.

అతని సత్య వచనాల కానందం కలిగింది రామానుజునికి. అతడు చిరునవ్వుతో, 'కుమారా! నేనా కళ్ళకంటె అందమైన కళ్ళను చూపుతాను. నాతో వస్తావా?' అన్నాడు.

'అంతకంటె మహాభాగ్య మే మున్నది? వస్తాను.' అంటూ వెంట వెళ్ళాడు ధనుర్దాసుడు.

రామానుజుడు ఆలయంవైపు వెళ్ళాడు. ధనుర్దాసు డతణ్ణి వెంబడించాడు. రామానుజుని వెనుక ఆయన శిష్యులు, వారి వెనుక పొన్నాచ్చి వెళ్ళ సాగారు.

ఆలయంలో ప్రవేశించి గర్భగుడివద్దకు వచ్చిన తరువాత రామానుజుడు ధనుర్దాసునితో, 'ఆకర్షణీయమైన ఆ కళ్ళనుచూడు. ఎంత అందంగా ఉన్నాయో.' అని రంగనాథుని నేత్రాలను చూపాడు

ధనుర్దాసు డా నేత్రాలవైపు చూచాడు.

'చూడు, బాగుగా చూడు. అవి నీ ప్రియురాలి నేత్రాలకంటె అందంగా లేవా?' రామానుజుడు ప్రశ్నించాడు.

ధనుర్దాసుడు అలాగే చూడసాగాడు. ఆ కళ్ళు అతణ్ణి ముగ్ధుణ్ణి గావించాయి. ఆ మూర్తి అతణ్ణి తన్మయుణ్ణి గావించింది. అప్పు డతనిలో ఎనలేని ఆనంద ముప్పొంగింది. అది వర్ణనాతీతమైన ఆనందం. అతడు పొన్నాచ్చితో వత్సరాలు గడిపి ఉన్నాడు. ఆమె

కళ్ళవైపు వేలసార్లు చూచియున్నాడు. కాని ఇప్పుడు దతనికి కలిగిన ఆనందంగాని, సంతృప్తిగాని ముందెన్నడూ కలిగి ఉండలేదు.

పొణ్ణాచ్చి అందమే అందమని, ఆ అందాన్ని తిలకించడం వల్ల కలిగిన ఆనందమే ఆనందమని అత నింతవరకు అనుకొన్నాడు. కాని దేవుడైన రంగనాథుని నేత్రాలలో అంతకంటె ఎంతో అంద మున్నది. వాటిని చూచినప్పు డెంతో ఆనందం కలుగుతున్నది. ఈ అంద మెక్కడ? ఆ అంద మెక్కడ? ఈ ఆనంద మెక్కడ? ఆ ఆనంద మెక్కడ?

ధనుర్దాసునిలో గొప్పమార్పు వచ్చింది. అతడు మంత్ర ముగ్ధు డైనట్లుగా నిలబడ్డాడు. నిలబడినచోటునుండి కదలకుండా అలాగే చూస్తున్నాడు.

రామానుజుడు చిరునవ్వునవ్వుతూ 'ఎవరికళ్ళు అందంగా ఉన్నాయి?' అని ప్రశ్నించాడు.

'ఏమని చెప్పమంటారు తండ్రీ! మీ దయవల్ల ఈ నాటికి నేను తరించగలిగాను. నాకిక ఆ నేత్రాలు వద్దు. ఆ పొణ్ణాచ్చివద్దు. నన్ను అనుగ్రహించండి. నే నిక్కడే ఉండిపోతాను' అని ధనుర్దాసు రామానుజుని పాదాలమీద బడ్డాడు.

రామానుజు డతణ్ణి ఆశీర్వదించి లేవదీశాడు. అతని అభ్యర్థన ననుసరించి అతణ్ణి తన శిష్యకోటిలో చేర్చుకొన్నాడు.

పొణ్ణాచ్చి ఆ దృశ్యం తిలకించింది. రామానుజుని సమ్ముఖంలో ఆమె మనస్సుగూడ మారిపోయింది. ఆమెగూడ రామానుజుని పాదాలమీద బడి తన్నుగూడ శిష్యురాలుగా అంగీకరించమన్నది. అందుకు రామానుజుడు ఆనందంతో అంగీకరించాడు.

వారాంగనయైన పొణ్ణాచ్చిని రామానుజుడు తన శిష్యురాలిగా అంగీకరించడం తిల్య కెంతో ఆనందాన్ని చేకూర్చింది. ఇంతవరకు యతు లెవ్వరూ స్త్రీలను తమ శిష్యురాండ్రుగా అంగీకరించలేదు. బుద్ధు డెన్నడో వారిని తన ధర్మచ్ఛత్రం క్రింద చేర్చుకొన్నాడు. కాని ఆ తరువాత యెవ్వరూ అలా చేయలేదు. గొప్ప గొప్ప అద్వైతులు గూడ స్త్రీలనే గాదు కడకు శూద్రులనుగూడ చేరదీయడం లేదు. రామా

నుజు డలా కాకుండా శూద్రులనేగాక పంచములనుగూడ తనవద్దచేర్చి వారికి మోక్షమార్గాన్ని చూపుతున్నాడు. పురుషులనేగాక, స్త్రీలను- అందులో పతితలైన వారాంగనలనుగూడ దగ్గరచేర్చి వారి నుద్ధరిస్తు న్నాడు. అంతకంటె గొప్పవా డెవ్వ డున్నాడు ? ఆయన్ని, ఆ మహా భాగుణ్ణి, ఆ మహాపురుషుణ్ణి తాను తప్పనిసరిగా దర్శించి ఆతని పాదాభి వందనం చేయాలి అనుకొన్నది తిల్య. అందుకే ఆమె శ్రీరంగానికి వచ్చింది.

కూరేశుడు తిల్యను తీసుకొని వచ్చాడు.

ఆమెను చూచినప్పుడు రామానుజుని కామెమీద దయారసం పొంగి పొరలింది.

వస్తూనే తిల్య రామానుజుని పాదాలకు సాష్టాంగ దండ ప్రణామ మాచరించింది. ఆయన ఆమెను మనఃపూర్వకంగా దీవిం చాడు.

'ఏమమ్మా ! చాలదూరం వచ్చావు ?' రామానుజు డెంతో ఆదరంతో అడిగాడు.

'మిమ్మల్ని దర్శించి వెళ్ళాలని వచ్చాను.'

తిల్య అంత యౌవనంలో ఉన్నప్పటికీ చాల నిరాడంబ రంగా ఉంది. ఆమె మాటలుగూడ చాల నమ్రభావంతో కూడుకొని ఉన్నాయి.

'శ్రీరంగంలో మరేమైనా పనుందా ?'

'లేదు. మీ దర్శనానికే వచ్చాను. నా కిక్కడ తెలిసినవాళ్ళు గూడ లేరు.'

'రంగనాథుణ్ణి దర్శించావా ?'

'దర్శించాను.'

రామానుజుడు మరి మాట్లాడలేదు.

'నాకు మీ రుపదేశ మివ్వాలి.' అర్థించిందామె.

'నీకా ? ఉపదేశమా ? చిన్నబిడ్డవు. సన్యాసిని వవుతావా ?' నవ్వుతూ ప్రశ్నించాడు రామానుజుడు.

ఆమెగూడ చిన్నగా నవ్వింది.

'చిదంబరంలో గోవిందరాజస్వామి దేవాలయముందిగదా. ఆ దేవుణ్ణి పూజిస్తూ ఉండు. అంతేచాలు,' అన్నాడు రామానుజుడు.

'ఇదివరకె అలా చేస్తున్నాను. ప్రతిదినం ఆ దేవుని సన్నిధిలో నృత్యం గావిస్తున్నాను.'

'నృత్యమా?' ఆశ్చర్యంతో ప్రశ్నించాడు రామానుజుడు.

'అవును. నేను వారాంగనను. అందువల్ల దేవుని యెదుట నృత్యం గావించడం మా వృత్తి.'

'వృత్తిగానే నృత్యం చేస్తున్నావా? భక్తితో నర్తనం గావిస్తున్నావా?'

'వృత్తిగానేగాక భక్తితో గావిస్తున్నాను. నేనిప్పుడు వారకాంతనుగాను. కులవృత్తి కుద్వాసన చెప్పి ఆ స్వామిసన్నిధిలో నృత్యంచేస్తూ సంతృప్తి జెందుతున్నాను.'

ఆమె మాటలకు రామానుజుని కెంతో ఆనందం కలిగింది.

'చాల మంచిపని చేస్తున్నావు తల్లీ, చిన్నప్పుడే యింతభక్తి కుదరడం చాలకష్టం. అది నీ యదృష్టం. ఇక నీకు చెయ్యావలసిన ఉపదేశ మేమీ లేదు. నీ విప్పటికే పరిపక్వ స్థితిని చెందిఉన్నావు. నీ వాలాగే చేస్తూవుండు, దేవుడు కరుణిస్తాడు.'

'మీ రొకసారి చిదంబరం వస్తే బాగుండును,' అన్నదామె.

రామానుజుడు చిరునవ్వునవ్వుతూ, 'గోవిందరాజస్వామి పిలిస్తే వస్తాను.' అన్నాడు.

ఇక ఆ మహామహునితో ఏమి మాట్లాడాలో ఆమెకు తోచ లేదు. అతని సన్నిధిలో ఆమె కెంతో ప్రశాంతత లభించింది. ఆ ప్రశాంతత చిదంబరంలో లభిస్తుందా? ఆమెకు సందేహం కలిగింది.

రామానుజు డామె మనస్సును గ్రహించినట్లుగా ఇలా అన్నాడు: 'అమ్మా, నీవెంతో పుణ్యవతివి. చిన్నతనంలోంచే నీకు దేవునిమీద భక్తి కుదిరింది. గొప్ప గొప్ప ప్రజ్ఞానులకుగూడ

పీకున్న భక్తి అలవడడం లేదు. చిదంబరానికి వెళ్ళిన తరువాత వైష్ణవులను దగ్గరకుతీసి వారిని సేవిస్తూ ఉండు. వైష్ణవమతవ్యాప్తికి తోడ్పడుతూ ఉండు."

ఆ మాటలు విని ఆమె కెంతో హర్షం కలిగింది.

రామానుజుని ఆశీర్వచనం తనకు లభించిందని ఆమెకెంతో ఆనందం కలిగింది.

ఆమె ఆ గురువరేణ్యుని పాదాలకు నమస్కరించి అతని సెలవు దీసుకుని వెళ్ళింది.

# 8

## కులోత్తుంగ చోళుడు

కులోత్తుంగచోళుడు తన మందిరంలో అటూ యిటూ పచార్లు గావిస్తున్నాడు.

కులోత్తుంగుడు బలవంతుడు. అతని కండలు మెలిదిరిగి ఉన్నాయి. అతనిముఖం గంభీరంగా ఉంది. ఆ గంభీరతలోనే ఆదుర్దా ఉట్టిపడుతున్నది.

కులోత్తుంగు డెవరోగాదు, చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రుడు. చక్రకూట సైన్యంతోవచ్చి కాంచీపురాన్ని పట్టుకొన్న తరువాత అతడు చోళరాజయ్యాడు. చక్రకూటాన్ని పూర్వరాజ్యాలను రామనాయకుని హస్తాలలో ఉంచి తాను కాంచీపురంనుండి పరిపాలన సాగించడానికి పూనుకొన్నాడు. చోళరాజ్యాన్ని పాలిస్తున్నాడు గనుక చోళుడని పేరు పెట్టుకొన్నాడు. త్రిపురాంతకుని సలహామీద తన పేరును కులోత్తుంగుడని మార్చుకొన్నాడు.

ఇదివరకు చోళరాజ్యాన్ని రాజేంద్రుడు, వీరరాజేంద్రుడు, అధిరాజేంద్రుడు అని యీ విధంగా రాజేంద్రు లెందరో పాలించారు. అందువల్ల స్పష్టంగా ఉండడానికని, రాజేంద్రుడు తన పేరును కులోత్తుంగుడని మార్చుకొన్నాడు.

కాంచీపురాన్ని పట్టుకున్న తరువాత కులోత్తుంగుడు తన రాజ్యాన్ని పటిష్ఠపరచుకొన్నాడు. తన సైన్యాన్ని శక్తివంతం గావింపచేసుకొన్నాడు.

త్రిపురాంతకుణ్ణి ప్రధానుని గావించి అతనికి తోడుగా మరి పదిమంది మంత్రుల్ని నియమించాడు. నారనదేవుణ్ణి సైన్యాధిపతిని గావించాడు. యుద్ధంలో నష్టపడిన సైన్యాన్ని సమకూర్చుకొనడాని కని కొత్తవారిని సైన్యంలో చేర్చవలసిందని తన సేనాధిపతికి ఉత్త రువు లిచ్చాడు.

చక్రకూటాన్ని పట్టుకొన్నప్పుడుగాని, పూర్వరాజ్యాల్ని జయించినప్పుడుగాని, కాంచీపురాన్ని ఆక్రమించినప్పుడుగాని, చోళ దేశానికంతటికీ అధిపతి అయినప్పుడుగాని అతనికి సంతృప్తి కలగ లేదు. అవి పరరాజ్యాలు. తన రాజ్యమైన వేంగిరాజ్యం పరుల చేతుల్లో ఉన్నది. అది అతనికెంతో అవమానకరంగా తోచింది. ఏ విధంగానైనా వేంగిరాజ్యాన్ని జయించాలని అతనికనిపించింది.

కులోత్తుంగునికి నారనదేవునిమీద ఎంత ప్రేమ ఉన్నదో త్రిపు రాంతకునిమీద గూడ అంత ప్రేమ ఏర్పడింది. చోళరాజ్యాని కతి సులభంగా తాను రాజుగావడానికి కారకుడు త్రిపురాంతకుడు. తనవల్ల ప్రాణాపాయ స్థితినిగూడ అతడు ధైర్యంతో ఎదుర్కొన్నాడు. ఏ విధంగానైనా తన్ను చోళసింహాసనంమీద ఉంచాలని ప్రయత్నిం చాడు. తను రాజైన తరువాత తనకెంతో విధేయుడుగా ఉన్నాడు. చాల సామర్థ్యంతో పరిపాలనను నిర్వహిస్తున్నాడు. అందువల్ల తానుగూడ అతని సలహాలేకుండా ఏ కార్యంగాని చేయడంలేదు.

వేంగిరాజ్యాన్నిగూర్చి ఆలోచించడానికని కులోత్తుంగుడు త్రిపురాంతకుణ్ణి, నారనదేవుణ్ణి రావించాడు. వారితో దానికి సంబం ధించిన అన్ని విషయాలను చర్చించాడు.

ఇటీవలనే యుద్ధం ముగిసింది. సైన్యం చాల దెబ్బతింది. ఇప్పుడే కొత్తదళాలు సమీకరించబడుతున్నాయి. కాబట్టి కొంతకాలం ఆలసిస్తే మంచిదని నారనదేవుడు సలహాఇచ్చాడు. కాని ఆ సలహా కులోత్తుంగునికి నచ్చలేదు.

కాంచీపురయుద్ధంలో విక్రమాదిత్యుడు దెబ్బతిని ఉన్నాడు. వేంగిరాజ్యాన్ని పాలిస్తున్న విజయాదిత్యుడు తానంటే భయపడు తున్నాడు. అందువల్ల యిద్దరూ ఏకమైతే తనకు కష్టం రావచ్చును. కనుక వెంటనే వేంగిని పట్టుకుంటే విమలాదిత్యు డొంటరియై తమ మీదికి రాకుండా ఉంటా డని కులోత్తుంగు డన్నాడు.

ఆ ఆలోచన సరిగానే ఉందని త్రిపురాంతకుడు చెప్పాడు. నారనదేవుడుగూడ ఆ విషయమై తీవ్రంగా ఆలోచించాడు. విక్రమా దిత్యుడు సామాన్యుడుగాడు. అందువల్ల తమమీది క్రోధంతో విజయాదిత్యునితో ఏనాడైనా కలిసిపోవచ్చు. కాని యిప్పుడతడు యుద్ధంలో దెబ్బతిని చాల బలహీనపడి ఉన్నాడు. కనుక వెంటనే యుద్ధం చేయడం అతనికి చాలకష్టం. ఇప్పుడే విజయాదిత్యునిమీదికి వెళ్లడం మంచిది అనుకొన్నాడు నారనదేవుడుగూడ. కాని దానికి తోడతనికి మరొక ఆలోచనగూడ స్ఫురించింది.

'మహారాజుగారు చెప్పింది యుద్ధతంత్రరీత్యా చక్కగానేఉంది. కాని మనకు లొంగిపొమ్మని ముందు విజయాదిత్యునికొక ఆదేశం పంపితే మంచిదనుకుంటాను.' అన్నాడు నారనదేవుడు.

'మనం ఆదేశంపంపితే అతడు జాగ్రత్త పడుతాడు, అప్పుడు మనం అతణ్ణి జయించడం కష్టమవుతుంది,' అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు కులోత్తుంగుడు. అతని రాజకీయ చతురతను మెచ్చు కొన్నాడు నారనదేవుడు.

'ఒకవేళ నారనదేవుని సలహా లభించవచ్చునేమో ఆలోచిం చండి.' త్రిపురాంతకు డన్నాడు

'ఏ విధంగా?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు త్రిపురాంతకుణ్ణి చూస్తూ.

'మహారాజుగారు చక్రకూటరాజ్యాన్ని పట్టుకొన్నప్పుడు చాల బలహీనంగా ఉన్నారు. అందువల్ల విజయాదిత్యుడు రాజుగారిని ఖాతరు చేయలేదు కాని యీనాడు రాజుగారు చక్రకూట రాజ్యానికే గాక, పూర్వరాజ్యానికి, విస్తారమైన చోళరాజ్యానికి సార్వభౌములుగా ఉన్నారు. ఆనాటి యుద్ధంలో మహాశక్తివంతమైన చోళసైన్యాన్నే గాక, విక్రమాదిత్యుని సైన్యాన్ని గూడ ఓడించి ఉన్నారు. ఇప్పు డానాటికంటె బలంగా ఉన్నారు. కనుక ఈనాడు మిమ్మల్ని ఉపే క్షింప గలిగిన సత్తా అతనికి లేదు. కనుక అతడు లొంగిపోవచ్చు. అలా లొంగిపోతే ఒక రక్తపుబొట్టుగూడ చిందించకుండా వేంగి రాజ్యం తమ చేతుల్లోకి వస్తుంది.' అన్నాడు త్రిపురాంతకుడు.

'ఒకవేళ అతడులొంగకపోతే?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'లొంగకపోయినంత మాత్రాన వచ్చేనష్టం మనకేమీ ఉండ బోదు. మన మతని కిచ్చే వ్యవధి ఏ పది పదునైదు దినాలో ఉం టుంది. ఆ లోగా అతడు సైన్యాన్ని హెచ్చుచేసుకోవడమంటూ ఏముంటుంది ?'

కులోత్తుంగునికి త్రిపురాంతకుని మాటలు నచ్చాయి. ప్రధాని చెబుతున్నది నిజమే. కాంచీపుర సమరానంతరం కులోత్తుం గుని సైన్యం విస్తారంగా పెంచబడింది. అంతేగాక చక్రకూటంలో గూడ రామనాయకుని క్రిందవున్న సైన్యంగూడ హెచ్చింపబడింది. కనుక విజయాదిత్యునికి కొంత వ్యవధి ఇచ్చినా ఫరవాలేదు అను కున్నాడు కులోత్తుంగుడు.

'సరే. అలాగే చేదాము. కాని మా పినతండ్రి వినకపోతే ఏమి చేయాలో మనమిప్పుడే ఆలోచించుకుంటే మంచిది.' అన్నా డతడు.

'అదే మంచిది. మనంగూడ ఇప్పటినుండి తగిన సన్నా హాలు చేసుకోవాలి.' అన్నాడు నారనదేవుడు.

ఆ తరువాత వారు, వేంగిరాజ్యంమీద దాడిచేయవలసివస్తే ఎంత సైన్యాన్ని వినియోగించాలి? ఎవరెవరిని ఏ ఏ స్థానంలో ఉంచాలి? యుద్ధ సమయంలో ఎన్ని ఆయుధాలు కావలసి ఉంటుంది?

ఎంత సంభారం అవసరమవుతుంది అన్న విషయాలనన్నిటినీ తర్కించారు. కాంచీపురంనుండి ఒక దళం, చక్రకూటంనుండి మరొక దళం వెళ్లి వేంగిరాజ్యాన్ని రెండువైపులనుండి ముట్టడించాలని, ఒక దళానికి వారనదేవుడు, మరొక దళానికి రామనాయకుని క్రింద తయారయిన వీరసేనుడు ఆధిపత్యం వహించాలని నిర్ణయించబడింది.

యుద్ధపథకం రూపొందించబడిన తరువాత వేంగిరాజ్యానికి రాయబారంగా యెవరిని పంపాలి అన్న అంశం ఉప్పుకువచ్చింది. రాయబారం నడపడానికి ఎన్నో పేర్లు సూచించబడి తిరస్కరించబడ్డాయి. త్రిలింగమూర్తి పేరు మహారాజుగారికీ, సేనానికీ, ప్రధానికీ ముగ్గురికీ నచ్చింది. త్రిలింగమూర్తి సైన్యాధికారిగా పనిచేసినవాడు. కాంచీపురంమీదికి దండెత్తిరమ్మని కులోత్తుంగుణ్ణి ఆహ్వానించినవాడు. మంచి సాహసవంతుడు, ప్రజ్ఞాధురంధరుడు. పైగా మహారాజుగారి మీద భక్తి తాత్పర్యాలున్నవాడు. అందువల్ల అతణ్ణే వేంగిరాజ్యానికి పంపడానికి వారు నిర్ణయించారు.

ఒక శుభ ముహూర్తాన త్రిలింగమూర్తి వేంగిరాజ్యానికి ప్రయాణమయ్యాడు. అతనికి రక్షణగా కొంత సైనిక పరివారం గూడ పంపబడింది. విజయాదిత్యుణ్ణి వెంటనే లొంగిపోవలసిందని. లేక యుద్ధానికి సంసిద్ధం గమ్మని ఆదేశమిచ్చే రాజపత్రం అతనికివ్వబడింది. ఆ పత్రంలో విజయాదిత్యు డాలోచించుకుని ప్రత్యుత్తర మివ్వడానికి పదునైదు దినాలు వ్యవధి ఇవ్వబడింది.

త్రిలింగమూర్తి వేంగిరాజ్యానికి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఇంకా రాలేదు. వెళ్ళిగూడ చాలదినాలు కావస్తున్నవి. ఈ పాటి కెన్నడో అతడు రావలసింది. ఏమో అత డింకా రాలేదు.

కులోత్తుంగచోళుని ఆదుర్దాకు అంతులేకపోయింది. త్రిలింగమూర్తి ఏమై ఉంటాడు? విజయాదిత్యు డొకవేళ అతణ్ణి చంపించి ఉంటాడా? అలా జరిగి ఉండినా అతనితో వెళ్ళిన చారులలో ఒకడు తిరిగివచ్చి ఉండవలసింది. బహుశా వారుగూడ బయటబడి పట్టుబడ్డారేమో. ఏమీ చెప్పలేని పరిస్థితి.

కాంచీపురంలోనేగాక చక్రకూటంలోగూడ అనుకున్నట్లుగా అన్ని ఏర్పాట్లు జరిగిపోతున్నవి. నారనదేవుడు సైనిక సన్నాహాలను స్వయంగా చూసుకొంటున్నాడు. త్రిపురాంతకుడు యుద్ధానికి కావలసిన ధనాన్ని, సంభారాలను సమకూరుస్తున్నాడు. చక్రకూటంలో సహాయ రామనాయకుడు, వీరసేనుడు ఇద్దరు కలసి నిర్ణీతపథకం ప్రకారం కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఇక ఉన్నదల్లా త్రిలింగమూర్తి రావడమే.

ఒకవేళ విజయాదిత్యుడు లొంగిపోవడానికే అంగీకరిస్తే ఏమి చేయాలి? అప్పుడు దతిణ్ణి ఏమిచేయడానికీ వీలుండదు. అతణ్ణి ఆ పదవిలోనే కొనసాగించవలసి ఉంటుంది. శత్రువుగా మారినవాణ్ణి మరల విశ్వసించడానికి వీలవుతుందా? ఇంతకూ అతడు లొంగి ఆ రాజ్యాన్ని తన కప్పగిస్తాడంటేగదా ఆమాట? ఇప్పుడా ఆలోచన అవసరంలేదు అనుకున్నాడు కులోత్తుంగుడు.

అంతలో త్రిపురాంతకుడు వెలుపల వేచి ఉన్నాడని ద్వారపాలకుడు కులోత్తుంగునితో చెప్పాడు. లోనికి రమ్మనమన్నాడు సార్వభౌముడు. త్రిపురాంతకుడు లోనికి వచ్చాడు. మహారాజుకు నమస్కరించాడు.

'ఏమిటి విశేషాలు? త్రిలింగమూర్తి విషయమేమన్నా తెలిసిందా? వేంగిరాజేమన్నాడట?' ఆదుర్దా పట్టలేక ప్రశ్నమీదప్రశ్న వేశాడు కులోత్తుంగుడు.

ప్రధాని చిరునవ్వు నవ్వుతూ 'రాలేదండీ. ఇప్పటికే వచ్చి ఉండవలసిందిమరి' అన్నాడు.

'అక్కడేమైనా ప్రమాదం జరిగిందేమో?' తనసందేహాన్ని వెలిబుచ్చాడు కులోత్తుంగుడు.

'జరిగితేగూడ జరిగి ఉండవచ్చు. కాని—' అన్నాడు ప్రధాని.

కులోత్తుంగు డతనివైపు చూశాడు.

'బహుశా అలా జరిగి ఉండదనే నేననుకొంటాను. విజయాదిత్యుని కంత ధైర్యం ఉండదనే నా విశ్వాసం.'

'మీ మాటే నిజమయితే మంచిదే. లేకుంటే—'

'ప్రతీకారం ఉండనే ఉంది గదా?'

'సరే, అన్నీ సిద్ధమయినట్లే గదా?'

'సిద్ధమయినట్లే. మీతో అత్యవసరమైన విషయ మొకదాన్ని ప్రస్తావించడానికి వచ్చాను.'

'ఏమిటది?'

'యుద్ధమే ఘటిస్తే మనం మరికొన్ని జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది.'

'ఏమిటవి?' ఆసక్తితో ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'అధిరాజేంద్రుని సేనానిని మనం బంధించి ఉంచడం మీకు తెలిసే ఉన్నది. అతనిమీద భక్తి ప్రపత్తులున్న సైనికులు చాల మంది మనసేనలో మిగిలి ఉన్నారు. వారు వైష్ణవులు. సమయం వచ్చినప్పుడు వారు మనల్ని మోసంచేస్తారేమోనని నా సందేహం.' అన్నాడు త్రిపురాంతకుడు.

'సైనికాధికారుల్లో గూడ అతనికి సంబంధించిన వారున్నారా?' ప్రశ్నించాడు సార్వభౌముడు.

'కొందరున్నారు.' అన్నాడు త్రిపురాంతకుడు.

కులోత్తుంగు డాలోచనలో పడ్డాడు.

త్రిపురాంతకుడు మహారాజును చూస్తూ నిలుచున్నాడు.

కులోత్తుంగుడు పచారుగావిస్తూ, ఈ విషయాన్ని నారన దేవునితో ఆలోచించాలి.

ఇప్పుడు వారి నుద్యోగాలనుండి తొలగించడానికి వీలులేదు. కనుక మీ రిద్దరూ ఆలోచించి వారి నేమిచేయాలో నిర్ణయించండి.' అన్నాడు కులోత్తుంగుడు.

'వారి నందరినీ నగరంలోనే ఉంచి తక్కినవారిని పంపిస్తే?' ప్రశ్నార్థకంగా చూచాడు త్రిపురాంతకుడు.

'అది మంచిదే. కాని అందులోను ప్రమాదం లేకపోలేదు. మన మీద విశ్వాసమున్న సైన్యాన్ని అంతటినీ యుద్ధానికి తీసుకొని

వెళ్ళి అవిశ్వాసమున్న వారిని మాత్రమే ఇచ్చట ఉంచితే వారు సందేహపడుతారు. కోపం పెట్టుకొంటారు. సమయంచూచి తిరుగుబాటు చేస్తారు. అప్పుడు మనం వారి నెదుర్కొనే అవకాశముండదు. అది చాల ప్రమాదకరం.' అన్నాడు కులోత్తుంగుడు.

మహారాజుగారు చెబుతున్న మాటల్లో యథార్థం లేకపోలేదు. వైష్ణవులనే వేరుచేసి ఉంచితే వారు తిరుగుబాటు గావించినప్పుడు వారి నడుమలో పెట్టడానికి కావలసిన సైన్యమిచ్చట ఉండదు. అందువల్ల ఆ సమస్య తాననుకొన్నంత సులభమైనది గాదు. దానిని గూర్చి జాగ్రత్తగా ఆలోచించవలసి ఉంటుంది. అనుకున్నాడు త్రిపురాంతకుడు.

'దానిని గూర్చి యోచించడాని కింకా వ్యవధి ఉంది. ముందు మీరు తక్కిన కార్యాలు పూర్తిచేయండి' అన్నాడు సార్వభౌముడు.

త్రిపురాంతకుడు సెలవు తీసుకొని వెళ్ళనున్న సమయంలో సేవకుడు వచ్చి నమస్కరించి త్రిలింగమూర్తి వచ్చి ఉన్నాడని అన్నాడు.

కులోత్తుంగుడు, త్రిపురాంతకుడు ఒక్కమారుగా 'రమ్మను' అన్నారు. వారి ఆదుర్దా వేయిరెట్లు హెచ్చింది. ఏమి వార్త వచ్చిందో నని వారు ఆవేశపడజొచ్చారు.

త్రిలింగమూర్తి వచ్చి ముందు సార్వభౌమునికి, పిమ్మట ప్రధానికి నమస్కరించి నిలిచాడు.

'ఏమయింది?' మన ఆదేశాన్ని మన్నించాడా? ఆదుర్దాతో ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'ఒక షరతుమీద అంగీకరించాడు ప్రభూ.'

'షరతేమిటి షరతు. నిర్నిబంధంగా లొంగిపొమ్మని మీ రన లేదా?' కోపంతో అడిగాడు సార్వభౌముడు.

'అన్నాను. కాని అతడు తన పట్టు వదలలేదు.'

'వేంగిరాజ్యాన్ని మన కప్పగించడానికి త నంగీకరించాడా లేదా?' త్రిపురాంతుకుడు ప్రశ్నించాడు.

'అంగీకరించాడు. కాని—'

'కాని—' గట్టిగా అన్నాడు కులోత్తుంగుడు. అసహ్యాన్ని సహించలేనట్లుగా ఉంది ఆ మాట

'తనకు రక్షణ ఇవ్వాలని, తన్ను రాజప్రతినిధి పదవిలోనే ఉంచాలని అతడు కోరాడు.' త్రిలింగమూర్తి అన్నాడు.

'అలా ఉంచకపోతే—' కులోత్తుంగుడికి కోపం వచ్చింది.

ఆనాడు తాను ఎంతో విశ్వాసంతో తన పినతండ్రిమీద రాజ్యభారాన్ని పెట్టి వచ్చాడు కులోత్తుంగుడు. కాని తనను రాజ్యాన్ని వదలి రానిచ్చి మోసంగావించి ఆ రాజ్యాన్ని ఆక్రమించా డతడు. అలాంటివాణ్ణి ప్రతినిధి పదవిలో ఎలా ఉంచడం?

'ఉంచకపోతే అలా చేస్తాను. ఇలా చేస్తాను అని అతడు అనలేదు.' అన్నాడు త్రిలింగమూర్తి.

త్రిలింగమూర్తి వచ్చాడని, రాజుగారి ప్రాసాదానికి వెళ్ళాడని సేనానియైన నారనదేవునికి తెలిసింది. ఏం వర్తమానం వచ్చిందో తెలుసుకొందామని అతడుగూడ రాజభవనానికి వచ్చాడు.

'నారనదేవుడు మీ కోసం వేచి వున్నాడు ప్రభూ.' అన్నాడు సేవకుడు.

'రమ్మనిచెప్పు' అన్నాడు కులోత్తుంగుడు.

నారనదేవుడు లోనికివచ్చి నమస్కరించాడు. కులోత్తుంగు డందరినీ కూర్చోమని తానుగూడ కూర్చున్నాడు.

సార్వభౌముని ముఖం గంభీరంగా ఉంది. ఆలోచనా మగ్నమయిగూడ ఉంది.

'ఏమి, వీలుగాదన్నాడా ప్రభూ?' అడిగాడు నారనదేవుడు.

'వీలు గాదనలేదుగాని కొన్ని షరతులు పెట్టాడు.' ముఖం మాడ్చుకుంటూ అన్నాడు మహారాజు.

'ఏమి షరతులు?' ఆదుర్దాతో ప్రశ్నించాడు సేనాని.

'అతనికి మనం రక్షణ ఇవ్వాలట. అతణ్ణి రాజప్రతినిధిగా వేంగిరాజ్యాన్ని యేలనివ్వాలట.' కటువుగా అన్నాడు కులోత్తుంగుడు.

నారనదేవు డాలోచనలో పడ్డాడు.

శత్రువుగా మారిన వాణ్ణి రాజప్రతినిధిగా కొనసాగిస్తే సమయం చిక్కినప్పుడు దెబ్బతీయడన్న దేముంది? సేనాని కా ప్రశ్న ఎదురయింది.

కులోత్తుంగుని కేమీ తోచలేదు.

'మీ రేమనుకుంటున్నారు ప్రభూ?' ప్రశ్నించాడు నారన దేవుడు.

'నాకు కూడ ఏమీ తోచడంలేదు.' అన్నాడు కులోత్తుంగుడు.

త్రిపురాంతకుణ్ణి చూశాడు సేనాని ప్రశ్నార్థకంగా. అతడు కూడ ఆలోచిస్తూనే ఉన్నాడు.

ఒకవేళ అతని షరతుకు మన మంగీకరిస్తే నష్టమేమున్నది?' అన్నాడు నారనదేవుడు.

'సమయంచూచి దెబ్బతీస్తాడేమోనని నా భయం' అన్నాడు మహారాజు.

'ఆ అవకాశంగూడ ఉన్నది. కాని గతంలోలాగా అతనికన్ని అధికారాలు ఇవ్వకుండా నామకార్థంగా రాజప్రతినిధిగా కొనసాగనిస్తే మనకేమీ నష్టముండ దనుకుంటాను.' సార్వభౌముణ్ణి చూస్తూ అన్నాడు సేనాని.

'అది మంచిదే,' అన్నాడు త్రిపురాంతకుడు.

'ఆనా డతడు పరిపాలనా వ్యవహారాలలోనేగాక సైన్యంమీద గూడ పూర్తి అధిక్యాన్ని కలిగి ఉండేవాడు. అందువల్ల అప్పు డతడు తన్ను రాజుగా ప్రకటించుకోగలిగాడు. ఇప్పు డతనికిసైన్యం మీద పెత్తనం తీసివేసి, పరిపాలనా విషయాలలోగూడ అతనికొక సలహా సంఘాన్ని పెట్టి ఆ సలహా సంఘానికి, అతనికి ఏ సమస్య విషయంలోనైనా భేదం ఏర్పడితే అంతిమనిర్ణయం సార్వభౌమునికి

వదలవలసి ఉంటుందన్న షరతుమీద అతణ్ణి రాజప్రతినిధిగా ఉంచ వచ్చు.' అన్నాడు నారనదేవుడు.

త్రిపురాంతకునికి ఆ సలహా చక్కగా నచ్చింది. 'అప్పు డత డేమీ చేయలేడు. పైగా దీని నతడు కాదనగల పరిస్థితిలో లేడు. అలా ఉంటే అప్పుడే అతడు మన ఆదేశాన్ని నిరాకరించి ఉండే వాడు. అతడు తన సత్తాను గుర్తించే ఈ షరతుపెట్టి సంధి కోర బతిమాలుతున్నాడు.' అన్నాడు త్రిపురాంతకుడు.

'మన మనుకున్నట్లు అత డంగీకరిస్తే సంధి చేసుకోవడం మంచిది. అప్పుడు యుద్ధం తప్పిపోతుంది. సైనికనష్టం నివారించ బడుతుంది. రాజ్యాన్ని బలపరచుకోవడానికి వీలుంటుంది.' అన్నాడు నారనదేవుడు.

'అలాగేచేదాం.' అన్నాడు కులోత్తుంగుడు. 'ఏమి త్రిలింగ మూర్తీ. మీకిది నచ్చిందా ?'

'చాల నచ్చిందండీ. మన మిప్పు డే షరతులు విధించి నప్ప టికీ అతడు సమ్మతించే స్థితిలో ఉన్నాడు. అతనికి ప్రాణాలమీద చాల తీపి ఉంది.' నవ్వుతూ అన్నాడు.

'అయితే సరే-అలాగే చేదాం. కాని అత డందు కంగీకరిస్తే అప్పుడు సైన్యాధికారిగా ఎవరిని ఉంచాలి ?' ప్రశ్నించాడు కులో త్తుంగుడు.

'ఎవరినో ఎందుకు ? వీరసేనుణ్ణే పంపుదాము.' అన్నాడు నారనదేవుడు.

'సరియైనవాణ్ణే చెప్పాడు. మీ సలహా ననుసరించే చేదాం. త్రిలింగమూర్తి మరొకసారి వేంగిరాజ్యానికి వెళ్ళవలసి ఉంటుంది.' అంటూ నవ్వాడు కులోత్తుంగుడు.

'ప్రభువుగారి ఆజ్ఞ.' అన్నాడు త్రిలింగమూర్తి.

# 9

## తిరుమల

*రామానుజుడు దిగ్విజయ యాత్రనుంచి మరలవస్తూ విక్రమసింహపురంలో ఆగాడు. కూరేశుడు మొదలైన అతని శిష్యులుగూడ అతని వెంట వచ్చారు. రామానుజుని దర్శించడానికి సింహపురిలోని ప్రజలు వేనవేలుగా వచ్చారు. అతడు వారినందరినీ చిరునవ్వుతో ఆహ్వానించి ఆశీర్వదించాడు. కాని ఆ ప్రజలకు సంతృప్తి కలగలేదు. అప్పుడతడు వారి నుద్దేశించి—*

'మీరందరూ సంసారమనే సాగరంలోబడి ఉన్నారు. దానిని తరించడానికి మీరు ప్రయత్నించాలి. మీరు త్యాగగుణాన్ని అలవరచుకోవాలి. బాధలు పడుతున్నవారికి చేయూత నివ్వాలి. దైవభక్తిని పెంపొందించుకోవాలి. విష్ణుమూర్తిని పూజించాలి. మోక్షాన్ని సాధించాలి' అన్నాడు.

రామానుజుని పలుకులు అమృతంలాగా వారికి తోచినవి. వారతని బోధల్ని వినడాని కలాగే నిలుచున్నారు.

రామానుజుడు దిగ్విజయయాత్ర గావించాడని, ఉద్దండులైన ఎందరో అద్వైత తత్త్వవేత్తల్ని, బౌద్ధుల్ని, జైనపండితుల్ని ఓడించాడని ఎన్నో మహిమలు చూపెట్టాడని ప్రజలు విన్నారు. అందువల్ల ఆ మహామహుణ్ణి దర్శించి అతని బోధల్ని విని తరిద్దామని వారందరూ అతనివద్దకు వచ్చారు.

నిష్ఠలో ఉన్నప్పు డొకనాడు రామానుజుని కొక ఆలోచన తోచింది. తన వినూత్న సిద్ధాంతాన్ని దేశంలో ప్రచారంచేస్తే బాగుండు ననిపించింది. ఆ విషయాన్నిగూర్చి అతడు తన శిష్యులతో గూడ సంప్రదించాడు. వారుగూడ అందు కుత్సహించారు.

యజ్ఞమూర్తి నోడించినతరువాత ఆయన గద్యత్రయం, శ్రీభాష్యం, వేదాంతదీపం, వేదాంతసారం, వేదార్థసంగ్రహం,

భగవద్గీతాభాష్యం మొదలైన తత్త్వగ్రంథాలను రచించాడు. తద్వారా తన అభిప్రాయాల కొక సమగ్రమైన రూపకల్పన గావించాడు.

యామునాచార్యుడు అద్వైత మతాన్ని ఎదిరించాడు. దానిలోని దోషాల నెత్తి చూపగలిగాడు. కాని దానికి ప్రత్యామ్నాయమైన తర్కాన్ని ప్రతిపాదించలేక పోయాడు. కాని రామానుజుడు అద్వైతాన్ని ఖండించడమేగాక, దానికి ప్రతిగా విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించాడు, అందువల్లనే తాను రూపొందించిన తత్త్వాన్ని దేశంలో ప్రచారం గావించాలనుకొన్నాడు.

రామానుజుడు కుంభకోణం వెళ్లాడు. అచ్చట మొట్టమొదటి సారిగా తన వాదాన్ని వినిపించాడు. తనతో వాదించిన శైవుల్ని ఓడించాడు. అచ్చటినుండి కాంచీపురానికి వెళ్లదలచుకొన్నాడు. కాని అంతలోనే కాంచీపురంమీద రాజేంద్రుడు దండెత్తివచ్చాడు. ఆ నగరాన్ని పట్టుకొన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో కాంచీపుర రాజు మరణించాడు. కాంచీపుర సేనాని పట్టుబడ్డాడు. ఆ నగర మంతా ఆ సమయంలో అల్లకల్లోలంగా ఉంది. అందువల్ల రామానుజుడు కాంచీపురానికి వెళ్ళడం మాని కేరళకు వెళ్లాడు. అచ్చట అతడు అనంతశయనంలో తనపేరిట ఒక మఠాన్ని స్థాపించాడు.

కేరళలో ఉన్నప్పుడు రామానుజుడు ప్రకృతిరామణీయకతను గాంచగలిగాడు. ఎత్తైన ఆ కొండలను, ఆ కొండలలో ఉన్న ఉన్నతమైన వృక్షజాలాన్ని, ఆ ప్రాంతంలోవున్న కొబ్బరితోటల్ని చూచి ముగ్ధుడయ్యాడు. కేరళలోవున్న ప్రకృతి సౌందర్యంలో దైవస్వరూపాన్ని చూడగలిగాడు. అచ్చట అతని హృదయం ఆనందంతో గంతులు వేసింది.

కేరళనుండి అత డుత్తరానికి వెళ్లాడు. ద్వారకా నగరాన్ని, మధురాపురాన్ని దర్శించాడు. ఆ తరువాత సాలగ్రామాన్ని, సాకేత నగరాన్ని, బదరికాశ్రమాన్ని, నైమిశాన్ని, పుష్కరక్షేత్రాన్ని, అయోధ్యను, బృందావనాన్ని వీటి నన్నిటినీ పరికించాడు. అచ్చట అతణ్ణి ఢీకొనగల అద్వైతతత్వవేత్తలుగాని మ రే మతకర్తలుగాని లేకపోయారు. ఉన్నా వారట్టే అతనికెదురుగా నిలవలేకపోయారు.

రామానుజుడు కాశ్మీరానికి వెళ్లాడు అచ్చటనున్న ప్రకృతి సౌందర్యాన్ని గాంచి పులకించిపోయాడు. ఆ దేశంలో ఉన్న శారదా పీఠాన్ని దర్శించాడు. అప్పుడు అతనికి తీవ్రమైన వ్యతిరేకత కనబడింది. శాక్తేయులు అతనితో ఢీకొన్నారు. వాదంలో అతణ్ణోడించలేక అతని కెన్నో ఇబ్బందులు కలిగించడానికి ప్రయత్నించారు. కాని రామానుజుడు వారికి లొంగలేదు. పైగా ఆ శాక్తేయులు ఆదిశంకరుణ్ణి గూడ అలాగే ఇబ్బందుల పాలు గావించాలని ప్రయత్నించారు.

అక్కడనుండి రామానుజుడు కాశీకి వచ్చాడు. అక్కడున్న అద్వైతులను ఓడించాడు. కాని ఆ దేవాలయంలో పాంచరాత్రాగమ పూజా విధానాన్ని ప్రవేశపెట్టలేక పోయాడు. రామానుజు డచ్చట నున్నసమయంలో వా రా పూజావిధానాన్ని అంగీకరించినట్లు కనబడ్డారు గాని అతడచ్చటనుండి వెళ్ళివేసిన తరువాత ఆ విధానాన్ని అనుసరించలేదు.

విశిష్టాద్వైత మతాచార్యుడు కాశినుండి శ్రీకూర్మానికివచ్చాడు. అచ్చట ఆలయం శైవుల చేతుల్లోవుంది. శైవమంటె వారికెంతో పిచ్చి. వారు రామానుజునితో వాదించడానికి ముందుకువచ్చారు. తాము గనుక ఓడిపోతే తమ మతాన్ని వదలి వైష్ణవులు కావడమేగాక ఆ ఆలయాన్నిగూడ వైష్ణవాలయంగా మార్చివేస్తామన్నారు వారు.

రామానుజు డందుకు సమ్మతించాడు.

శైవులకు, రామానుజునికి మూడురోజులపాటు వాదోపవాదాలు జరిగాయి. తుదకు శైవులు ఓడిపోయారు. విశిష్టాద్వైతమతాన్ని పుచ్చుకొన్నారు. శ్రీకూర్మంలో ఉన్న దేవుణ్ణి విష్ణుమూర్తిగా మార్చివేశారు. అట్లు మార్చినప్పు డా విగ్రహాన్ని ముందున్న స్థలంలోగాక వాదిస్తున్నప్పుడు రామానుజుడు కూర్చుని ఉండిన దిక్కునుచూస్తున్నట్లుగా కొద్దిగా తిప్పి ఉంచారు. అలా ఉంచడంవల్ల ఆ విగ్రహం అప్పుడున్న ధ్వజస్తంభానికి నేరుగా లేకపోయింది. కనుక విగ్రహానికి నేరుగా మరొక ధ్వజస్తంభాన్ని నిర్మించమని సలహా ఇచ్చాడు రామానుజుడు. వా రతని సలహాను పాటించి విగ్రహాని

కెదురుగా మరొక స్తంభాన్ని ఎత్తించారు. అందువల్ల ఆ దేవా లయంలో రెండు ధ్వజస్తంభా లుండడం తటస్థించింది.

శ్రీకూర్మంనుండి రామానుజుడు సింహాచలానికి వచ్చాడు. సింహాచలం ఒక రమ్యమైన పర్వతం. ఆ పర్వతంమీద బాగుగా ఎదిగిన ముంతమామిడిచెట్లు, అరటిచెట్లు, అనాసచెట్లు ఏపుగాపెరిగి ఉన్నాయి అవి కళ్లకెంతో యింపును గూరుస్తున్నాయి. ఆ కొండ నెక్కినప్పుడు రామానుజుని కెంతో ఆనందం కలిగింది.

రామానుజు డచ్చటికి వెళ్ళినప్పు డచ్చట కృష్ణమాచార్యుడనే సంగీత విద్వాంసుడు గానం చేస్తున్నాడు. ఆ గానాన్ని విని ముగ్ధు డయ్యాడు. నిజంగా తాను దైవసన్నిధిలో ఉన్నట్లు భావించాడు.

కృష్ణమాచార్యుడు సంగీతంలో ఎంత గొప్పవాడో అంత గర్వి. తనకంటె విద్వాంసు లెవ్వరూ లేరని అతని అహంకారం. అతని అహంభావాని కంతులేదు. అతడెవరినీ లెక్కచెట్టేవాడు గాడు. అంతేగాక తాను పిలిస్తే దేవుడు పలుకుతాడని అతడు డాబులు చెబుతుండేవాడు.

రామానుజు డతని సంగీతాన్ని మెచ్చుకున్నాడు గాని అతని గర్వాన్ని క్షమించలేకపోయాడు. అంత విద్వాంసుడు ఆ అహంకారమే లేకుంటే ఎంతో రాణించేవా డనుకొన్నాడు. అతణ్ణి ఎలాగైనా మార్చి నిజమైన భక్తుడుగా చేయాలనుకొన్నాడు.

కృష్ణమాచార్యుడు రామానుజుణ్ణి మొదట ఖాతరుచేయలేదు. సంగీతంముందు జ్ఞానం. భక్తి ఇవేమీ లెక్కకు రావన్నాడు. కాని రానురాను అతడు ఆ యెంబెరుమానారుకు వశుడైపోయాడు. కృష్ణ మాచార్యు డలాగా రామానుజునికి వశం గావడం సింహాచల వాసుల కందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

రామానుజు డతనికి, 'కుమారా! విద్య వినమ్రత నివ్వాలిగాని అహంభావానికి కారణం కాకూడదు. అహంభావానికి కారణమైన విద్య అవిద్య. అవిద్య ఉన్నవాడు దేవుణ్ణి పొందగాంచలేడు. ఇంత వరకు నీవు నీ జీవితాన్ని వృథాగావించావు. ఇకమీదటనైనా వేద నను, ధ్యానాన్ని, ఉపాసనను, భక్తిని అలవరచుకో. ఇప్పుడు

భగవంతుని కెంతో మాదంగా ఉన్న నీవు త్వరలో అతని సన్నిధి చేరుకుంటావు. తరువాత విముక్తి బొందుతావు.' అని ఉపదేశించాడు.

కృష్ణమాచార్యుడు రామానుజుని బోధనామృతాన్ని అందు కొని అతని శిష్యుడయ్యాడు.

రామానుజుడు సింహాచలక్షేత్రంలో పాంచరాత్రాగమ పూజా విధానాన్ని ప్రవేశపెట్టి విక్రమసింహపురానికి వచ్చారు.

రామానుజుని ఆశీస్సులందుకొని ప్రజలందరూ వెళ్లిపోయారు. కూరేశుడు దాశరథిమాత్రం అతనితోగూడ అతనికోసం నిర్మించిన ఆశ్రమంలో ఉన్నారు. అప్పుడొక పెద్ద అచ్చటికివచ్చి రామానుజుని కొక పత్రాన్ని యిచ్చాడు. రామానుజుడు కూరేశుణ్ణి ఆ పత్రం చదవ మన్నాడు.

తిరుపతిలో ఉన్న శ్రీశైలపూర్ణునివద్ద నుండి అది వచ్చింది. అది ఆ వైష్ణవాచార్యుడు రామానుజునికి పంపిన ఆహ్వానం.

తిరుమల చాల గొప్ప పుణ్యక్షేత్రం. అది చాల ప్రాచీనమైన దివ్యక్షేత్రం. ఆ క్షేత్రంలో ఒక గొప్ప ఆలయముంది. ఆ ఆల యంలో ఉన్న దేవుణ్ణి ఆ రోజుల్లో శైవులారాధిస్తున్నారు.

రామానుజుడు దిగ్విజయయాత్ర సాగిస్తూ శైవుల్ని ఓడిస్తూ శైవాలయాలను విష్ణ్వాలయాలుగా మారుస్తూ వస్తున్న విషయం దేశ మంతా ప్రచారమయింది. అది తిరుమలలో ఉన్న వైష్ణవులకుగూడ ఉత్సాహాన్ని కలిగించింది. వారందరూ ఒకనాడు సమావేశమై తిరు మల క్షేత్రాన్నిగూడ వైష్ణవక్షేత్రంగా మార్పించాలని అనుకొన్నారు.

ఒకప్పుడు తిరుమల వైష్ణవక్షేత్రమని అందరూ అంటారు. నారాయణవన ప్రాంతంలో ఆకాశరాజు కోటవుంది. ఆ కోటను ఆకాశరాజు పాలించే వాడట. అతని కుమార్తెయైన పద్మావతీదేవే శ్రీ వేంకటరమణుణ్ణి వివాహమాడిందని అందరూ అంటారు.

ఆకాశరాజుకు ఒక సోదరుడుండేవాడట. అతనిపేరు తొండమాను డంటారు. అతడే మొట్టమొదట తిరుమల మీదనున్న వెంకటరమణుని ఆలయాన్ని నిర్మించాడట.

ఆకాశరాజు మరణించిన తరువాత అతని రాజ్యంకోసం అతని కుమారునికి, అతని తమ్ముడైన తొండమానునికి యుద్ధం సంభవించిందట. ఆ యుద్ధానికి తొండమాను తాళలేక వెంకటేశ్వరుని ప్రార్థించాడట. అతని ప్రార్థనను మన్నించి ఆ దేవుడు తన శంఖ చక్రాలను అతనికి సాయంగా పంపాడట. అప్పటినుండి తిరుమలక్షేత్రంలో ఉన్న ఆ విగ్రహం చేతుల్లో శంఖ చక్రాలు కనబడడం లేదట.

తిరుమల దేవాలయానికి మొట్టమొదటి పూజారి గోపీనాథుడట. అతడు వైష్ణవుడట. ఆ తరువాత ఉన్న పూజార్యులుగూడ వైష్ణవులేనట. ఒకప్పుడొక పూజారి దేవునిమీద ఉన్న నగల్ని దొంగిలించాడట. ఆ సమయంలో తిరుమల నారాయణవనం రాజుల ఆధీనంలో ఉండేదట. అప్పుడు రాజు కా విషయం తెలిసి ఆ పూజారిని దండించి మరొక పూజారిని నియమించాడట. తరువాత ఏమి జరిగిందో ఏమో ఎవరికీ తెలియదు. కాని కొంతకాలం తరువాత శైవులా ఆలయాన్ని స్వాధీనం గావించుకొని వారే పూజలు గావిస్తున్నారట.

వైష్ణవులందరూ ఒకచోట జేరి చర్చించడంవల్ల ఆ విషయాలన్నీ వారికి తెలియవచ్చినవి. తిరుమలలో ఉన్న ఆలయాన్ని వైష్ణవాలయంగా మార్చాలనే వారి అభిప్రాయం ఆ విషయాలు తెలియడం వల్ల మరింత ధ్రువపడింది.

వైష్ణవులందరూ ఆ విధంగా ఆలోచనలు గావిస్తున్న విషయం తిరుమలలో ఉన్న శైవులకుగూడ తెలిసింది. ఏ విధంగానైనా ఆ ఆలయాన్ని తమ ఆధిపత్యంలోనే ఉంచుకోవాలని వారనుకున్నారు. అందుకోసం వారుగూడ సమావేశమై చర్చలు గావింపసాగారు.

ఈలాగా ఇరువాగులవారు చర్చలు గావించుకొని పోరాటానికి సన్నద్ధం అవుతూండడం వల్ల తిరుమలలో తీవ్రత హెచ్చింది. వైష్ణవులమధ్య శైవులమధ్య అప్పుడప్పుడు తీవ్ర వివాదాలు, చెదురు మదురు కొట్లాటలుగూడ జరుగ జొచ్చినవి. పరిస్థితి ఆలాగే కొనసాగితే అది చాల విషమించేటట్లు తోచింది.

తిరుమలక్షేత్రాన్ని వైష్ణవ క్షేత్రంగా మార్చాలనే కుతూహలం ఎంత ఉన్నప్పటికీ అక్కడి వైష్ణవులకు తగినంత బలంలేదు. పోరాటమే వస్తే శైవులు వారిని తుడిచిపెట్టి వేయగలరు. అందువల్ల వారు ఘర్షణకు వెనుదీశారు. ఏ విధంగానైనా ఉపాయంతో తమ ఆశయాన్ని సాధించాలనుకొన్నారు.

నారాయణవనంలో యాదవరాయలు పరిపాలన గావిస్తున్నారు. అతడప్పుడప్పుడు దైవదర్శనార్థం తిరుమలకు వస్తుంటాడు. అతడు చాల గొప్పవాడు. అతణ్ణి పట్టుకొని అతని మధ్యవర్తిత్వంద్వారా ఆ ఆలయం మొదటి వైష్ణవాలయమని ఋజువు చేయగలిగితే తమ కోరిక నెరవేరుతుందని వారనుకొన్నారు. అందువల్ల వారిలో ఉన్న కొందరు పెద్దలు ఆ యాదవరాయలవద్దకు వెళ్ళి తమ అభ్యర్థనను నివేదించారు.

యాదవరాయలు చాల సహృదయుడు. అతనికి శైవమతం మీదగాని, వైష్ణవం మీదగాని పక్షపాతం లేదు. అతనికి దైవభక్తి ఉన్నదేగాని తత్త్వవిమర్శ జోలి కతడెన్నడూ వెళ్ళివుండలేదు. అందువల్ల అనవసరంగా వైష్ణవులు, శైవులు కొట్లాడడమెందుకని తాను మధ్యవర్తిత్వం వహించి వారి వివాదాన్ని పరిష్కరిస్తానన్నాడు.

వైష్ణవుల పెద్దలు వెళ్ళిన తరువాత యాదవరాయలు ఆ విషయాన్నిగూర్చి దీర్ఘంగా ఆలోచించాడు. ఆ విషయంలో శైవుల అభిప్రాయాన్నిగూడ తెలుసుకోవా లనుకొన్నాడు. తిరుమలనుండి శైవుల పెద్దయైన శివజ్ఞాన పెరుమాళ్ళను రప్పించాడు. అతనితో వారికి వచ్చిన వివాదాన్నిగూర్చి తర్కించాడు. అతడుగూడ యాదవ రాయలనే మధ్యవర్తిగా ఉండమన్నాడు. వివాదం పరిష్కరించబడడమే మంచిదన్నాడు. ఆ విషయాన్ని యాదవరాయలు వైష్ణవులకు చెప్పిపంపాడు.

ఇంతలో రామానుజుడు సింహపురికి వచ్చినట్లుగా వైష్ణవులకు తెలిసింది. అది వారికెంతో ఆనందాన్ని కలిగించింది.

శ్రీశైలపూర్ణుడు దిగువ తిరుపతిలో ఉన్నాడు. అతడు వైష్ణవుల పెద్ద. అతని చెల్లెలి కుమారుడే రామానుజుడు. పైగా తిరుపతి పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి తమకు చెప్పినవాడుగూడ అతడే. అతణ్ణి ప్రార్థించి ఏ విధంగానైనా రామానుజుణ్ణి తిరుమలకు రావిస్తే తాము తప్పనిసరిగా జయిస్తామని, తమ ఆశయం నెరవేరుతుందని వైష్ణవు లనుకొన్నారు. వెంటనే వారు శ్రీశైలపూర్ణుని వద్దకు వచ్చి రామానుజుణ్ణి తిరుమల కేవిధంగానైనా రప్పించమని ప్రార్థించారు. ఆ వైష్ణవాచార్యుడు వారి ప్రార్థన నంగీకరించి రామానుజుని కొక లేఖవ్రాసి యిచ్చాడు. దానిని తీసుకుని ఒక వైష్ణవులపెద్ద సింహపురికి వెళ్ళాడు.

సింహపురి తిరుమలకు పదికోసులదూరంకంటె హెచ్చుగా లేదు. అందువల్ల ఆ వైష్ణవులపెద్ద సులభంగానే సింహపురికి వెళ్ళి అచ్చట ఉన్న రామానుజునికి ఆ లేఖ నివ్వగలిగాడు.

కూరేశుడా పత్రాన్ని చదివినప్పుడు రామానుజునికెంతో ఆనందమయింది. మహామేధావి, వైష్ణవోత్తముడైన శ్రీశైలపూర్ణుడు తిరుమలలో ఉన్న వైష్ణవుల తరఫున తన్నాహ్వానిస్తున్నాడు. వైష్ణవుల తరఫున తన్ను వాదించమని కోరుతున్నాడు. నిజంగా అది భగవదిచ్ఛ. తనకుగూడ తిరుమలకు వెళ్ళాలనుంది. సింహపురినుండి తిరుమలకు వెళ్ళి అచ్చట ఆ దేవుని దర్శించుకొని శ్రీరంగం వెళ్ళాలనుకున్నాడు తాను. తన కోరికకు తగ్గట్టుగానే ఆహ్వానం గూడ అందింది. అది భగవంతుని ఆహ్వానమనుకొన్నాడు రామానుజుడు. తిరుమలకు రావడాని కంగీకరించాడు. అచ్చటికి వచ్చిన పెద్ద రామానుజుడు తమ కోరిక నంగీకరించినందు కెంతో తృప్తి జెంది అతనికి నమస్కరించి అతనివద్ద సెలవు తీసుకొని వెళ్ళాడు.

రామానుజు దేకాంతంగా ఉన్నప్పు డతనికి తిరుమల జ్ఞప్తికి వచ్చింది. తాను మొట్టమొదట ఆ క్షేత్రానికి వెళ్ళిన విషయం జ్ఞప్తికి వచ్చింది. తిరుమల అతని ఊహానేత్రాలముందు ప్రత్యక్షమయింది.

అది ఒక గొప్ప పుణ్యక్షేత్రం. ఆ క్షేత్రమెంతో అందంగా ఉన్నది. తాను తొలుత తిరుమల పర్వతాలను తిలకించినప్పుడు పులకించిపోయ్యాడు. అందమైన ఆ పర్వతాల సానువులు, ఆ సానువులలో క్రిందికి దుముకుతున్న జలపాతాలు, ఆ పర్వతాలలో సంచరిస్తున్న మృగాలు, నృత్యం చేస్తున్న నెమళ్ళు, కలకలారావం గావిస్తున్న పక్షులు అతణ్ణి తన్మయుణ్ణి గావించి ఉన్నవి.

తిరుమల పర్వతాలను చూస్తుంటే వాటిమీద శేషుడు పవ్వళించినట్లే ఉంది. ఆ క్షేత్రం ఎంత దివ్యంగా ఉంది? ఆ క్షేత్రం చుట్టుప్రక్కలనున్న ప్రకృతి ఎంత శోభగా ఉంది? అచ్చట ఉన్న పుణ్యతీర్థాలు - ముఖ్యంగా కపిలతీర్థం ఎంత ఆనందదాయకంగా ఉంది?

ఆ దృశ్యాలన్నీ రామానుజుని తలపునకు వచ్చాయి. ఆ రోజుల్లో తాను చిన్నవాడు. అప్పుడప్పుడే తనకు దైవభక్తి కలుగుతున్నది. ఆ రోజుల్లోనే తాను దైవాన్ని అర్థం గావించుకొంటున్నాడు. ఆ దినాలెంత మహత్పూర్ణమైనవి. ఆ దినాలను తను మరచిపోలేదు. మరువడానికి గూడ అతనికి వీలుకాదు. అంత గొప్ప రోజులవి.

ఆ చిన్నతనంలో తాను దిగువ తిరుపతిలో శ్రీశైలపూర్ణుని వద్ద రామాయణాన్ని నేర్చుకొన్నాడు. అతని పాద సన్నిధిలోనే తాను రామాయణంలో ఉన్న తత్వ రహస్యాల నన్నిటినీ తెలుసుకొన్నాడు. అచ్చటే గోవిందమిత్రుణ్ణి కలుసుకొని అతణ్ణి తనకు దానంగా యిమ్మని శ్రీశైలపూర్ణుణ్ణి కోరివున్నాడు. అచ్చటే తన జీవితంలోని ముఖ్య ఘట్టాన్ని గడపివున్నాడు. అతడా జీవితాన్ని ఎలా మరువగలడు?

తిరుపతిని, తిరుమలను తలచుకొన్నంతసేపు అతడెచ్చటో స్వర్గమందిరంలో ఉన్నట్లనిపించిం దతనికి. తిరుమలదేవుణ్ణి తలచుకొన్నప్పు డతని తనువు పులకించి తన్మయత్వ మందింది. ఆ దేవుణ్ణి దర్శించడానికి తాను మొట్టమొదట వెళ్ళినప్పుడు తన పాదాలు తగిలితే ఆ త్రోవ ఎచ్చట అపవిత్రత చెందుతుందో అని భయపడి తాను తన మోకాళ్ళమీద నడచి వెళ్ళివున్నాడు. అప్పు డా లేత

మోకాళ్ళు ఆ మెట్లను కొట్టుకొని రక్తాన్ని చిమ్ముతున్నవి. ఆ రక్తపు చినుకులు ఆ మెట్లను అభిషేకిస్తున్నవి. ఆ అభిషేకం దేవునికి చేయబడిన అభిషేకమని ఆ నాడు తాను భావించి తనకు కలిగిన బాధ నంతటినీ మరచిపోతున్నాడు. అవి మరపురాని తీయని అనుభవాలు.

ఆ తిరుమలకు మరల తాను వెడుతున్నాడు. ఆ శ్రీనివాసుడే, ఆ వేంకటరమణుడే తనన్నీసారి తనవద్ద కాహ్వానించాడు. తప్పనిసరిగా ఆ దేవుని వద్దకు వెళ్ళాలి. తన జీవితాన్ని మరొకమారు పునీతం గావించుకోవాలి. తిరుమలమీద ఉన్న తీర్థాలలో మునిగి తనలో ఉన్న మలినాన్ని అంతటినీ తుడిచివేయాలి అనుకున్నాడు రామానుజుడు.

వైష్ణవుల పక్షాన వాదించడానికి రామానుజుడు వస్తున్నాడన్న వార్త తిరుమలలోనే గాక తిరుపతిలోను, చుట్టుపట్లనున్న పల్లెలలోను ప్రాకిపోయింది. ఆ వార్త ప్రజలకెంతో హర్షాన్ని కలిగించింది. కాని శైవులకు మాత్రం గుండెలలో బండలు దించినట్లయింది.

యాదవరాయలకు గూడ రామానుజుని రాక తెలిసింది. వివాద పరిష్కార మిషతోనైనా ఆ మహానుభావుని దర్శనం లభిస్తున్నందు కా రాజు అమితానందాన్ని పొందాడు.

రామానుజుడు తన శిష్యులతో వస్తుంటే దారి పొడుగునా ప్రజలు నిలబడి ఆయన్ని దర్శింపసాగారు. కొందరు తామున్న స్థలంలోనే సాగిలబడి నమస్కరించారు. రామానుజుడు చిరునవ్వుతో వారి నందరినీ ఆశీర్వదించాడు అతని దర్శనభాగ్యం గలిగినందుకు ప్రజలందరూ ఎంతో సంతృప్తిని చెందారు.

రామానుజుడు తిరుపతికి వస్తూనే వైష్ణవులందరూ అతని కెదురేగి స్వాగతం చెప్పారు. వృద్ధుడైన శ్రీశైలపూర్ణుడు గూడ వారితో వెళ్ళి అతణ్ణి ఆహ్వానించాడు. శ్రీశైలుణ్ణి చూస్తూనే రామానుజు డతనికి సాష్టాంగపడి, ఆశీర్వదించమన్నాడు. అతడెంతో ఆనందంతో రామానుజుణ్ణి లేవనెత్తి ఆశీర్వదించాడు. ఆ తరువాత

వాదించమా తిరుమలకు వెళ్ళారు. అప్పుడు యాదవరాయలు రామానుజునికి నమస్కరించి ఆశీస్సులు గొన్నాడు.

తిరుమల చేరగానే రామానుజుడు దైవదర్శనం చేసి వచ్చాడు. వైష్ణవుల పెద్దలతో సంప్రదింపులు గావించాడు. వారు చెప్పిన వివరాల నన్నిటినీ ఆకళింపు గావించుకున్నాడు. దీర్ఘంగా ఆలోచించి తా నెలా వాదించాలో నిర్ణయించుకున్నాడు.

వైష్ణవుల తరపున రామానుజుడు, శైవుల తరపున శివజ్ఞాన పెరుమాళ్ళు వాదించడానికి నిర్ణయించబడింది. తా నోడిపోతే తిరుమలలో వున్న దేవుడు విష్ణువేనని అంగీకరించడానికి తాను సిద్ధంగా ఉన్నానని శివజ్ఞాన పెరుమాళ్ళు అన్నాడు.

వాదం మొదలయింది. తిరుమల స్థలపురాణ శ్లోక స్తోత్రాలన్నీ వెలికి వేయబడినవి. ఆధారాలన్నీ చూపబడినవి. నాలుగైదు దినాలు తీవ్రమైన చర్చలు జరిగాయి. యాదవరాయలు ఆ సభకు అధ్యక్షత వహించినందువల్ల ఘర్షణ యేమీలేకుండా అంతా సవ్యంగా నడిచింది.

తిరుమలలో వున్న దేవుడు విష్ణుదేవుడేనని రామానుజుడు ఆధారాలు చూపాడు. తొండమానుడు వైష్ణవుడు కాదని శైవులు చెప్పలేకపోయారు. మొదట వున్న పూజారి వైష్ణవుడు గాదని శివజ్ఞాన పెరుమాళ్ళు నుడువలేకపోయాడు. తమిళ గ్రంథాలనుండి రామానుజుడు చూపిన ఆధారాల నతడు కాదనలేకపోయాడు. అచ్చటకు వచ్చి నివసించిన ఆళ్వార్లు వైష్ణవులేనని అతడంగీకరించాడు. అందువల్ల అది మొదట శైవదేవాలయమని చూపడానికి శివజ్ఞాన పెరుమాళ్ళకు వీలుగాకపోయింది. అతడు చూపిన ఆధారాలన్నీ మధ్యలో వచ్చినవే. కనుక అతని వాదం నిలవలేదు

చర్చానంతరం యాదవరాయలు తన తీర్మానాన్ని చెప్పవలసి వున్నది. కాని అతనేమీ చెప్పకుండా శివజ్ఞాన పెరుమాళ్ళనే తన అభిప్రాయాన్ని చెప్పమన్నాడు. అప్పుడతడు రామానుజుని వాదం సరియైనదే నని అంగీకరించాడు. కాని మధ్యలోనైనా శైవు లా ఆలయంమీద ఆధిపత్యం వహించారు గనుక శైవపద్ధతిలో గూడ అచ్చట అర్చన జరగడానికి వైష్ణవు లంగీకరించాలన్నారు. అప్పుడు

శైవులమైన తాము గూడ అచ్చట ఉన్న దేవుణ్ణి విష్ణుదేవుడుగా భావిస్తామన్నారు.

రామానుజుడు గూడ శివజ్ఞాన పెరుమాళ్ళు చెప్పినదావి కంగీకరించి తన హృదయ వైశాల్యాన్ని, గొప్పదనాన్ని ఋజువు గావించుకొన్నాడు. శివజ్ఞాన పెరుమాళ్లను కౌగిలించుకొని నీవు చాల గొప్పవాడివని ప్రస్తుతించాడు.

వైష్ణవులకు, శైవులకు ఘర్షణ లేకుండా సామరస్యం కుదిరినందుకు యాదవరాయలు సంతోషించాడు.

ఆ తరువాత ఒక శుభముహూర్తాన ఆ దేవాలయంలో ఉన్న విగ్రహానికి శంఖచక్రాలు అమర్చబడ్డాయి. నుదుట ఊర్ధ్వపుండ్రాలలంకరించబడ్డాయి. శైవులు, వైష్ణవులు రామానుజుని ఆధ్వర్యాన వేంకటరమణుణ్ణి అభిషేకించి తమ తమ పద్ధతుల్లో అర్చనలు గావించారు. అప్పుడచ్చటికి వచ్చిన అశేష ప్రజానీకం మతాలను మరచి ఆ శేషశయనుణ్ణి దర్శించి తన్మయులయ్యారు.

# 10

## సోమదేవుడు

**త్రిపురాంతకుడు తన మందిరంలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. తాననుకొన్నదంతా నెరవేరింది గనుక చాల సంతోషంగా ఉన్నాడు.**

వీరరాజేంద్రుని కాలంలో తనమాట చెల్లింది. తానేమి చెబితే ఆ రాజు అలా చేసేవాడు. అందువల్ల అధికారమంతా తన చేతుల్లో ఉండేది. అప్పుడు తన నెదరించడాని కెవరికీ దమ్ములుండేవిగావు. ఆ రాజు కాలంలో తాను శైవుల్ని బాగుగా బలపరచాడు. వారికి కావలసిన ప్రోత్సాహ మిచ్చాడు. వారిలో శక్తిసామర్థ్యాలున్న వారి

నెల్లా ప్రధానమైన, కీలకమైన ఉద్యోగాలలో ఉంచాడు. అప్పుడు తన నెవరూ కాదనలేక పోయారు.

వీరరాజేంద్రుని పరిపాలనలో వైష్ణవుల కంత ప్రాధాన్యం ఉండేదిగాదు. మేము వైష్ణవులమని చెప్పేవారుగూడ కనబడేవారు గాదు.

ఆ రోజుల్లో ఆదిశంకరుని అద్వైతం, అతని మిథ్యావాదం మంచి ప్రాబల్యాన్ని వహించి ఉన్నాయి. ఆ దినాలలో చోళరాజా శైవుడు. మంత్రి శైవుడు. రాజ్యంలో ఉన్న ప్రధానాధికారు లందరూ శైవులు. సోమదేవు డొక్కడే వైష్ణవుడు. అయినప్పటికీ అతని కప్పు డంత ప్రాముఖ్యం ఉండేదిగాదు. తన పనిని చూచు కొంటూ ఉండేవాడు గాని, మతవిషయాలలో కలిగించుకొనేవాడు గాదు.

ఆ దినాలలో రాజ్యమంతా శైవమయం గావడంవల్ల ప్రజలలో ఐక్యం చాల చక్కగా ఉండేది. రాజ్యమంతా ఒకవ్యక్తిలాగా ఉండేది. కాని ఆ తరువాత పరిస్థితులు మారాయి. వీరరాజేంద్రుడు రోగ గ్రస్తుడు గావడంవల్ల అధిరాజేంద్రుని హస్తాలలోకి అధికార మొచ్చింది. యువరాజుగా ఉన్నప్పుడే అతడు తన్ను ఖాతరు చేయ లేదు. తన సలహాలను పాటించలేదు. తన యిష్టంవచ్చినట్లు రాజ్యాన్ని పాలించడానికి పూనుకొన్నాడు.

అధిరాజేంద్రునికి మతంమీద ధ్యాసలేదు. అతనికి రాజ్యపరి పాలన తప్ప మరేమీ కాబట్టలేదు. రాజ్యపాలనతో మతాన్ని ముడి బెట్టకపోతే ప్రమాద మున్నదని తా నెంతచెప్పినా వినలేదు. దక్షిణా పథాన శైవం తప్ప మరొక మతం లేని రోజు లొకప్పు డుండేవి. యామునాచార్యుడు పైకి రావడంతో ఆ మతాని కొక నవా లేర్పడింది. అతని శిష్యులలో చాలమంది మేధావులు. వారి ధాటికి శైవమతాభి కారులు నిలవలేక పోయారు. దానికితోడు రామానుజుడు తలెత్తిన తరువాత అతనితో యెవ్వరూ వాదించలేకపోయారు.

మొట్టమొదటనే వైష్ణవాన్ని హద్దులో పెట్టివుంటే ఇంత ప్రమాద మొచ్చేదిగాదు. కాని అధిరాజేంద్రుడు వినలేదు. సోమ

దేవుని సలహాల ననుసరించి తన అధికారాన్ని సాగనివ్వకుండా చేశాడు. అతడు వైష్ణవుల్ని ప్రోత్సహిస్తుంటే చూస్తూ ఊరుకున్నాడు. అందువల్ల రాజ్యాలలో ఎక్కడ చూచినా వైష్ణవం తలెత్తసాగింది. శైవం బలహీనపడసాగింది.

ఆ సర్వేశ్వరుని దయవల్ల మళ్లా శైవాన్ని ఆదుకునే అవకాశం తనకు గలిగింది. అందువల్ల ఆ త్రిపురాసుర మర్దనుని తాను వేయిమొక్కులు మొక్కవలసి ఉంది.

చక్రకూటంలో ఉన్న రాజేంద్రుణ్ణి ఆహ్వానించి అధిరాజేంద్రుణ్ణి హతమార్చి కాంచీపురాన్ని అతని స్వాధీనం చేయకుండా ఉంటే అతణ్ణి చోళరాజ్యాని కధిపతిని గావించకుండా ఉంటే సోమదేవుణ్ణి బందీకృతు డ్గావించకుండా ఉంటే ఏమై ఉండేది? చోళరాజ్యమే పతనమై ఉండేది.

ఆ రాజ్యం అభివృద్ధి పొందడానికి శైవమతం కారణం. ఆ మతమే లేకపోయినప్పు డారాజ్యం మాత్రం ఎలా నిలవగలుగుతుంది?

రాజేంద్రరాజు చాల గట్టివాడు. శైవమతాన్ని ఆరాధించేవాడు. తన రాజ్యమంతా శైవమయం కావాలనేవాడు. అందువల్లనే తా నతణ్ణి చోళరాజ్యానికి రాజు చేయాలనుకున్నాడు. అందుకనే అతని పేరును కులోత్తుంగ చోళుడని మార్పించాడు. అతడు పశ్చిమ చాళుక్యుడే గావచ్చు. కాని చోళరాజుగా ఉండాలి. అప్పుడే ఆ రాజ్యానికి ఒక ప్రతిష్ఠ ఉంటుంది. పైగా అతడు చోళుల ఆడపడుచుకు జన్మించినవాడు. అందువల్ల చోళు డనిపించుకొన్నా ఫరవాలేదు.

రాజేంద్రుడు చోళరాజైన తరువాత తన కెదురు చెప్పగలవారే లేకపోయారు. నారనదేవుని యెడల కులోత్తుంగునికి ఎంత గౌరవ మున్నప్పటికీ సైనిక వ్యవహారాల వరకే అత డా సేనాని సలహాలను తీసుకున్నాడు. కాని పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి తనమాట తప్ప మరొకరి మాటను వినలేదు.

కులోత్తుంగు డనామకుడైన రాజు గాదు. అతనికి స్వతంత్రాలోచనలు లేకపోలేదు. అతనొక నిర్ణయానికి వస్తే ఎవరి మాటా

వినడు. కాని అతని మనస్తత్వం, తన మనస్తత్వం, అతని ధోరణి, తన ధోరణి, అతని దృక్పథం, తన దృక్పథం ఒకటిగానే ఉన్నాయి. ఒక విషయంలో అతనికేమి తోస్తుందో అదే తనకూ తోస్తుంది. ఒక సమస్యపై అతని కే ఆలోచన వస్తుందో ఆ ఆలోచనే తనకూ వస్తుంది. అందువల్లనే వారికి భేదాభిప్రాయం రాలేదు. వచ్చినా అవి వివరాలకు సంబంధించినవే గాని సూత్రాలకు సంబంధించినవి గావు. అందుకే అతని మాటను తాను పాటించగలుగుతున్నాడు. తన సలహాను అతననుసరించగలుగుతున్నాడు.

కాంచీపురం కులోత్తుంగుని కైవసమయిన తరువాత, వేంగి రాజ్యం గూడ అతని అధీనంలోకి వచ్చింది. విజయాదిత్యుడు తాము పెట్టిన షరతుల కన్నిటికీ అంగీకరించాడు. నామకార్థం రాజప్రతినిధిగా ఉండడానికి సమ్మతించాడు. అందువల్ల ఒక మహాయుద్ధం తప్పిపోయింది. ఆ యుద్ధమే వచ్చిఉంటే అది పూర్తి గావడానికి చాల దినాలు పట్టిఉండేది. అందువల్ల చోళరాజ్యానికి చాల నష్టం కలిగి ఉండేది. అంతిమ విజయం తమదే అయినా ఆ నష్టాన్ని భర్తీ చేయడానికి తమకెంతోకాలం పట్టిఉండేది. పైగా తమరాజ్యం బలహీన పడి ఉండేది. వైష్ణవులు తల ఎత్తడానికి, బలపడడానికి వీలుగలిగి ఉండేది. కాని ఆ కరకంఠుని దయవల్ల ఆ ప్రమాదం తప్పిపోయింది.

వేంగి రాజ్యం తమ అధీనంలోకి రావడంవల్ల దాదాపు దక్షిణాపథమంతా చోళరాజ్యం క్రిందికి వచ్చినట్లయింది. ఇప్పు డీ రాజ్యంలో అంతటా శాంతిభద్రతలు నెలకొన్నాయి. ఇక ఉన్నదల్లా శైవాన్ని పెంపొందించడమే. ఆ విషయాన్ని గూర్చి తానిక రాజుగారితో ఆలోచించాలి. ఆ విషయంలో వారుగూడ చాల అసక్తితోనే ఉన్నారు. ఇంతవరకు రాజ్యాన్ని ఒక స్థితిలోకి తీసుకొనిరావడమే సరిపోయింది. ఆ సమస్యను గూర్చి ఆలోచించడానికి అవకాశమెక్కడ లభించింది?

సోమదేవుని విషయంగూడ రాజుగారు తనతో చర్చించి ఉన్నారు. అతడు కారాగారంలో ఉన్నంతవరకు తమకు ప్రమాదమే నవి తాను తన రాజుగారికి చెప్పివున్నాడు. అందువల్ల అతణ్ణి

వధించడమే మంచిదని సలహా ఇచ్చి ఉన్నాడు. అందుకు రాజుగారు గూడ సమ్మతించి ఉన్నారు. కాని అతనికొక అవకాశమిచ్చి చూతా లంటున్నారు. సార్వభౌముని ఆలోచన మంచిదే. అతని కే యవకాశమూ యివ్వకుండా అతణ్ణి ఉరి తీయిస్తే వైష్ణవులే గాక, మెత్తని మనస్సు గల శైవులకు గూడ కష్టం కలగవచ్చు. అత డీ రాజ్యాని కెంతో సేవచేసి ఉన్నాడన్న విషయాన్ని వారు మరచి పోలేదు. కనుక రాజుగా రన్నట్లు అతనికొక అవకాశ మివ్వడం మంచిదే.

కాని కులోత్తుంగు డనుకొన్న విధంగా సోమదేవుడు మారుతాడా? తన విశ్వాసాన్ని చంపుకొని మతాన్ని మార్చుకొంటాడా?

"నే ననుకోను" అనుకున్నాడు త్రిపురాంతకుడు.

సోమదేవుడు సామాన్యుడు గాడు. చాల పట్టుదల గల వ్యక్తి. మంచి ధైర్యసాహసా లున్నవాడు. అతనికి భయమన్నదే తెలియదు. ఒక పద్ధతి ననుసరించి వర్తించేవాడు. అందువల్ల అతడు తన మతాన్ని మార్చుకోడు. అప్పు డతనినేమి గావించినా వైష్ణవులు తప్పు తక్కున వారెవ్వరూ అనుకోరు.

త్రిపురాంతకు డాలోచిస్తూనే ఉన్నాడు.

తన్ను సోమదేవుణ్ణి కలుసుకొమ్మన్నారు కులోత్తుంగ రాజుగారు. మతం మార్చుకొని శైవాన్ని అంగీకరిస్తే నారనదేవుని క్రింద సేనానాయకుడుగా ఉండడానికి తన కభ్యంతరం ఉండబోదని చెప్పమన్నారు. కాని అత డంగీకరిస్తాడా?

అంగీకరిస్తే అత డస్థిరుడని, పదవికోసం మతం మార్చుకొన్నాడని అందరూ అంటారు. అందువల్ల అతని పలుకుబడి సన్నగిల్లుతుంది. అంగీకరించకపోతే అతడే నాశనమవుతాడు. ఏమి జరిగినా మంచిదే. ఒకవేళ అత డంగీకరించినప్పటికీ అతడు తనకు ప్రతిద్వంద్వి గాలేడు. తనమీది కెత్తి వచ్చాడు గనుక రాజుగా రతణ్ణి విశ్వసించరు. పైగా పరిపాలనా విషయాలలో అతనికేమాత్రం జోక్యముండదు. సైన్యంలో గూడ నారనదేవుణ్ణి కాదని అతడేమీ

చేయలేదు. అతడు కూడ విజయాదిత్యునిలాగే ఒక అనామకుడుగా ఉండిపోతాడు.

త్రిపురాంతకుడు తనలో తానే నవ్వుకున్నాడు.

సోమదేవుడు తన మందిరంచుట్టూ సైన్యాన్ని నిలబెట్టి నప్పుడు తనపని కాస్తా ముగిసిం దనుకొన్నా డతడు. తనతోపాటు సైన్యాధికారులుగూడ నాశనమయ్యా రనుకొన్నాడు. కాని ఆ శంభుని దయవల్ల ఆ అపాయం తప్పిపోయింది. తన్ను బంధించా లను కొన్న సోమదేవుడే బంధించబడ్డాడు ఆ మహేశుని లీలలు వర్ణనా తీతాలు. అతని మనస్సులో ఏముందో యెవరికీ తెలియదు. అనుకొన్నాడు త్రిపురాంతకుడు.

హఠాత్తుగా అతని ఆలోచన ఆగింది. ఉన్నట్లుండి లేచా డతడు. అశ్వాన్ని సిద్ధం గావించమని భటునికిచెప్పి లోనికివెళ్ళి సిద్ధమై వచ్చాడు. సిద్ధంగావున్న అశ్వాన్ని ఎక్కి కారాగారంవైపు వెళ్ళాడు. అతనికి రక్షణగాఉన్న అశ్వికులుగూడ అతనితో వెళ్ళారు.

త్రిపురాంతకుడు కారాగారం వద్దకు వెడుతూనే ఆ అధికారి అతనికి నమ్రతతో నమస్కరించాడు. ప్రధాని యాజ్ఞ ననుసరించి సోమదేవుడున్న గదితాళాలు తీశాడు. త్రిపురాంతకుడు లోనికి వెళ్ళాడు. తక్కిన అశ్వికులు ఆ గదికి కొంతదూరంగా నిలబడ్డారు.

సోమదేవుడున్న గది చాల విశాలంగా ఉంది. అచ్చట ఒక తిన్నెగూడ ఉంది. దానిమీద రత్నకంబళం పరచబడి ఉంది. దాని మీద సోమదేవుడు కూర్చొని ఉన్నాడు. అతని హస్తాలు నిగళ బద్ధమై ఉన్నాయి. అతని గడ్డం పెరిగివుంది. అతడు చాల గంభీరంగా ఉన్నాడు.

త్రిపురాంతకుడు లోనికివస్తూనే సోమదేవుడు లేచి తనకు నమస్కరిస్తా డనుకొన్నాడు. కాని అతడలా చేయలేదు. పైగా తన ముఖాన్ని ప్రక్కకు తిప్పుకొన్నాడు. త్రిపురాంతకుని కది చాల కష్టాన్ని కలిగించింది. తనకే అధికారముంటే ఆ క్షణంలోనే అతణ్ణి ఉరి

తీయించి ఉండేవాణ్ణి అనుకొన్నాడు. కాని ఆ క్షణంలోనే తన కోపాన్ని నివారించుకొని, 'సోమదేవా!' అని పిలిచాడు.

సోమదేవుడు మాట్లాడలేదు.

'సైన్యాధిపా?' నవ్వాడు త్రిపురాంతకుడు.

'నీకు పరిహాసకరంగా వుందా?' అన్నాడు సోమదేవుడు కోపంతో.

'ఇంకా నీకు కోపం తగ్గలేదా? అనవసరమైన కోపంవల్ల లాభమేమున్నది?' ప్రశ్నించాడు త్రిపురాంతకుడు.

'లాభం లేదని నాకు తెలుసు. కాని అది తగ్గదు.' అన్నాడు సోమదేవుడు.

'ఎందువల్ల తగ్గదు?'

'ఎందువల్లనా? నీలాటి రాజద్రోహు లున్నారు గనుక.' త్రిపురాంతకునివైపు తీవ్రంగా పరికించాడు సోమదేవుడు.

ఆ చూపుల కాగలేకపోయాడు ప్రధాని.

'ఎందుకలా అంటావు సోమదేవా? కులోత్తుంగ రాజుగారు మాత్ర మెవరు? వారుగూడ చోళవంశ రాజులకు చెందరా?' వారి ఆడుబిడ్డ బిడ్డగాదా?'

'అయినంతమాత్రాన అతనికీ రాజ్యంమీద హక్కెక్కడుంది? నీలాటి కుట్రదారులవల్ల చోళరాజును చంపి అతడు రాజయ్యాడు. పశ్చిమ చాళుక్యుణ్ణి చోళుణ్ణి గావించినందుకు నీ రాజకీయ చతురత నభినందించాలి.'

'అందుకేగాదు. మరొకందుకుగూడ నీవు న న్నభినందించ వలసివుంది.'

'ఎందుకు?'

'నిన్ను మరల నీ స్థానంలో ఉంచడానికి వచ్చినందుకు.'

'నీ దయాదాక్షిణ్యాలమీద నేను బ్రతుకుతానని అనుకోకు. ప్రాచ్య చాళుక్యుడు చోళరాజ్యాన్ని పాలించినంత వరకు నేనతనిక్రింద పని చేస్తానని అనుకోకు.' అన్నాడు సోమదేవుడు.

'ఎల్లప్పుడూ ఒకే పట్టుదలతో ఉండకూడదు. పరిస్థితుల ననుసరించి మారుతూ ఉండాలి. మన కెవరు రాజైతే అతణ్ణి సేవించడం మన విధి. వీరరాజేంద్రుడు రాజుగాఉన్నప్పు డతణ్ణి సేవించాము. అధిరాజేంద్రుడు రాజుగా ఉన్నప్పు డతణ్ణి కొలిచాము. ఇప్పుడు కులోత్తుంగచోళుడు పరిపాలన గావిస్తున్నాడు గనుక అతణ్ణి సేవించాలి. అంతేగదా.' అన్నాడు త్రిపురాంతకుడు.

'అధిరాజేంద్రుణ్ణి నీవు కొలిచావా? నాశనం గావించావా? ఎందు కలా మాట్లాడుతావు? కోపంతో ప్రశ్నించాడు సోమదేవుడు.

'ఒకరి నుద్ధరించడం, నాశనం గావించడం మన చేతుల్లో ఉందంటావా సేనానీ. అంతా ఆ పరమేశ్వరుని హస్తాలలో ఉంది. చూడు. నీవు నన్ను బంధించాలనుకొన్నావు. నీవే బంధించ బడ్డావు. ఆ మహేశుని లీలా వినోదాలు మన కెలా తెలుస్తాయి? అన్నీ ఆ లీలామానుష విగ్రహుని ఇష్టాన్ని అనుసరించి జరుగుతుంటాయి. మనమంతా నామమాత్రులం.' అన్నాడు త్రిపురాంతకుడు.

'వేదాంతం మాట్లాడి నీవు చేసిన ద్రోహాన్ని కప్పిపెట్టుకో వద్దు. నీ పాపాని కెన్నడూ నిష్కృతి ఉండబోదు.'

'కోపంలో ఉన్నావు గనుక నీ వేమైనా మాట్లాడగలవు. నిన్నేమి చేయాలన్నా నాకు శక్తి ఉండిగూడ మన్నిస్తున్నాను. నా మాట వింటే నీవు బాగుపడతావు. నిన్ను రక్షించడానికి వచ్చాను నేను.'

'అధిరాజేంద్రుడు మరణించిన తరువాత నేను బ్రతికి ఉండి గూడ లాభంలేదు. అందువల్ల నీవేమి చెప్పినా ప్రయోజనంలేదు.'

'సోమదేవా! నా మాట విను. అవకాశం ఎన్నోమార్లు రాదు. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవద్దు. రాజుగారు నీయెడల

కనికరంతో ఉన్నారు. నీవు మతం మార్చుకొని శైవాన్ని అంగీక రిస్తే నారనదేవుని క్రింద నీవు సేనానిగా వుండడానికి తన కేలాటి అభ్యంతరమూ ఉండబోదని వారు నాతో చెప్పారు. ఆ విషయాన్ని చెప్పడానికే నే నిచ్చటికి వచ్చాను' అన్నాడు త్రిపురాంతకుడు.

'మతం మార్చుకోవడమా? త్రిపురాంతకా! నీ వేమైనా మార్చుకోగలవు. నే నలా చేయగలనా? నా మనస్సును గాని, నా మతాన్ని గాని నేను మార్చుకోగలనా?'

'శైవం చాలా గొప్ప మతం. వైష్ణవాన్ని పట్టుకొని ఊగు లాడడ మెందుకు?'

'ఆ చర్చలలోకి నేను వెళ్ళదలచుకోలేదు. నీకు శైవం ఎంత ప్రధానమో నాకు వైష్ణవం అంత ప్రధానం. దానిని నే నెలా వదలు కొంటాను?' అన్నాడు సోమదేవుడు.

'పదవి గావాలంటే వదలుకోవాలి.' నవ్వుతూ చెప్పాడు త్రిపురాంతకుడు.

సోమదేవునికి కోపం వచ్చింది.

''నీకు పదవి గావాలి. నాకు గాదు,' అన్నాడు సోమదేవుడు.

'పదవి వుంటేనే ప్రాణ ముంటుంది?' గంభీరంగా అన్నాడు త్రిపురాంతకుడు.

సోమదేవుని ఆగ్రహానికి పరిమితి లేకపోయింది.

'నన్ను బెదిరింపజూస్తున్నావా? నే నొక సైనికుణ్ణన్న విష యాన్ని నీవు మరచిపోయావు. ఎన్నడైతే నేను సేనలో చేరానో ఆనాడే ప్రాణాలమీద ఆశ వదలుకొన్నాను. నీలాగా ఈ పదవికోసం, అధికారం కోసం నా మనస్సుకు నేను ద్రోహం చేయలేదు.'

'నీ విప్పుడాలోచించే స్థితిలో లేవు. కోపం యెవరినీ ఆలో చించనివ్వదు. ఆలోచించకనే చాలమంది చెడిపోయారు. నా మాట విను. మతం మార్చుకో. నీ పదవి నిలుస్తుంది. నీ ప్రాణాలకు భద్రత కలుగుతుంది.'

'నీవు చాల పొరబడుతున్నావు మంత్రీ. పదవికోసం నేను మతం మార్చుకొంటానని ఎన్నడూ అనుకోకు. ఆ షరతు పెట్టక పోయినప్పటికీ నేను నీ రాజును సేవింప దలచుకోలేదు. అతడు నా రాజుకు శత్రువు. నా రాజు ప్రాణాలను తీసిన దుర్మార్గుడు. అతణ్ణి నే నెలా సేవిస్తాను?'

'నీ అదృష్టమలా ఉంటే ఎవరు మాత్రం ఏమి చేయగలరు? రోగికి పథ్యం రుచిస్తుందా? కాని ఇంతవరకు నీతో పని చేసినవాణ్ణి గనుక మరొకసారి చెప్పాలని అనిపిస్తున్నది. నా మాట విను. కులోత్తుంగ సార్వభౌముని ఆధిపత్యాన్ని అంగీకరించు. రాజమత మైన శైవమతాన్ని అవలంబించు. నీవు బాగుపడుతావు. రాజ్యం బాగుపడుతుంది. మరల మనమిద్దరం మిత్రులుగా ఉండి యీ చోళ రాజ్య విస్తరణకు పూనుకొందాము.' అన్నాడు త్రిపురాంతకుడు.

సోమదేవుడేమీ మాట్లాడలేదు. ముఖాన్ని అటు త్రిప్పుకొని కూర్చున్నాడు.

'సరే. నీవాలోచించే స్థితిలో లేవు. నేను వెడుతున్నాను. కడసారిగా చెబుతున్నాను విను. ఒక వారం దినాలు నీకు గడువు. చక్కగా ఆలోచించుకో. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకొని ఆనక చింతించవద్దు. నీవు మతం మార్చుకొని కులోత్తుంగ చోళుని సార్వభౌమత్వాన్ని అంగీకరించకపోతే ఎనిమిదోనాడు——'

'నన్ను ఉరి దీయిస్తావు. అంతేనా?' త్రిపురాంతకుని వైపు తిరిగి అన్నాడు సోమదేవుడు. అతని మాటలు చాల తీవ్రంగా ఉన్నాయి.

'అది తప్పదు.'

అంటూ వెళ్ళిపోయాడు త్రిపురాంతకుడు.

'తుచ్ఛుడు.'

అంటూ పళ్ళు కొరికాడు సోమదేవుడు.

# 11

## ఏరివేత

రంగాచార్యులు తిల్యకు వైష్ణవులనుగూర్చి చెబుతున్నాడు. ఆమె శ్రద్ధగా వింటున్నది.

'రామానుజునికి చాలమంది శిష్యులున్నారు.' అతడు చెప్ప సాగాడు. 'యజ్ఞేశుడు, వరదార్యులు గూడ ఆ శిష్యులలోని వారే. వారు అష్ట సహస్రం అనే గ్రామంలో వుండేవారు.'

'అదెచ్చటున్నది?' ప్రశ్నించింది తిల్య.

'శ్రీరంగానికి దగ్గరగానే ఉంటుంది' అన్నాడు రంగాచార్యులు. 'వారిలో యజ్ఞేశుడు ధనవంతుడు, వరదార్యుడు చాల పేద వాడు.' చెప్పసాగాడు ఆ ఆచార్యులు.

'ఒకనాడు రామానుజుడు ఆ అష్టసహస్ర గ్రామానికి వెళ్ళాలనుకొని ముందుగా యజ్ఞేశునివద్దకు కొందరు వైష్ణవుల్ని పంపాడు, మరునాడు తాను వస్తానని చెప్పమన్నాడు.'

తిల్య చాల ఆసక్తితో వినసాగింది.

'ఆ వైష్ణవులు ముందుగా వెళ్ళి రామానుజుని రాకను గూర్చి యజ్ఞేశునికి చెప్పారు. ఆతడు సరే నన్నాడేగాని ఆ వైష్ణవుల విషయాన్ని గూర్చి ఏమాత్రం ఆలోచించలేదు. అందువల్ల ఆతనివద్దకు వెళ్ళిన వారు పస్తులు మాడారు.

'ఆ మరునాడు రామానుజుడు తన శిష్యులతోగూడ ఆ గ్రామానికి వెళ్ళాడు. అచ్చట ఆకలితో అలమటిస్తున్న ఆ వైష్ణవు లెదురయ్యారు. వారి ముఖాలు చాల వాడి ఉన్నాయి. వారు చాల విచారంగా ఉన్నారు. ఎందు కలా ఉన్నారని అడిగాడు రామానుజుడు. వారు జరిగిన విషయాన్ని చెప్పారు. రామానుజునికి చాల కోపం

వచ్చింది. తనని అలా నిరాదరించి ఉంచే ఆ మహాత్ము డేమీ అను కొని ఉండేవాడుగాడు. కాని ఆ వైష్ణవులను పస్తుబెట్టినందు కతడు మండిపోయాడు. ఏమాత్రం నాగరకతకలిగినవాడైనా అలాచేయడు. అందులో అతడు పేదవా డేమీగాదు. ధనవంతుడు. అలా ఉండీ గూడ వారికి తిండైనా పెట్టలేదు. అలాటివాడు వైష్ణవు డెలా అవు తాడు ?' అనుకొన్నా డా మహానుభావుడు.

'ఇది నిజంగా ఆశ్చర్యంగానే ఉంది. ధనవంతుడే అలా ప్రవ ర్తిస్తే——' అని ఆగింది తిల్య. రంగాచార్యుడు చెబుతున్న విష యాన్ని విని.

'అవునమ్మా. ధనవంతు లైనంతమాత్రాన నీలాగా త్యాగం గావిస్తారా ?' అంటూ నవ్వాడు. మరల చెప్పసాగాడు.

'యజ్ఞేశు నింటికి వెళ్ళడానికి రామానుజుని కిష్టం లేక పోయింది. అందువల్ల అ త డు వరదార్యు నింటికి వెళ్ళాలను కొన్నాడు. తన శిష్యుల్ని వరదార్యునింటికి దారిచూపమన్నాడు.

'వరదార్యుడు చాల పేదవాడు. రామానుజునితో వెడుతున్న వారి కందరికీ అతడు భోజనం పెట్టలేడు. కాని రామానుజు డతని యింటికే వెళ్ళదలచుకొన్నాడు.'

తిల్య ఆశ్చర్యంతో వినసాగింది.

'రామానుజుడు వరదార్యుని యింటికి వెడుతూనే అతనిభార్య తలుపును గభాలున మూసివేసింది. అది చూచి అందరికీ ఆశ్చర్యం కలిగింది.

'వరదార్యుని యిల్లు చిన్న పూరి గుడిసె. పైకప్పంతా పోయి ఉంది. తలుపుగూడ రంధ్రాలు పడి ఉంది. అందులోను అది వెదురు తడిక.

'ఆమె ఎందుకలా తలుపు వేసుకొన్నదో ఎవరికీ అర్థం కాలేదు. అందరూ ఆ ద్వారంవైపు ఆశ్చర్యంతో చూస్తున్నారు. అంతలో రెండు హస్తాలు ఆ తలుపు రంధ్రంనుండి వెలుపలికి వచ్చాయి. ఆ రెండు హస్తాలు ఒకటిగా చేరి నమస్కరించాయి.

'ఆమె నమస్కరిస్తున్నది.' అన్నా డొక వైష్ణవుడు.

'ఆమె ఎందు కలా చేస్తున్నదని రామానుజు డాలోచించాడు. అతని కిర్థమయింది. బహుశా ఆమె ధరించిన చీర చిరిగి ఉందేమో, అందువల్ల అందరి ముందర కనబడదాని కామె సిగ్గు పడుతున్న దేమో అంటూ రామానుజుడు తన అంగవస్త్రాన్ని తీసి ఆ ద్వారం వద్దకు వెళ్ళి ఆమె చేతుల్లో ఉంచాడు. ఆమె దానిని క్రింద వేయబోయింది. కాని రామానుజుడు, 'తీసుకోమ్మా. నీ కోసమే యిస్తున్నాను.' అంటూ బలవంతపరచాడు.

'ధన్యురాలిని' అంటూ ఆమె ఆ వస్త్రాన్ని తిన్నగా ఆ రంధ్రం ద్వారా లోనికి తీసుకొన్నది. దాని నామె తన చిరిగిపోయిన చీరమీద కట్టుకొని తలుపు తీసింది. వచ్చి రామానుజుని పాదాలమీద వ్రాలింది.

'రామానుజు డామె నాశీర్వదించాడు, అతని కళ్ళు చెమరించాయి.'

అవి రంగాచార్యులు చెబుతున్నప్పుడు తిల్యా కళ్ళలో గూడ నీరు గమ్మింది. మరల రంగాచార్యులు చెప్పసాగాడు.

'ఆమె తిన్నగా లేచి రామానుజుణ్ణి ఆహ్వానించింది. రామానుజుడు లోనికి వెళ్ళాడు. అచ్చట చిరిగిన ఒక చాపను వేసి ఆ మహాత్ముణ్ణి కూర్చోమన్నదామె. అతడెంతో ఆనందంతో అచ్చట కూర్చున్నాడు. తక్కినవారు ఆ యింటిముందు ఉన్న చెట్ల నీడలో కూర్చున్నారు.

'వరదార్యు డెచ్చటికివెళ్ళాడు?' ప్రశ్నించాడు రామానుజుడు.

'వెలుపలికి వెళ్ళారు, వస్తారు. మీ రిచ్చటే ఉండండి. ఇప్పుడే వస్తాను.' అని ఆమె వెళ్ళిపోయింది.

'ఆమె పేరేమి?' ప్రశ్నించింది తిల్యా.

"పరిత్తికొక్కల్లైనాచ్చియార్" అన్నాడు రంగాచార్యులు.

'ఆమె యెక్కడికి వెళ్ళింది?'

'ఒక వర్తకుని యింటికి వెళ్ళింది.' అంటూ తీరా చెప్పవారంభించాడు రంగాచార్యులు. 'ఆమె చాల అందవతి. పేదతనం

వల్ల కష్టాలు పడుతున్నప్పటికీ ఆమె సౌందర్యం ఏమాత్రం చెడ లేదు. ఆ ఊళ్ళో ఉన్న ధనవంతుడైన ఒక వర్తకు డొక డామెను మోహించాడు. పేదవాడైన ఆ బాపడితో కాపుర మెందుకన్నాడు. తనతో ఉంటే స్వర్గసుఖాల ననుభవించవచ్చు నన్నాడు. ఆనందంతో కాపురం చేయవచ్చునన్నాడు. ఒకవేళ తనతో కాపురంపెట్టక పోయి నప్పటికీ తన ఆశ తీరిస్తే వేనవేల రూపాయ లిస్తానన్నాడు. కాని ఆమె వినలేదు. అతడు పెట్టిన ఎరవెంతానికీగాని, అతడు చూపిన ఆశలకు గాని ఆమె లొంగలేదు.

'రామానుజుడు తన యింటికి వచ్చిన తరువాత అతణ్ణి, అతని శిష్యుల్ని ఊరకే ఎలా పంపేదని ఆమె చాల బాధపడింది. తన యింటిలో ఒక గింజలేదు. వరదార్యుడు ప్రక్కగ్రామంలో భిక్ష మెత్తడానికి వెళ్ళి ఉన్నాడు. వచ్చినా అత డేమి చేయగలడు ? తానే ఏదో మార్గం చూడాలని అనుకొన్నదామె. అంతలోనే ఆమె కొక ఆలోచన కలిగింది. ఆ వ్యాపారి కామవాంఛ తీర్చ గలిగితే,— మహాత్ముడైన రామానుజునికి, అతని శిష్యులకు పంచభక్ష్య పరమా న్నాలతో భోజనం పెట్టవచ్చు. అంతకంటె పరొక భాగ్య మే మున్నది ? అలా చేస్తే తన భర్తగూడ ఏమీ అనుకోడు, అను కొన్నదామె. వెంటనే ఆ వర్తకుని వద్దకు వెళ్ళింది. రామానుజుని రాకను తెలిపింది. అతనికి, అతని శిష్యులకు భోజనం పెట్టడానికి కావలసిన సంభారాలనిస్తే. ఆ తరువాత వచ్చి అతని యిష్టాన్ని తీరుస్తానన్నది. తీరని కోరిక ఫలించ నున్నందు కాశపడి ఆ వర్తకు డామె కోరిన సరకులిచ్చాడు. ఆమె వాటిని తీసుకొని వెళ్ళి ఒక స్నేహితురాలి యింటివద్ద భోజనం చేయించి రామానుజుణ్ణి అతని శిష్యుల్ని అచ్చటికి తీసుకొనివెళ్లి వారికి సంతృప్తిగా భోజనం పెట్టింది. అంతలో వరదార్యుడు భిక్షం తీసుకొని ఇంటికి వచ్చాడు. వచ్చేసరికి అచ్చట రామానుజుడు, అతని శిష్యులు కూర్చుని ఉన్నారు.

'రామానుజుడు వచ్చినవార్త వర్తకుడు చెప్పినప్పుడు గాని యజ్ఞేశునికి తెలియలేదు. యజ్ఞేశు డా వర్తకుని యింటి ముందుగా వెడుతుంటే అప్పు డత డా వార్త నందించాడు. వెంటనే యజ్ఞేశుడు

రామానుజుణ్ణి వెతుక్కొంటూ వరదార్యుని యింటివద్దకు వచ్చాడు. ఆ మహాత్ముణ్ణి తన యింటికి రమ్మని ఆహ్వానించాడు. భోజనాలన్నీ అయ్యాయని, ఇక రావలసిన అవసరం లేదని అన్నాడు రామానుజుడు. వెంటనే వెళ్ళిపోతున్నామని చెప్పాడు.

'యజ్ఞేశునికి తాను చేసినతప్పు తెలిసి వచ్చింది. తన తప్పిదాన్ని మన్నించమని అతడు రామానుజుని పాదాలమీద వ్రాలాడు. ఇకనైనా సామాన్యుల్ని ప్రేమించడం నేర్చుకొమ్మని మందలించాడు రామానుజుడు.'

'రామానుజుడు వెళ్ళిన తరువాత అతణ్ణి ఎలా సన్మానించ గలిగావని తన సతీమణి నడిగాడు. ఆమె జరిగిన విషయాన్ని పూస గ్రుచ్చినట్లు చెప్పింది. వర్తకునికి తా నిచ్చినమాటగూడ చెప్పింది. వరదార్యుడు కోపపడలేదు. వర్తకుని కోర్కెను తీర్చిరమ్మని భార్య ననుమతించాడు.'

'ఎంతటి విశాలహృదయుడు?' అన్నది తిల్య.

'తరువాత?'

'తరువాత ఆమె ఆ వర్తకునివద్దకు వెళ్ళింది. అతని వాంఛను తీర్చడానికి వచ్చానన్నది. ఆమాట వింటూనే అతనిలో ఏదో మార్పు వచ్చింది. తన్ను పరీక్షిస్తున్న ఒక మహా దేవతామూర్తిలాగా కన బడిం దామె అతనికి. అతడు వెంటనే ఆమెకు చేతులు జోడించాడు. తన తప్పును మన్నించమన్నాడు. తన కళ్ళు తెరువబడిన వన్నాడు. ఇకమీద యెన్నడూ తా నాలాటి తప్పిదాన్ని గావించబోనన్నాడు.

'ఆమె అతణ్ణి మన్నించి యింటికి వచ్చింది. పతి పాదాల మీద వ్రాలి జరిగిన విషయాన్ని చెప్పింది. అతనామెను లేవనెత్తి కౌగిలించుకున్నాడు.'

'నిజంగా వారే వైష్ణవులు.' అన్న దామె కళ్ళు తుడుచు కొంటూ.

అంతలో ఆనందగిరి అచ్చటకు వచ్చాడు.

'ఈ విషయాన్ని మీరు విన్నారా?' అన్నాడు.

తిల్య శ్రీరంగానికి వచ్చి రామానుజుని దర్శించినప్పటినుండి వైష్ణవంమీద ఆమెకున్న భక్తి హెచ్చింది. ఆమె అప్పుడప్పుడూ వారిని రావించి వారిద్వారా వైష్ణవులనుగూర్చి, వైష్ణవ ధర్మాలను గూర్చి, విశిష్టాద్వైతాన్ని గూర్చి తెలుసుకుంటూ ఉంది. అందువల్లనే రంగాచార్యులు, ఆనందగిరిలాటివారు ఆమె యింటికి వచ్చి వెడుతుంటారు.

కుముదిని కాలంలో వారి యింటికి రావడమంటే ఒక వారాంగన గృహానికి వచ్చినట్లు, అందువల్ల విటులు తప్ప మరెవ్వరూ ఆ యింటికి వచ్చేవారు గారు. కాని తిల్య తలయెత్తిన తరువాత, ఆమె వైష్ణవాన్ని స్వీకరించిన తరువాత, ఆమె వైష్ణవులనే గాక పేదల నందరినీ ఆదుకొనడానికి ప్రారంభించిన తిరువాత చాలమంది ఆ యింటికి వస్తూ పోతున్నారు. ఇప్పుడెవ్వరూ ఆమెను వారాంగన అనుకొనడంలేదు.

తిల్య వైష్ణవులనందరినీ ఒకటిగా చేరదీసి వారిలో ఐక్యమును, ఆత్మవిశ్వాసాన్ని పెంచగలిగింది.

వారిద్వారా అప్పుడప్పుడూ గోవిందరాజస్వామి ఆలయంలో చర్చలు జరిపించి ప్రజల కందరికీ వైష్ణవాన్ని గూర్చి తెలియజేయ సాగింది. తన గాన మాధుర్యం వల్ల, తన నటనా సామర్థ్యంవల్ల అందరినీ మంత్రముగ్ధుల్ని గావించి వారి హృదయాలు భక్తితో నింపేది.

తిల్య తల్లి కుముదిని చాల సంపాదించింది. ఆమె తల్లి అంతకంటె హెచ్చుగా సంపాదించింది. చిదంబరంలో ఉన్న ధన వంతుల కుటుంబాలలో తిల్య కుటుంబం గూడ ఒకటి. తిల్య రామానుజుని వద్దకు వెళ్ళి వచ్చినప్పటినుండి వైష్ణవ మతోద్ధరణ కోసం హెచ్చుగా ఖర్చు పెట్టడానికి పూనుకొన్నది. చిదంబరంలో ఒక వైష్ణవ సంఘాన్ని గూడ స్థాపించింది. ఆ సంఘానికి రంగాచార్యు లధ్యక్షుడు.

శ్రీరంగంలోగాని, మరి యితర పట్టణాలలో గాని వైష్ణవు లున్నారు గాని వైష్ణవ సంఘాలంటూ లేవు. ఆ నగరాలలో అప్పు

డప్పుడూ వైష్ణవ గోష్ఠులు జరగడం తప్ప వైష్ణవ సంఘ కార్య కలాపాలు జరగడంలేదు. కాని చిదంబరంలో అలా గాదు. అచ్చట చాల శక్తివంతమైన వైష్ణవ సంఘ మేర్పడింది. అందువల్ల చిదం బరం బలమైన వైష్ణవ కేంద్రంగా మారింది.

ఆనందగిరి వచ్చి 'యీ విషయాన్ని మీరు విన్నారా?' అని ప్రశ్నించినప్పుడు తిల్య 'ఏ విషయాన్ని?' అని అడిగింది.

'సేనాని సోమదేవుణ్ణి ఉరి తీసిన విషయాన్ని.' అన్నాడు ఆనందగిరి.

'ఆఁ, సోమదేవుణ్ణా? నిజంగానే?' ఆశ్చర్యంతో ప్రశ్నించాడు రంగాచార్యుడు.

'అవునండీ. ఇప్పుడే ఎవరో కాంచీపురంనుండి వచ్చారట. వారు చెబుతున్నారు.'

'యుద్ధంలో బంధించబడ్డాడు గదా? ఎందుకని ఉరి తీయ బడ్డాడు?' విచారంతో అడిగాడు రంగాచార్యుడు.

'ఎవరండీ యీ సోమదేవుడు? అధిరాజేంద్రుని సేనా పతా?' ప్రశ్నించింది తిల్య.

'అవునమ్మా. అతడు గొప్ప వైష్ణవుడు. మంత్రి త్రిపు రాంతకునికి అతడంటే యిష్టముండేది గాదు. మరేమి జరిగిందో,' అన్నాడు రంగాచార్యుడు.

'ఆ మంత్రివల్లనే ఇంతా జరిగింది. కులోత్తుంగుని కిప్పు డతడే గదా తలలో నాలుక. అతడే సోమదేవు డురితీయబడడానికి కారణమంటున్నారు' ఆనందగిరి అన్నాడు.

'ఎందువల్ల అలా చేయించా డతడు?' తిల్య ప్రశ్నించింది.

'ఏముందమ్మా. సోమదేవుడు వైష్ణవుడు. త్రిపురాంతకుడు శైవుడు. అందువల్ల అతణ్ణి చంపించడాని కామాత్రం పూను కొన్నాడు.' అన్నా డానందగిరి.

'వైష్ణవు డయినంత మాత్రాన చంపించడమా? ఆశ్చర్యంగా వుందే,' తిల్య అన్నది.

'మరేమనుకున్నారు? కులోత్తుంగచోళుడు గూడ శైవుడు. అతనికి శైవమంటే చాల పిచ్చి. శైవాన్ని వ్యాప్తినందించడానికే తాను రాజయ్యానని అతనీ మధ్య తన సభలో చెప్పాడట. తన రాజ్యంలో శైవం తప్ప మరే మతమూ ఉండడానికి వీలులేదన్నా డట. ముఖ్యంగా తన ఉద్యోగు లెవరూ ఇతర మతాల నవలంబించ డానికి సాధ్యం కాదన్నాడట.'

'అంతవరకు వచ్చాడా అతడు?' అన్నాడు రంగాచార్యు డానందగిరి చెబుతున్నదాని నాలకిస్తూ.

'ఇదే కారణమా సోమదేవుని ఉరితీయడానికి?' ప్రశ్నించింది తిల్య.

'అవునమ్మా. ఒకనాడు త్రిపురాంతకుడు కారాగారానికి వెళ్ళి సోమదేవునితో, వైష్ణవమతాన్ని వదలుకొని శైవమతాన్ని అవలం బిస్తే అతణ్ణి నారనదేవుని క్రింద సైన్యాధిపతిగా కొనసాగనిస్తా మన్నా డట. అందు కత దేమాత్రం సమ్మతించలేదట. పైగా ప్రాణాలు పోయినా తనరాజుపై కుట్ర గావించిన త్రిపురాంతకుణ్ణి మన్నించ నన్నాడట. అందువల్ల అతడు కోపించి కులోత్తుంగునితో చెప్పి అతణి ఉరిదీయించాడట.'

'రామ రామ.' ఆమె మనస్సు క్రుంగింది.

'అదీ ఎలా ఉరితీయించా డనుకొన్నారు? ఎక్కడో మారు మూల ప్రదేశంలోగాదు. కాంచీపురకోట ద్వారంవద్ద. ప్రజలందరూ చూస్తూ ఉన్నప్పుడు. రాజు కెదురుతిరిగినవారి కందరికీ ఇదే శాస్తి; వైష్ణవులుగా ఉండగోరువారి కిదే శాస్తి అంటూ ఉరితీశారట.'

ఆ మాటల్ని విని తిల్య చాల బాధపడింది.

'ఇది ఇంతతో ఆగుతుందని నేననుకోను.' సాలోచనగా అన్నాడు రంగాచార్యుడు.

'మీ రన్నది నిజమే. ఇది ఇంతతో ఆగదు. ఆగబోదు. శైవులుగాని ఉద్యోగుల కందరికీ తాఖీదులు పంపాలనిగూడ మొన్న మొన్ననే నిర్ణయించారుట.'

'ఏమని?' ఆదుర్దాతో ప్రశ్నించాడు రంగాచార్యుడు.

'ఏమని? ఉద్యోగంలో ఉండాలంటే ఇతర మతాలను వదలి శైవులు గావాలని.'

'ప్రభుత్వంలో ఇప్పుడున్నవారు మాత్రమే శైవులుగా ఉండాలా లేక అందులో చేరేవారుగూడ శైవులుగా ఉండాలా?' అడిగాడు రంగాచార్యుడు.

'ఇప్పుడున్నవారే మతం మార్చుకోవలసి ఉన్నప్పుడు కొత్త వారి విషయం చెప్పాలా?' అన్నా డానందగిరి.

'ఎంత ప్రమాదం వచ్చింది?' అన్నది తిల్య.

'ఇది త్రిపురాంతకుని కొక ఘనవిజయం.' అన్నాడు రంగాచార్యుడు.

'ఆ మంత్రి ఇప్పుడేగాదు. అధివీరరాజేంద్రుని కాలంలోగూడ శైవులంటే ఇష్టపడేవాడు. ఇతరులకు పదవులిచ్చేవాడు గాడు. సోమదేవుడు లేకుంటే సైన్యంలోగూడ వైష్ణవు లున్నతోద్యోగాలలో ఉండేవారు గారు.' అన్నా డానందగిరి.

'ఇక సైన్యంలోమాత్రం వైష్ణవుల నుండనిస్తాడా? అంతా శైవమయమై పోతుంది.' నిట్టూర్చాడు రంగాచార్యుడు.

'పరిపాలనకు వచ్చిన కొత్తలో కులోత్తుంగు డింత ఉద్ధృతంగా ఉండేవాడు గాదు.' అన్నా డానందగిరి.

'ఎందుకులేదు? ఉండివుంటాడు. కాని రాజ్యాన్ని పదిల పరచుకొని మరల విజృంభిద్దామని అనుకొని ఉంటాడు.'

'నిజమే కావచ్చు.'

'ఇంతకుముందే నా కనుమానంవేసింది. జీర్ణదేవాలయోద్ధరణ అనే పేరుతో శైవుల ఆలయాలనే పునరుద్ధరిస్తూ వచ్చా డతడు. వైష్ణవులుగాని, తదితర మతాల వారుగాని అర్థించినా వారి ఆలయాలను బాగుచేయలేదు. శివాలయాలను నిర్మిస్తే దానికి సాయం గావించా డత డా తరువాత- అప్పుడే నే ననుకొన్నాను - కులోత్తుంగుడు శైవాన్ని పెంపొందించడానికి పూనుకొన్నాడని. అంతేగాని వైష్ణ

వాన్ని, ఇతరమతాలను తుడిచిపెట్టవాని కతడు పట్టుబడతాడని నేను కలలోనైనా అనుకోలేదు.' నిట్టూర్చాడు రంగాచార్యుడు.

'ఇతడు మరెన్ని అఘాయిత్యాలు చేస్తాడో?' రంగాచార్యుణ్ణి పరికిస్తూ అన్నది తిల్యా.

'చెప్పలేమమ్మా. ఇతని పరిపాలనలో వైష్ణవానికి ప్రమాదమే వచ్చినట్లుంది. జాగ్రత్తగా ఉంటేతప్ప లాభం లేనట్లుంది.'

'మతాలమీద దాడిజేయడ మెందుకీ రాజు? వాటివల్ల అతనికి వచ్చే ప్రమాద మేమున్నది? ఎవరి మతం వారిది.' అన్నది తిల్యా.

'ఎంత అమాయకురాలివమ్మా!' నవ్వాడు రంగాచార్యుడు. 'శైవుల ప్రాబల్యంపోతే తన ప్రాబల్యంగూడ పోతుందని అతని భయం. అందువల్ల ఆ మతాన్ని పైన ఉంచాలని అతని ఆలోచన.'

'అలాగా?' ఆలోచిస్తూ అన్నది తిల్యా.

'ఇక పోరాటం ప్రారంభమయినట్లే. ఏ త్యాగానికైనా వైష్ణవులు సిద్ధంగా ఉండాలి' అన్నాడు రంగాచార్యుడు.

'అవును. గత్యంతరంలేదు.' అన్నా డానందగిరి.

'దీనికంతా ధైర్యంకావాలి. సోమదేవుడు లాగా ఎందరు నిలబడగలుగుతారు?' సందేహాన్ని వెలిబుచ్చాడు రంగాచార్యుడు.

'అదీ నిజమే.' అన్నది తిల్యా.

'వైషవులందరూ కలిసి దీనికొక మార్గాంతరం ఆలోచించాలి.' అన్నాడు రంగాచార్యుడు.

'ఇప్పుడు రామానుజు డెచ్చట ఉన్నాడో?' ప్రశ్నించాడు ఆనందగిరి.

'ఆ మధ్య సింహాచలం వెళ్ళాడని విన్నాను. ఆ తరువాత తిరుమలకు వచ్చి ఆ దేవాలయంలో వైషవాన్ని ప్రతిష్ఠించినట్లుగూడ విన్నాను. బహుశా, శ్రీరంగం చేరుకొని ఉంటాడేమో.' అన్నాడు రంగాచార్యుడు.

'అవునవును. నేనుగూడ విన్నాను. తిరుమలలో ఉన్న దేవుడు శివుడా, విష్ణువా అనే తగాదా వచ్చిందట. విష్ణువేనని

ఋజువు గావించాడట రామానుజుడు. ఆ మహాత్మునికంటె గొప్ప వారే లేదనుకొంటాను.' అన్నది తిల్య ఆనందంతో.

'దేశమంతా యీ నా డా మహాభాగునికి చేతులెత్తి నమస్కరిస్తున్నది. కాని కులోత్తుంగుని రాజ్యంలోమాత్రం అతని మతానికి తావులేకుండా పోతున్నది.' నిట్టూర్చాడు రంగాచార్యుడు.

# 12

## 'శివాత్పరతరం నాస్తి'

రామానుజుణ్ణి పట్టుకొని రావడానికి కులోత్తుంగుడు తన సైన్యాన్ని పంపాడు. ఆ సైన్యానికి పశుపతి నాయకత్వం వహించాడు.

పశుపతి శైవుడు. చాల క్రూరుడు. నిర్దయుడు. నిరంకుశుడు. అందువల్లనే విశిష్టాద్వైత స్రష్టను పట్టుకొని రావడానికతడు పంపబడ్డాడు.

సోమదేవుణ్ణి ఉరి తీసిన తరువాత కాంచీపురంలోనే గాక చోళరాజ్య మంతటా చాల సంఘటనలు జరిగాయి.

సోమదేవుడు కాంచీపురం కోట బహిద్వారం వద్ద బహిరంగంగా ఉరిదీయబడ్డాడు. అది వైష్ణవులకేగాక ఇతర ప్రజల్ని గూడ భయవిహ్వాలుల్ని గావించింది. చోళరాజ్యాన్ని ఎందరో రాజులు పాలించారు. కాని ఏ రాజు కాలంలో గూడ అలాటి ఘాతుక చర్య జరిగివుండ లేదు.

సోమదేవు డలా ఉరి దీయబడినప్పుడు త్రిపురాంతకు డెంతో ఆనందించాడు. తన మేడమీద కూర్చొని పొంగి పొరలిపోయాడు. ఈ నాటికి తన వైరి రూపుమాపబడ్డాడని, ఇక తాను నిష్కంట

కింగా, నిరభ్యంతరంగా. నిరాటంకంగా పరిపాలన కొనసాగించ వచ్చుననీ అనుకొన్నాడు.

సోమదేవుణ్ణి ఉరితీసిన తరువాత కులోత్తుంగుడు తన విధానాన్ని తన ఆస్థానంలో నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. శైవం తప్ప తక్కిన ఏ మతం గూడ తన పొలిమేరలలో ఉండడానికి వీలు లేదన్నాడు. ముఖ్యంగా తన ఉద్యోగు లెవ్వరూ ఇతర మతాల ననుసరించగూడ దన్నాడు. అందరూ శైవాన్నే అవలంబించాలన్నాడు. త్రిపురాంతకునితో ఆలోచించడాని కొక పద్ధతిని నిర్ణయించాడు.

ప్రభుత్వోద్యోగులుగా ఉన్నవారందరూ 'శివాత్పరతరం నాస్తి' అన్న పత్రంపై సంతకాలు చేయాలని కులోత్తుంగు డాజ్ఞ యిచ్చాడు. అలాగా చేయనివారిని ఉద్యోగాలనుండి ఊడ్చి వేయమన్నాడు.

ఆ సంతకాల ఉద్యమం మొట్టమొదట సైన్యంలో ప్రారంభించబడింది. సైన్యంలో ఉన్న వారే మతానికి చెంది ఉన్నప్పటికీ వారందరూ 'శివాత్పరతరం నాస్తి' అని ఉన్న పత్రంపైన చేవ్రాలు పెట్టాలి. అంటే శివుడు తప్ప అన్య దైవం లేదు అని అంగీకరించాలన్న మాట. అలా చేవ్రాలు చేయనివారు వెంటనే తమ ఉద్యోగాల నుండి తప్పింపబడుతారు.

కులోత్తుంగుడు గావించిన ఆ ఆజ్ఞ చాల భయంకరమైనది. ఆ ఆజ్ఞను విని ఇతర మతస్థుల వారెల్లా కంపించారు. సార్వభౌముని సైన్యంలో బౌద్ధులు, జైనులు, తదితర మతస్థులు కొద్దిమందే ఉన్నారు. వైష్ణవులు మాత్రం తగిన సంఖ్యలోనే ఉన్నారు. వారి కేమి చేయడానికీ తోచలేదు. కులోత్తుంగుడు పంపిన పత్రం మీద సంతకం చేయకుంటే ఉద్యోగా లూడుతాయి. అప్పుడు తాము దారిద్ర్యాన్ని అనుభవించవలసి వస్తుంది. అంతేగాక సార్వభౌముని అనుమానానికి గురిగావలసి వస్తుంది. ఆ తరువాత తమ ప్రాణాల మీద గూడ ఆశ వదలుకోవలసి వస్తుంది. ఆ ఆలోచన వచ్చేసరికి వైష్ణవు లందరూ భయపడిపోయారు.

కఠిన పరీక్షలు వచ్చినప్పు డెవరో కొందరు తప్ప అందరూ ఒక సిద్ధాంతానికి, ఒక మతానికి కట్టుపడి ఉండలేరు. అందరూ సోమదేవునిలాగా ఉండరు.

సైన్యంలో ఉన్న వైష్ణవులలో చాలమంది ముందు వెనుక లాలోచించారు. తమ కుటుంబాలను గూర్చి తలుచుకున్నారు. రానున్న ఉపద్రవాన్ని గుర్తించారు. అందువల్ల సార్వభౌముడు పంపిన పత్రంమీద సంతకాలు పెట్టారు. ఊర్ధ్వపుండ్రాలు మానివేసి విభూతి పెట్టుకోవడం ప్రారంభించారు. కాని కొందరు మాత్రం ఆ పత్రంమీద సంతకం గావించడాని కంగీకరించలేదు. పైగా సార్వభౌముణ్ణి తూలనాడారు

పత్రాలు చేయనివారు వెంటనే తమ ఉద్యోగాలనుంచి తొలగింపబడ్డారు. ఆ ఆజ్ఞనుగాని, సార్వభౌముణ్ణి గాని తూలనాడినవారు కారాగారానికి పంపబడ్డారు. కొందరు హత్య గావింపబడ్డారు.

సైన్యంలో ఏ విధంగా అందరిచేత 'శివాత్పరతరం నాస్తి' అనే పత్రంమీద సంతకాలు చేయించారో ఆ విధంగానే ఇతర ప్రభుత్వ శాఖలలో ఉన్న ఉద్యోగులచేతకూడా చేయించారు. ఎదిరించిన వారి నా విధంగానే శిక్షించారు.

చోళరాజ్య మంతటా ప్రభుత్వోద్యోగుల వద్ద ఈ సంతకాల సేకరణ చేయబడింది. ప్రతిచోట ఎవరో కొందరు తప్ప తక్కినవా రందరూ తమ మతాన్ని మార్చుకొనడాని కంగీకరించారు. శ్రీరంగం, చిదంబరంలలో మాత్రమే కులోత్తుంగుని ఆజ్ఞకు హెచ్చు ప్రతిఘటన వచ్చింది. అచ్చటే దారుణ హింసాకాండకూడ జరిగింది.

రామానుజుడు శ్రీరంగానికి వచ్చేసరికి చోళరాజ్యమంతా అట్టుడికినట్టుడికి పోతున్నది. ఎచ్చటచూచినా నిరంకుశత్వం తాండవిస్తున్నది. శైవులు గానివారందరూ భయపడిపోతున్నారు.

రామానుజుడు శ్రీరంగం చేరుకుంటూనే చాలమంది వైష్ణవులతనివద్దకు వచ్చారు. కులోత్తుంగుడు గావిస్తున్న ఘాతుకచర్యల్ని గూర్చి వివరించారు. వైష్ణవులు పడుతున్న బాధల్నిగూర్చి చెప్పి కన్నీరు నించారు.

రామానుజుడు చిరునవ్వు నవ్వాడు.

'మనం పరీక్షింపబడుతున్నాము. మన విశ్వాసాలు, మన సిద్ధాంతాలు, మన మతం పరీక్షింపబడుతున్నవి. వైష్ణవులీ కఠినపరీక్షకు నిలబడగలరనే నా నమ్మకం.' అన్నాడు.

'దీనికి ప్రతిక్రియలేదా? దీనికి ప్రతిఘటన లేదా? ఈ ఘాతుక చర్యలనుండి రక్షణ లేదా?' అని ప్రశ్నించారు వైష్ణవులు.

'ప్రతిఘటన ఉంటుంది. ఉండి తీరాలి. ప్రతివారు ఈ నిరంకుశ విధానాన్ని ఎదిరించాలి. ఎంత త్యాగానికైనా పూనుకోవాలి. వేరే మార్గమేముంది?' అన్నాడు రామానుజుడు

'అందరూ జారిపోతున్నారు. ఏవేళ ఏమి జరుగుతుందో చెప్పలేకున్నారు.'

'అవునుమరి. ఇది ఉద్యోగులతోనే ఆగదు. ప్రజలకుగూడ యీ ఉపద్రవం వస్తుంది. వైష్ణవుడైన ప్రతివ్యక్తినీ ఆ పత్రంలో సంతకం పెట్టమంటారు. పెట్టకపోతే హింసిస్తారు.' అన్నాడు రామానుజుడు.

'అయితే దారి?'

'భగవంతుని మీది విశ్వాసంతో ధైర్యంగా ఉండడమే దారి. అంతకంటె గత్యంతరం లేదు. ప్రపంచాన్నే గాక సూర్యచంద్రుల్ని గూడ జయించిన హిరణ్యకశిపుని కాలంలో ప్రహ్లాదు డెలా ధైర్యం వహించి నిలబడ్డాడో, కంసుని కాలంలో దేవకీ వసుదేవులు, తక్కిన యాదవులు ఎలా నిలబడ్డారో, ఆ విధంగానే వైష్ణవులు గూడ యీనాడు నిలబడాలి. అప్పుడే ఆ విష్ణుమూర్తి మనల నాదుకొంటాడు. పిరికివారి నెవరూ రక్షించలేరు. కడకు దేవుడుగూడ రక్షించలేడు.' అన్నాడు రామానుజుడు.

అతని ముఖంలో విచారం తాండవమాడింది. అతడు తన్ను ప్రశ్నించిన వైష్ణవులకు ధైర్యం చెప్పడానికా మాట లంటున్నాడే గాని, వారు పడుతున్న బాధల్ని తలచుకొని క్రుంగిపోతున్నాడు. అతనికిగూడ మార్గం కనిపించడం లేదు.

రామానుజుడన్నట్లే కులోత్తుంగుడు ప్రజలందరిచేత 'శివాత్పరతరం నాస్తి' అనే పత్రంమీద సంతకాలు చేయించడానికి ప్రారంభించాడు. ఎంతో అనుభవం కలిగి, ఎన్నో యుద్ధాలలో ప్రాణాలనుగూడ తెగించి పోరాడిన సైనికాధికారులే లొంగిపోయి మతం మార్చుకొన్నప్పుడు సామాన్య ప్రజలెలా నిలవగలరు?

శైవులందరూ ఆ పత్రంమీద సంతోషంతో సంతకం గావించారు. వైష్ణవులు కన్నీరు గారుస్తూ సంతకం గావించారు. భటులు వచ్చినప్పుడు కొందరు వైష్ణవులు దాక్కొన్నారు గాని శైవులు వారిని పట్టియిచ్చారు. అందువల్ల వైష్ణవులకు వేరొక మార్గం లేక పోయింది.

పత్రంమీద చేవ్రాలు చేయని వైష్ణవులను మొదట శిక్షించలేదు. ఆలోచించుకొనడానికి ఒకవారం గడువు ఇవ్వబడింది. ఆ తరువాత బలవంతంగా వారి సంతకాలు సేకరించబడినవి. ఇష్టపడనివారి నామాలు తుడిచివేయబడినవి. వారి లలాటాలలో బలవంతంగా విభూది రుద్దబడింది. ఆ బాధలకు తట్టుకోలేక చాలమంది వెంటనే చేవ్రాళ్లు గావించారు.

కాంచీపురంలోనే ఒక వైష్ణవుడున్నాడు. అతడు చాల సామర్థ్యం కలవాడు. రాజభటు లతనివద్దకు వచ్చినప్పు డతడు సంతకం పెట్టడానికిముందు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పమన్నాడు.

ప్రశ్న యేమిటో చెప్పమని రాజభటు లడిగారు.

అతనిపేరు నంబి.

'దేనికీ సంతకాలు సేకరిస్తున్నారో చెబుతారా?' ప్రశ్నించాడు నంబి.

'అందరినీ శైవులుగా మార్చడానికి' అన్నారు ఆ భటులు.

'సంతకం పెట్టిన ప్రతివారూ శైవులవుతారా?' అని మరల ప్రశ్నించాడు నంబి.

'ఎందుకు కారు?' అని అడిగారు భటులు.

'మీరుగాని మీ రాజుగాని సంతకాలైతే చేయించగలరు గాని, మనస్సు మార్చగలరా?' అన్నా డతను.

ఆ మాటకు రాజభటులకు కోపం వచ్చింది. వారు నంబిని పట్టుకొని కొట్టారు.

'కొట్టినంత మాత్రాన మనస్సు మారుతుందా?' అడిగా డతడు. అతణ్ణి వా రింకా గట్టిగా కొట్టారు. తన్నారు. కత్తులతో పొడిచారు. అతని శరీరంనుంచి రక్తం కారింది.

'మీ రేమైనా చేయండి. కాని నా మనస్సును మార్చలేరు.' అన్నా డతడు రక్తం చిందుతుండగానే.

రాజభటు లతణ్ణి ఎముకలు విరిగేటట్లు కొట్టారు. కాని అతడు లొంగలేదు. అందువల్ల వా రతణ్ణి పొడిచారు. 'హా రామానుజా' అంటూ అతడు ప్రాణాలు విడిచాడు.

దారిలో వెడుతున్న వారందరూ ఆ దృశ్యాన్ని చూచి భయ కంపితు లయ్యారు. ఇ దేదో ప్రత్యేకంగా జరిగిన సంఘటన గాదు. ఈ విధంగా ఈ చోళరాజ్య మంతటా యీ హింసాకాండ జరుప బడింది. ప్రతిచోట ఎవరో కొందరు కులోత్తుంగుని భటుల్ని ప్రతిఘ టించారు. తమ మతం కోసం తమ ప్రాణాలను గూడ అర్పించారు.

ఈ వార్తలన్నీ గాకపోయినప్పటికీ కొన్నైనా రామానుజుని కందుతూనే వచ్చాయి. అతను వాటిని విని చాల వ్యగ్రుడయ్యాడు.

శ్రీరంగంలోని రాజభటులు వైష్ణవుల నందరినీ నిర్బం ధించారు గాని రామానుజు డున్న ఆశ్రమానికి వెళ్ళలేదు. ఆ మహా త్ముణ్ణి సమీపించాలంటే వారికి ధైర్యం చాలలేదు. కాని వారు శ్రీరంగ నగరంలో చాలమంది వైష్ణవుల్ని వధించారు. ఆ పట్ట ణాన్ని అంతటినీ బీభత్సం గావించారు. ఆ హింసాకాండకు తట్టుకో లేక చాలమంది ఆ పట్టణాన్ని వీడి వెళ్ళారు. పల్లెలలో తలలు దాచు కొన్నారు. కొంద రడవులకు వెళ్ళిపోయారు. మరికొందరు రామా నుజుని ఆశ్రమంలో తల దాచుకొన్నారు.

సంతకాల సేకరణ మొదలయినప్పుడు ప్రతిఘటన అంతగా లేదు. కాని ఆ తరువాత ఆ ప్రతిఘటన చాల పెరిగింది. 'ప్రాణా

లైనా వదలండి. కాని మీ విశ్వాసాలను వదలకండి. కులోత్తుంగుని క్రూర దమనవిధానాన్ని ఎదిరించండి,' అని రామానుజుడు వైష్ణవులకు చెప్పాడు. త్వరలోనే ఆ వార్త నలుమూలలకూ అందింది. అందువల్ల ప్రతిఘటనోద్యమం నానాటికీ పెరుగజొచ్చింది.

'వైష్ణవులు సంతకాలు చేయమంటున్నారని చాల ప్రాంతాల నుండి వార్తలు వస్తున్నాయి. కారణమేమిటో మీ రూహించారా?' కులోత్తుంగు డడిగాడు ప్రధానిని.

'ఊహించ నవసరంలేదు. వేగులవారివల్ల తెలుసుకున్నాను.' అన్నాడు త్రిపురాంతకుడు.

'ఏమిటి కారణం?'

'వైష్ణవు లందరూ కుట్ర గావిస్తున్నారు.'

'ఎలా తెలిసింది?'

'చారులు చెబుతున్నారు. మొదట మనమింత గట్టిగా, పట్టుదలగా ఉంటామని వైష్ణవు లనుకోలేదు. కాని రానురాను మన ఉద్దేశం వారి కర్థమయింది. అందువల్ల వారు కలిసి మాట్లాడుకొని ఎదిరించడానికి పూనుకొంటున్నారు. అంతే గాక రామానుజుడు వారి నెదురు తిప్పుతున్నాడు.'

'ఓహో, ఆలాగా, ఇప్పుడు తెలిసింది. అతడు శ్రీరంగానికి వచ్చాడు గదూ?'

'వచ్చాడు. అందువల్లనే ఈ సంఘటన. లేకుంటే వైష్ణవు లంతగా తమ ఆజ్ఞను ధిక్కరించేవారు గాదు.'

'అతణ్ణి తుదముట్టిస్తే?'

'అలా చేస్తే వైష్ణవం అంతటితో అణగారిపోతుంది.'

'అయితే అతణ్ణి బంధించమని శ్రీరంగంలో ఉన్న మన భటుల నాదేశించండి.'

'వారు చాలరు. పైగా వారు భయపడవచ్చు. వైష్ణవుల కందరికీ పెద్ద రామానుజుడు. అతడంటే వారి కెంతో భక్తి ఉన్నది. అతణ్ణి వారు దైవాంశ సంభూతుడుగా భావిస్తారు. కనుక అతణ్ణి బంధించినప్పు డచ్చట తిరుగుబాటు రావచ్చు. సైన్యం లేకపోతే చాల ప్రమాద మేర్పడుతుంది. అంతేగాక అతణ్ణి నిర్బంధించాలంటే ముందుగా రాష్ట్ర మంతటా తగిన బందోబస్తు గావించాలి. ఇప్పటికే కోపంగా ఉన్న వైష్ణవులు హఠాత్తుగా విజృంభిస్తే కష్టం. ఆ పరి స్థితిని మనం అదుపులో పెట్టగలిగి ఉండాలి.' అన్నాడు త్రిపు రాంతకుడు.

'మంచి మాటే అన్నారు. అయితే సైన్యాన్ని పంపుదామా?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'పంపడం మంచిది.'

'ఎవరి నాయకత్వాన పంపుదాము?'

'మీరే ఆలోచించండి.'

'నా కెవరూ తోచలేదు. అచ్చటికి వెళ్ళే సైనికాధికారి పచ్చి శైవుడుగా వుండాలి. విషమ పరిస్థితు లేర్పడితే నిర్దాక్షిణ్యంగా ఎదు ర్కోవాలి.' ఆలోచింపసాగాడు కులోత్తుంగుడు.

'అవును. నేనూ అదే ఆలోచిస్తున్నాను. కాంచీపురంలో శాంతి భద్రతల్ని పరిరక్షిస్తున్న పశుపతిని పంపితే మంచిదేమో ఆలోచించండి.' త్రిపురాంతకు డన్నాడు.

'ఆఁ, అతడైతే బాగుగానే ఉంటుంది——అవును. అతడే దీనికి తగినవాడు. ఎవరైనా ఖాతరు చేయడు.'

'రామానుజుని చూచి లొంగిపోకుండా గూడ వుండగలడు.'

'సరే. అతణ్ణే పంపుదాము. వీలయినంత త్వరలో రామాను జుణ్ణి ఇచ్చటికి తీసుకొని రమ్మని చెప్పాలి.' అన్నాడు కులోత్తుం గుడు, త్రిపురాంతకుణ్ణి చూస్తూ.

'అలాగే. మరేమైనా మాట్లాడవలసి ఉన్నదా?' ప్రశ్నించాడు త్రిపురాంతకుడు.

'మ రేమున్నది? ఇదే జాగ్రత్తగా వుండవలసిన సమయం. కొంతకాలం మనం వారి ప్రతిఘటన నెదుర్కొన గలిగితే ఆ తరువాత వారే లొంగిపోతారు. వారెంత కాలమని ప్రభుత్వాన్ని ఎదిరించ గలరు?' కులోత్తుంగుడు నవ్వాడు.

త్రిపురాంతకుడు గూడ చిరునవ్వు నవ్వాడు.

'మీ రన్నట్లు ముందే అన్ని జాగ్రత్తలూ తీసుకోవడం మంచిది. నారనదేవుణ్ణి పిలిపించి ఆ విషయాలను చర్చించండి.' అన్నాడు కులోత్తుంగుడు.

'అతడు వెనుకాడుతాడు. వైష్ణవంమీద అతనికి మక్కువ లేదుగాని వారిని హింపించడం అతని కిష్టమున్నట్లు లేదు. అందుకే ఈ ప్రతిఘటన యిలా సాగుతున్నది. లేకుంటే ఎప్పుడో వైష్ణవుల నందరినీ అణచివేసి వుండవలసింది.' అన్నాడు త్రిపురాంతకుడు.

'అతడు చాల మెత్తనివాడు. యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు గూడ సాధ్యమయినంతవరకు దానిని నివారించడానికి యత్నిస్తాడు. ఆలసించడం మంచి దంటాడు. అది మనకు గిట్టదు. కాని అతడు చాల మంచివాడు. మొదట వెనుకాడినట్లు కనబడినప్పటికీ, పూనుకొన్న తరువాత వెనుదీయడు. నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తాడు.'

'అదీ నిజమే.' అన్నాడు త్రిపురాంతకుడు.

'నారనదేవునితో మాట్లాడిన తరువాత మీ నిర్ణయాలను నాకు తెలియజేయండి. శ్రీరంగానికి మాత్రం పశుపతినే పంపండి. వెళ్ళి రండి.' అన్నాడు కులోత్తుంగుడు. ప్రధాని నమస్కరించి సెలవు దీసుకొన్నాడు.

# 13

## 'ద్రోణమస్తి ఇతఃపరం'

కులోత్తుంగుని సైన్యం శ్రీరంగాన్ని చేరుకొన్నది. వెంటనే పశుపతి ఆ సైన్యాన్ని రెండు భాగాలు గావించాడు. పెద్దభాగాన్ని పట్టణంలోకి పంపి బందోబస్తు చేయమన్నాడు. పురవీథుల్లో ఎవరినీ తిరగనీయ వద్దన్నాడు. తిరుగుబాటు చేసినవారిని బంధించమన్నాడు. తాను చెప్పి పంపేవరకు ఆ సైన్యాన్ని నగరంవీడి రావద్దన్నాడు. సైన్యంలో తక్కిన భాగాన్ని తీసుకొని తానే స్వయంగా రామానుజుడున్న వనంవద్దకు వెళ్ళి దానిచుట్టూ సైనికుల్ని కావలా ఉంచాడు.

మహాపూర్ణుడు నగరంలోకి వెళ్ళాలని వస్తున్నాడు. ద్వారం వద్ద సైనికులు వచ్చి నిలబడుతున్నట్లు అతనికి కనిపించింది. అచ్చటే నిలబడి చూచాడు. ఎవరో ఒకరు వారి నచ్చటచ్చట ఉండమని ఆజ్ఞాపిస్తున్నాడు. వా రతడు చెప్పినట్లు చేస్తున్నారు. దారికడ్డంగా సైనికులు బారులుతీర్చి నిలబడ్డారు. వారిని చూస్తూనే ఏదో ప్రమాదం ముంచుకొచ్చిం దనుకొన్నాడు మహాపూర్ణుడు.

మహాపూర్ణుడు వృద్ధుడు. రామానుజుని గురువు. అప్పుడప్పుడు అతడు వెళ్ళి రామానుజునితో మాట్లాడి వస్తుంటాడు. ఆ దినంగూడ అలాగే వెళ్ళి అతనితో మాట్లాడి నగరానికి వస్తున్నాడు. ఇంతలో సైన్యం వచ్చి అచ్చట నిలిచింది.

మహాపూర్ణుడు వనద్వారాన్ని సమీపించాడు.

'ఎవరునీవు?' ప్రశ్నించాడు పశుపతి.

'మహాపూర్ణుణ్ణి' అన్నా డతడు.

'రామానుజు డున్నాడా?' గద్దించినట్లుగా అడిగాడు పశుపతి.

మహాపూర్ణుడు పశుపతిని నిదానించి చూచాడు. అతడు చాల క్రూరంగా ఉన్నాడు. అతనికళ్లు చాల చిన్నవిగాను, అతని ముఖం భయంకరంగాను ఉన్నది.

పశుపతిప్రశ్నకు మహాపూర్ణుడు వెంటనే సమాధానం చెప్ప లేకపోయాడు. ఉన్నాడంటే ఏమి ప్రమాదం వస్తుందో నని భయ పడ్డాడు. కాని చెప్పకపోతే మరింత ప్రమాదంగూడ కలగవచ్చు నను కున్నాడు.

'ఏమి, మాట్లాడవు?' గద్దించాడు పశుపతి.

'ఉన్నాడు.' అన్నాడు మహాపూర్ణుడు.

'ఉంటే నేను రమ్మంటానని చెప్పు.' అన్నాడు పశుపతి.

'మీ రెవరు?' ప్రశ్నించాడు మహాపూర్ణుడు.

'నే నెవరో తెలియదా? కులోత్తుంగుని సేనానిని.' అతడు చిరునవ్వు నవ్వాడు. అతనికళ్ళు క్రూరంగా మెరిశాయి.

'రామానుజునితో మీకేమి పని?'

మరల ప్రశ్నించాడు మహాపూర్ణుడు.

'ఆ ప్రశ్నలన్నీ అవసరంలేదు. వెంటనే అతణ్ణి పిలుచుకొని రా.' అన్నాడు పశుపతి.

'మేము వెళ్ళి తీసుకొని వస్తాము.' అన్నారు సైనికులు.

'వద్దు. మీ రెందుకు? అతడే రానీ.' అన్నాడు పశుపతి గట్టిగా.

మహాపూర్ణుడు ఆలోచనలో పడ్డాడు. వెనుదిరిగి తిన్నగా వెళ్ళాడు.

కులోత్తుంగుడు సైన్యాన్ని పంపాడు. రామానుజుణ్ణి బంధించి తీసుకొని వెడుతారేమో. వైష్ణవాని కెంత ఉపద్రవం వచ్చింది! రామానుజుడు వెడితే యామునాచార్యుని కలల్ని నిజం చేయగల వా రెవ్వరు? వైష్ణవాన్ని నిలబెట్టగల వా రెవ్వరు? తా మందరూ అతని మీదనే ఆశలు పెట్టుకొన్నారు. తమ కిప్పుడు వృద్ధాప్య మొచ్చింది!

ఇక తా మేమీ చేయలేరు. ఏమున్నా వైష్ణవమత వ్యాప్తి కోసం రామానుజుని మీదనే ఆధారపడాలి.

రామానుజుడు విశిష్టాద్వైత తత్వాన్ని రూపొందించాడు. ఉద్దండులైన ఇతర మతాచార్యుల్ని ఓడించాడు. యజ్ఞమూర్తిలాటి వారిని తనకు శిష్యుల్ని గావించుకొన్నాడు. తమ హృదయాలను పూర్తిగా దోచుకొన్నాడు. అలాటి వా డేమవుతాడో, కులోత్తుంగు డత ణ్ణేమిచేస్తాడో !

భయపడ్డాడు మహాపూర్ణుడు.

ఆ వృద్ధాచార్యుడు ఆశ్రమం వద్దకు వెళ్ళాడు. అది వెలుపలికి కనబడదు. దానిచుట్టూ దట్టంగా చెట్లున్నాయి. ఆశ్రమంలో కూరేశు డేదో వ్రాసుకొంటున్నాడు.

మహాపూర్ణుడు త్వరగా వచ్చి 'రామానుజు డెక్కడ' అని అడిగాడు.

'ఇప్పుడే స్నానానికి వెళ్ళాడు.' అంటూ కూరేశుడు తలెత్తి చూచాడు.

మహాపూర్ణుడు చాల కంగారుగా ఉన్నాడు.

'మహా ప్రమాదం వచ్చి నెత్తిన బడింది. రామానుజుణ్ణి బంధించి తీసుకొని వెళ్ళడానికి కులోత్తుంగుడు తన సైన్యాన్ని పంపాడు.

'ఏదీ ఆ సైన్యం ?' అంటూ ఆదుర్దాతో అడిగాడు కూరేశుడు.

'నీవు నీవ్రాతలో లీనమై ఉన్నావు. అదో వనంచుట్టూ నిల బడి ఉంది' అంటూ అటు చూపాడు మహాపూర్ణుడు. కూరేశుడు చుట్టూ చూచాడు. చెట్లు దట్టంగా ఉండడంవల్ల సరిగా కనబడలేదు. కొంతదవ్వు వెళ్ళి చూచాడు. మహాపూర్ణుడు చెప్పింది నిజమే. వనంచుట్టూ సైనికులు కాపలా ఉన్నారు.

'చోళసేనాని రామానుజుణ్ణి పిలుచుకొని రమ్మన్నాడు నన్ను.' అన్నాడు మహాపూర్ణుడు.

'నీతో ఎందుకు చెప్పాడు ?'

'నేను నగరంలోకి వెడుతూ అతనికంట బడ్డాను. నన్ను వెళ్ళి అతణ్ణి తీసుకొని రమ్మన్నాడు.'

'నిజంగా ప్రమాదమే వచ్చింది. ఇప్పు డాలపించి లాభంలేదు. ఏమాత్రం ఆలస్యం గావించినప్పటికీ ఆ మహాత్మ్మణ్ణి మన చేతులారా పట్టి యిచ్చిన ట్లవుతుంది. ఏమిచేయాలో తోచడంలేదు.' అని అటూ యిటూ తిరిగాడు.

ఆలోగా అతనికొక ఆలోచన తట్టింది. 'ఉండండి వస్తాను.' అంటూ అతడు లోనికి వెళ్లి కొన్ని నిమిషాలలోగా వెలుపలికి వచ్చాడు.

మహాపూర్ణు డతణ్ణి చూచి 'ప్రమాదం ముంచుకొచ్చింది.' అని 'నేను నిన్ను రామానుజుడే అనుకొన్నాను. నిజంగా నీవు అలాగే ఉన్నావు' అన్నాడు.

'గట్టిగా మాట్లాడకండి. ఎవరైనా వింటారు. వారు స్నానం చేస్తున్నారు. నేను వారి దుస్తుల్ని ధరించి వచ్చాను. వెడదాం పదండి' అన్నాడు.

'రామానుజునికి చెప్పకుండానే?' అన్నాడు మహాపూర్ణుడు.

'చెబితే వారు తానే వస్తానంటారు. అందువల్లనే నేను వారి కీ విషయం చెప్పలేదు. చోళసేనాని నేనే రామానుజుడని అను కోనీండి. అపుడతడు నన్నే కాంచీపురానికి తీసుకొని వెడుతాడు. మీ రుండి గురువుగారిని తప్పించండి' అంటూ ముందుకు సాగాడు కూరేశుడు.

అతని ఇంగితజ్ఞానానికి, గురుభక్తికి, ధైర్యసాహసాలకు మహాపూర్ణు డాశ్చర్యపడ్డాడు. మరు మాటాడకుండా అతడు కూరే శునితో వెళ్ళసాగాడు.

మహాపూర్ణుడు వెళ్లి కొద్దిసేపే అయినా ఎంతోకాలం గడచిన ట్లనిపించింది పశుపతికి.

'ఏమీ, ముసలిబడు గింకా రాలేదు? రామానుజుణ్ణి తప్పించ డాని కేమైనా ప్రయత్నిస్తున్నాడా?' అన్నాడు సేనాని.

'అలా చేయలేడు లెండి. చుట్టూ మన సేన కాపలా ఉంది గదా ?' అన్నాడు సేనాని.

అంతలో మహాపూర్ణుడు, మరొక వ్యక్తి వస్తున్నట్లు తోచింది. ఆ వృక్షాల సందులలోంచి.

'వస్తున్నారు' అన్నాడు పశుపతి.

సైనికులందరూ ఆ వైపే చూస్తూ జాగ్రత్తగా నిలుచున్నారు. మహాపూరుడు కూరేశునితో గూడ పశుపతి వద్దకు వచ్చాడు.

మహాపూర్ణుడు, కూరేశుడు దగ్గరకు రాగానే 'నీవేనా రామానుజుడివి ?' అని ప్రశ్నించాడు పశుపతి. అతని కంఠస్వరం చాల కర్కశంగా ఉంది.

'అవును.' అన్నాడు కూరేశుడు.

'నీవు మాతో రావాలి.' అన్నాడు సేనాని.

'ఎచ్చటికి ?' ప్రశ్నించాడు కూరేశుడు.

'కాంచీపురానికి.' అన్నాడు పశుపతి.

'ఎందుకు ?' మరలా అడిగాడు కూరేశుడు.

'అది మా రాజుగారి ఆజ్ఞ.'

కూరేశుడు చిరునవ్వు నవ్వుతూ, 'సన్యాసులతో మీ రాజు కేమి పని ?' అన్నాడు కూరేశుడు.

'ఆ విషయం మాకు తెలియదు. నడవండి.' అన్నాడు పశుపతి కఠినంగా.

'వస్తాను పదండి. ఎచ్చటికైతేనేమి ? అన్ని చోట్లా ఆ విష్ణుమూర్తే ఉన్నాడు.' అన్నాడు కూరేశుడు నడుస్తూ.

'మాట్లాడకుండా నడు' అన్నాడు పశుపతి.

'అలాగే' అంటూ నడవసాగాడు కూరేశుడు.

మహాపూర్ణు డచ్చటే నిలబడ్డాడు. 'నీవుకూడా రావాలి. తెలిసిందా ?' అన్నాడు పశుపతి.

'ఆఁ. వస్తాను. రావడానికి నా కేలాటి అభ్యంతరం లేదు' అన్నాడు మహాపూర్ణుడు.

'నడు మరి. ఆలాగే నిలబడతా వెందుకు ?' అని గద్దించాడు పశుపతి.

మహాపూర్ణుడుగూడ వెళ్ళసాగాడు. సైనికులు వారిద్దరినీ చుట్టి ముందుకు సాగారు.

రెండుమైళ్లు వెళ్ళిన తరువాత కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి అశ్వాలమీది కెక్కించారు. వారిచుట్టూ అశ్వికులు నిలబడి వారితో వెళ్ళసాగారు.

ఇక రామానుజుణ్ణి బంధించేపని పూర్తి అయింది గనుక నగరంలో ఉన్న సైన్యాన్ని తిరిగి రమ్మని ఒక అశ్వికుణ్ణి పంపి తాను తనతో ఉన్న సైన్యంతో ముందుకు వెళ్ళాడు పశుపతి.

కూరేశుడు మహాపూర్ణుడు దారిలో మాట్లాడు కొనడానికి వీలు లేకపోయింది. దారిపొడుగునా సైనికులు వారిని గమనిస్తూనే వచ్చారు. రాత్రుళ్ళలో వారు తప్పించుకొంటారేమోనని వారి నొక గూడారంలో పెట్టి చుట్టూ కావలా కాశారు. అప్పుడుగూడ వారు మాట్లాడడానికి వీలుగాక పోయింది.

కూరేశుడుగాని, మహాపూర్ణుడుగాని భయపడలేదు. వారెంతో ఉత్సాహంతోనే కాంచీపురానికి వెళ్ళసాగారు.

కాంచీపురం చేరగానే కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి కారాగారంలో ఉంచారు సైనికులు. రామానుజుణ్ణి తీసుకొని వచ్చామని పశుపతి త్రిపురాంతకునికి తెలియబరచాడు. ఆ విషయం అతడు కులోత్తుంగునికి తెలియజేశాడు. అప్పుడతడు ఉప్పొంగి పోయాడు.

విశిష్టాద్వైత మత సిద్ధాంత కర్తయైన రామానుజుణ్ణి తీసుకొని వచ్చాడన్న వార్త తెలియగానే కాంచీపురంలో గొప్ప సంచలనం బయలుదేరింది. రామానుజుణ్ణి రాజేమిచేస్తాడో నని వైష్ణవు లందరూ భయపడ్డారు. తమ మతానికి అంత్యసమయం వచ్చిందేమో నని జడిసిపోయారు. కాని శైవులు మాత్రం ఆనందించారు. రాజుగారి ఆస్థానంలో అతడేమి చెబుతాడో చూదామని ఆదుర్దా పడారు.

కారాగారంలో మాట్లాడుకోవడానికి మహాపూర్ణునికి, కూరేశు నికి వీలుగలిగింది.

'మనం మరణించడానికి సిద్ధంగా ఉండాలి.' అన్నాడు కూరేశుడు.

'సిద్ధంగానే ఉన్నాముగదా ?' అన్నాడు మహాపూర్ణుడు.

'ఈ రాజు చాల దుష్టుడుగా ఉన్నాడు. ఇంత దుర్మార్గుణ్ణి ఇదివర కెన్నడూ చూడలేదు.' అన్నాడు కూరేశుడు.

'ఇంతకూ రామానుజు డేమయ్యాడో !' సందేహాన్ని వెలి బుచ్చాడు మహాపూర్ణుడు.

'వారికేమీ భయంలేదు. పట్టుబడి ఉంటే ఆనాడే పట్టుబడి ఉండాలి. ఆ ఉపద్రవం తప్పిపోయింది' అన్నాడు కూరేశుడు.

'మనం వచ్చిన తరువాత అతనున్న విషయం అచ్చట ఉన్న వారికి తెలిసిందేమో.'

'మీరు భయపడకండి. ప్రమాదం మనకేగాని వారికి లేదని నా మనస్సు దృఢంగా చెబుతున్నది.' అన్నాడు కూరేశుడు.

'ఆ పరాత్పరుని దయ. ఆ విష్ణుమూర్తే అతణ్ణి కాపాడుతాడు. వైష్ణవం రక్షించబడుగాక. రామానుజుడు చిరంజీవి అగుగాక' అంటూ మహాపూర్ణుడు కళ్ళుమూసుకొని రామానుజుణ్ణి రక్షించమని దేవుణ్ణి ప్రార్థించాడు.

తెల్లవారింది. మొదటిఝాము గడచింది. రెండవఝాము దాటింది. సైనికులు వచ్చి కారాగారాన్ని తెరిచారు. కూరేశుణ్ణి, మహా పూర్ణుణ్ణి తీసుకొని రాజ ప్రాసాదానికి వెళ్ళారు. వారు వెళ్ళిన త్రోవలో ప్రజలందరూ గుంపులుగూడి పరికించసాగారు. కూరేశుణ్ణి రామానుజుడనుకొని అతనిపైపే తిలకించసాగారు.

'అతడిచ్చటివాడే. ఇచ్చటే చాల ఏండ్లున్నాడు. శ్రీ పెరంబు దూర్లోనే అతడు జన్మించింది.' అంటూ ప్రజలు చెప్పుకోసాగారు. అచ్చట నిలబడిన వారిలో వైష్ణవులుగూడ ఉన్నారు. కాని వారిలో ఒకరుగూడ ఊర్ధ్వ పుండ్రాలు ధరించలేదు. అందరూ విభూతిరేకల్ని

ధరించి ఉన్నారు. కాని కూరేశుణ్ణి చూచి రామానుజుడనుకొని కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నారు. ఎవరైనా చూస్తారేమోనని భయపడి ఆ అశ్రు వుల్ని కళ్ళలోనే ఒత్తిపట్టుకొన్నాడు.

కూరేశునికి ఆ దృశ్యం చాల ఆశ్చర్యాన్ని కలిగించింది. నామాలు పెట్టుకొన్న వారొకరూ గూడ ఆ జనసమూహంలో అతనికి కనబడలేదు. ఎచ్చటజూచినా విభూతి రేఖలే ప్రత్యక్షమయ్యాయి. ఎచ్చట పరికించినా శైవమే రాజ్యమేలుతున్న ట్లనిపించింది.

రాజసభ చాల అందంగా అలంకరించబడివుంది. అర్హతలకు తగినట్లు అందరికీ ఆసనాలు వేయబడి ఉన్నవి. సభ సామంతుల తోను, అధికార్లతోను, పుర ప్రముఖులతోను కిటకిటలాడిపోతున్నది. రాజసభముందు అసంఖ్యాకమైన ప్రజాసమూహం మూగి ఏమిజరుగు తుందో వినాలని కాచుకొని కూచున్నది.

సైనికులు కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి సభాస్థలి మధ్యలో సింహాసనాని కెదురుగా, కొంతదగ్గరగా నిలబెట్టారు.

కూరేశుడు అచ్చట కూర్చొని ఉన్నవారి నందరినీ తిలకింప సాగాడు. మహాపూర్ణుడు మౌనంగా నిలబడి ఏదో ఆలోచింప సాగాడు.

ఇంతలో వందిమాగధులు రాజుకు బహుపరాక్ చెబుతూ, అతని బిరుదులు చదువుతూ సభాస్థలిలో ప్రవేశించారు. వారివెనుక సార్వభౌము డరుదెంచాడు. అప్పుడు సభాసదులందరు గౌరవపూర్వ కంగా లేచి నిలుచున్నారు. సార్వభౌమునికి నమస్కరించారు. కాని కూరేశుడుగాని మహాపూర్ణుడుగాని ఆ రాజుకు నమస్కరించలేదు. కులోత్తుంగుడు దానిని గమనించాడు. వచ్చి సింహాసనంమీద ఆసీను డయ్యాడు.

ఇద్దరు పురుషులు సార్వభౌముని కిరుప్రక్కల వింజామరలు వేయసాగారు.

కూరేశుడు రాజును పరీక్షగా చూశాడు. కులోత్తుంగుడు చాల బలిష్ఠంగా ఉన్నాడు, చాల క్రూరంగా ఉన్నాడు. అతని ప్రక్కనే ప్రధానియైన త్రిపురాంతకుడుగూడ ఆసీనుడయి ఉన్నాడు.

సభాస్థలికి పైగా రాజాంతఃపుర కాంతలందరూ కూర్చొని ఉన్నారు. అచ్చట కులోత్తుంగుని సతీమణి మధురాంతకిగూడ ఉన్నది. కాని ఒక సన్నని తెర వారి ముందుండడంవల్ల వా రెవ్వరూ సభాసదులకు కనబడలేదు. కాని వారికి సభలో ఉన్న వా రెల్లరూ కనబడుతున్నారు.

గంభీరవదనులై వున్న కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి అంతఃపుర కాంతలు స్పష్టంగా చూడగలుగుతున్నారు. కూరేశుణ్ణి వారు రామానుజు డనుకొంటున్నారు.

కులోత్తుంగుడు కూరేశుణ్ణి చూచి, 'నీవేనా రామానుజుడివి?' అని ప్రశ్నించాడు.

'అవును నేనే' అన్నాడు కూరేశుడు.

'అత డెవడు?' మహాపూర్ణుణ్ణి చూపి అడిగాడు.

'మా గురువర్యులైన మహాపూర్ణులు.' అన్నాడు కూరేశుడు.

'నీవేనా వైష్ణవమతాచార్యుడివి?'

కూరేశుడు మాట్లాడలేదు.

'ఎందుకు మాట్లాడవు? శైవతత్వవేత్తల్ని ఓడించి, శైవులనందరినీ వైష్ణవులుగా మార్చింది నీవేనా? ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'అవును నేనే.' అన్నాడు కూరేశుడు. అతని స్వరం అతి గంభీరంగా ఉంది.

'శివాలయాల నన్నిటినీ విష్ణ్వాలయాలుగా మార్చింది గూడ నీవేనా?'

గద్దించినట్లుగా ప్రశ్నించాడు కులోత్తుంగుడు. సార్వభౌమునికి కోపం వచ్చిందని గుర్తించారు సభాసదులు.

'నేనే.' అన్నాడు చిరునవ్వుతో కూరేశుడు.

'ఎందు కలా చేశావు?'

'నీలాగా నేను ప్రజలనుగాని, మరెవరినిగాని నిర్బంధించి

శైవులుగా మార్చలేదు. వాదించి, మెప్పించి, ఒప్పించి, శైవుల హృదయాలను మార్చి వారిని వైష్ణవుల్ని గావించాను.' అన్నాడు కూరేశుడు.

కులోత్తుంగునికి చాల కోపం వచ్చింది.

'ఏమన్నావు?' గద్దించినట్లుగా ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'ఏమన్నాను? సత్యాన్ని వచించాను.'

'నీ వెవరిముందు మాట్లాడుతున్నావో తెలుసా?'

'ఎందుకు తెలియదు? కులోత్తుంగ చోళ సార్వభౌముని యెదుట మాట్లాడుతున్నా నన్న విషయం నాకు తెలుసు.' అన్నాడు కూరేశుడు మందహాసం చేస్తూ. ఆ మందహాసం కులోత్తుంగుని కోపాన్ని మరింత హెచ్చించింది.

'చోళరాజ్యంలో శైవం తప్ప మరే మతంగూడ వుండగూడదని ప్రభుత్వం ప్రకటించిన విషయం నీకు తెలుసా?'

'తెలుసు.' అన్నాడు కూరేశుడు. ఆతని పెదవులమీద చిరునవ్వు తాండవమాడుతూనే ఉంది.

'ఐతే ఎందుకు వైష్ణవాన్ని ఇంకా ప్రచారం గావిస్తున్నావు?'

'అది నా ధర్మం. అందువల్ల.'

'అలా చేయడంవల్ల రాగల ప్రమాదాన్ని గుర్తించావా?'

'ప్రమాదమంటే ఏమిటి?' ప్రశ్నించాడు కూరేశుడు.

'తల పోవడం.'

'అంతేనా?' కూరేశుడు నవ్వాడు.

కులోత్తుంగుడు మండిపోయాడు.

'ఎందుకలా నవ్వుతున్నావు?' గద్దించి అడిగాడు కులోత్తుంగుడు.

'సార్వభౌముని పరిజ్ఞానం చాల ప్రాథమికంగా ఉన్నది గనుక.'

కూరేశుడన్న మాటలు విని అందరూ అదిరిపడ్డారు. కులోత్తుంగుడితో అంతవరకు ఎవరూ ఆ విధంగా మాట్లాడి ఉండలేదు.

'నా జ్ఞానం ప్రాథమికంగా ఉన్నదా? నీ కహంకారం హెచ్చిందా?' కోపంతో అన్నాడు కులోత్తుంగుడు.

'అధికారమే అహంకారాన్ని హెచ్చించేది. సర్వాధికార సమన్వితుడవు నీవు. అందువల్ల ఉంటే నీకే అహంకార ముండాలి. సర్వ సంగ పరిత్యాగులమైన మా కెందు కహంకార ముంటుంది?' నవ్వాడు కూరేశుడు.

'భయం లేకుండా మాట్లాడుతున్నావు?' మండిపడుతూ అన్నాడు కులోత్తుంగుడు.

కూరేశుడు నవ్వాడు. కులోత్తుంగుడాగ్రహోదగ్రుడయ్యాడు.

'మరణమంటే భయపడే మీకు భయముండాలి గాని అది లేని మాకు భయమెందు కుంటుంది?' అన్నాడు కూరేశుడు నిర్భయంగా.

ఆ మాటలు విని కులోత్తుంగునికేమి మాట్లాడాలో తోచలేదు.

'కులోత్తుంగ సార్వభౌమా! నీవు పొరబాటు బడుతున్నావు. నీవు శైవుణ్ణనుకొంటున్నావు. నీకు శైవమంటే ఏమిటో గూడ తెలియదు. అద్వైతమంటే అసలే తెలియదు. తెలిసి ఉంటే నీ విలా వైష్ణవుల్ని బెదిరించి హింసించి ఉండేవాడివి గావు. శైవంగాని, అద్వైతంగాని చాల గొప్పవి. అద్వైతాన్ని ప్రచారం గావించిన మహితమూర్తి ఆదిశంకరుడు. అతడు తన తత్వాన్ని కత్తిని ఝళి పించి స్థాపించలేదు. అత డానాడు ప్రాబల్యంలో ఉన్న బౌద్ధ జైన మతాలలోని లోపాలను ప్రపంచాని కెత్తి చూపాడు. ఆ మతానికి సంబంధించిన పెద్దలతో వాదించి మెప్పించాడు. అందువల్ల ఆ మతం పెరిగింది. అంతేగాని నీలాగా కత్తిచూపితే అది పెంపొందలేదు.

'నీలాటి రాజు లెందరో పుట్టారు. పెరిగారు. రాజ్యాలు సంపాదించారు. చక్రవర్తు లయ్యారు. మట్టిలో కలిసిపోయారు. కాని వారి పేర్లు గూడ ఈ నా డెవరికీ తెలియవు. అందువల్ల నీ వీ హింసా మార్గాన్ని విడిచిపెట్టాలి. నిజంగా నీకు శైవంమీద, అద్వైతంమీద అంత మక్కువే ఉన్నట్లయితే నీవు దానిని విశ్వసించు. ఇతరులకు చెప్పు. పండితుల్ని పెట్టి ప్రచారం గావించు. దానిని నమ్మినవారు ఆ మతాన్ని స్వీకరిస్తారు. లేనివారు తమ విశ్వాసాల ననుసరించి

జీవిస్తారు అంతేగాని అందరినీ శైవుల్ని చేయాలంటే నీకే గాదు. - నీలాటి చక్రవర్తులు వేలైా ప్రయత్నించినా సాధ్యంకాదు. నీవు మనిషిని నిర్బంధించగలవు గాని, అతని మనస్సును మార్చలేవు. ఈ నా డీ సభాస్థలిలో విభూతిరేఖలు ధరించి ఆదిశంకరులలాగా ఆసీనులయి ఉన్నవారిలో ఎందరి హృదయాలలో వైష్ణవం, విశిష్టా ద్వైతం తిష్ఠ వేసుకొని ఉన్నదో నీవు చెప్పగలవా? తుదకు నీవైనా కడవరకు అద్వైతివిగా ఉండగలవా? ఆలోచించుకో. వైష్ణవుల నెందుకు బాధిస్తావు? వారి నెందుకు హింసిస్తావు? అది మంచిది గాదు.' అన్నాడు కూరేశుడు.

సభలో ఉన్న వారందరూ కూరేశుని మాటల్ని నిశ్శబ్దంగా విన్నారు. అతని నిర్భయానికి విస్తుపోయారు. అందుకే రామానుజు డందరినీ జయించగలిగా డనుకొన్నారు. ఇంకా వారందరు కూరే శుణ్ణి రామానుజుడే అనుకొంటున్నారు.

'నాకు పాఠాలు చెప్పడానికి ని న్నిక్కడికి తీసుకొని రాలేదు. రాజపత్రంలో సంతకం పెట్టించడానికి తీసుకొని వచ్చారు.' అన్నాడు కులోత్తుంగుడు. 'శివాత్పరతరం నాస్తి' అనే పత్రాన్ని కూరేశుని కందివ్వమని ఆజ్ఞాపించినట్లుగా చూచాడు కులోత్తుంగుడు.

రాజభటు డొకడు పత్రాన్ని, కలాన్ని తీసుకొని వెళ్ళి దానిని కూరేశుని చేతి కిచ్చాడు.

'అందులో చేవ్రాలు చేయి.' అన్నాడు కులోత్తుంగుడు.

కూరేశుడు నవ్వుతూ ఆ పత్రా న్నందుకొన్నాడు. 'శివాత్పర తరంనాస్తి' అని అందరూ వినేటట్లుగా చదివాడు.

'ఆలస్యమెందుకు? సంతకం చెయ్.' ఆజ్ఞాపించాడు సార్వ భౌముడు.

కూరేశుడు కలం తీసుకొని నవ్వుతూ అందులో యేదో వ్రాశాడు.

ఇన్ని మాటలు మాట్లాడిన రామానుజుడు మరు మాట్లాడకుండా సంతక మెందుకు గావించాడని తమ్ముతాము ప్రశ్నించుకొన్నారు సభాసదులందరూ. రాజుగూడ ఆశ్చర్యపడ్డాడు.

రాజభటు డా పత్రాన్ని తీసుకొన్నాడు.

దానిని మంత్రిగారి కివ్వమన్నట్లు చేయి చూపాడు సార్వ భౌముడు. రాజభటు డా పత్రాన్ని త్రిపురాంతకుని చేతి కిచ్చాడు.

త్రిపురాంతకు డా పత్రాన్ని తిలకించాడు. అందులో రామానుజుని సంతకం లేదు. అందులో 'ద్రోణమస్తిఇతఃపరం' అని వ్రాయబడి ఉన్నది. దానిని రెండుమూడు సార్లు పరిశీలించాడు త్రిపురాంతకుడు. అతడు పొరబాటు పడలేదు. 'ద్రోణమస్తి ఇతఃపరం' అని స్పష్టంగా వ్రాయబడి ఉన్న దందులో.

'సంతకం గావించాడా?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

లేదన్నాడు త్రిపురాంతకుడు.

అందరూ ప్రధానివైపు చూడసాగారు.

కూరేశుడు చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వు ఒక బాకై సార్వభౌముని హృదయంలో గుచ్చుకొన్నది.

'ఏమి వ్రాశాడు?' ప్రశ్నించాడు కులోత్తుంగు డాదుర్దాతో.

'ద్రోణమస్తి ఇతఃపరం అని వ్రాశాడు'. అన్నాడు ప్రధాని.

'అంటే!' ఆదుర్దాతో ఆడిగాడు కులోత్తుంగుడు.

'ద్రోణ మన్నది మరొకటుంది' అని అర్థం.

రాజు దాని అర్థాన్ని గ్రహించాడు. ఆ మాటలో ఉన్న తిరస్కార భావాన్నిగూడ గుర్తించాడు.

రాజపత్రంలో 'శివాత్పరతరం నాస్తి' అని ఉన్నది. అందులో శివుడు అంటే పరమేశుడని అర్థం. కాని కూరేశుడు శివం అంటే ఒక కొలతపాత్ర అని అర్థం తీసి దానికి ఆ కొలత పాత్ర కంటె గొప్పది లేదు అని అర్థాన్ని చెప్పుకొన్నాడు. దానికి ప్రతిగా ద్రోణం అనే మరొక కొలత పాత్రగూడ ఉన్నది అని వ్రాశారు. శివం అంటే నాలుగుసేర్ల కొలతపాత్ర. ద్రోణమంటే నలువది సేర్ల కొలతపాత్ర. అందువల్ల శివం ఒకటే పెద్ద పాత్ర అనుకోకండి. అంతకంటె పెద్దదైన ద్రోణ మొకటుంది అనే భావంలో కూరేశుడు దానిని వ్రాశాడు.

కులోత్తుంగుని కా మాట విన్నప్పుడు చాల కోపం వచ్చింది. 'నీ అహంకారానికి అవధులు లేనట్లున్నాయి. నీ కళ్ళు తోడిస్తాను. 'జాగ్రత్త' అని గద్దించా డతడు కూరేశునివైపు చూచి.

కూరేశుడు నవ్వాడు. 'నీ వెందుకు నా కళ్ళు తీయించాలి? మహా పాప పంక సంకలితుడవైన నిన్ను చూచిన ఈ దురదృష్టకర నేత్రాలతో నా గురువైన, మహానుభావుడైన, మహాపురుషుడైన, మహా పవిత్రుడైన రామానుజుణ్ణి చూడడానికి నా కిష్టంలేదు. నేనే ఆ కళ్ళను లాగి వేసుకొంటాను.' అంటూ కూరేశుడు తన వాడి గోళ్ళతో తన నేత్రాలను పెళ్ళగించి లాగివేశాడు. అతని నేత్రాల నుండి రుధిరం పైకి చిమ్మింది. ఆ భయంకర దృశ్యాన్ని చూచి నిశ్చేష్టులయ్యారు.

కులోత్తుంగుడు గూడ ఒక క్షణం స్తబ్ధుడయ్యాడు. ఆ తరువాత, 'నీవు రామానుజుడవు గావా?' ఉద్వేగంతో ప్రశ్నించాడు.

'కాను.' అన్నాడు రక్తం స్రవిస్తున్న కళ్ళతో కూరేశుడు.

'మరెవ్వరు?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'అతని శిష్య పరమాణువైన, సామాన్యుడనైన కూరేశుణ్ణి'

'ఆఁ, ఎంత మోసం! రామానుజుడు తప్పించుకొన్నాడు; రామానుజుడు తప్పించుకొన్నాడు.' పిచ్చివానిలా సార్వభౌముడు కేకలు వేశాడు.

రామానుజుడు తప్పించుకొన్నాడని విని అందరికీ ఆశ్చర్యం గలిగింది. ఆ సభలో శైవ వేషంలో ఉన్న వైష్ణవుల కది అమందానందం గలిగించింది. కాని భయంతో వారు తమ హర్షాన్ని ఏ మాత్రం వెలుపలికి చూపలేదు.

'ఈ వృద్ధుని నేత్రాలు గూడ తీసివేయండి. ఈ యిద్దరినీ తరిమివేయండి. రామానుజుణ్ణి పట్టుకొని రండి. పట్టుకొని రండి, పొండి.' అంటూ కులోత్తుంగుడు కేకలు వేసి తనకు జరిగిన అవమానాన్ని భరించలేక లేచివెళ్ళిపోయాడు.

# 14

## అజ్ఞాతవాసం

*రామానుజుడు స్నానంచేసి వచ్చాడు. ఆయనకి తన దుస్తులప్పుడు కనబడలేదు. లోన ఉన్నాయేమోనని చూచాడు. అచ్చట కూడ లేవు. ఎవరైనా ఎచ్చటైనా పెట్టారేమోనని ఆశ్రమమంతా వెతికాడు. లేవు. అవి ఏమయినాయో అతని కర్థం కాలేదు.*

ఆశ్రమంలోనికి వెళ్ళి ఆయన వేరు దుస్తుల్ని ధరించుకొన్నాడు. ముందుకువచ్చి చూచాడు. వృక్షంక్రింద కూర్చొని వ్రాసుకుంటూ ఉండిన కూరేశుడు కనబడలేదు. కాని పట్టణంలోనుండి ఇతరు లా దెసకు వస్తున్నారు.

దుస్తులు లేకపోవడం, కూరేశుడు కనబడకపోవడం రామానుజుని కతి ఆశ్చర్యాన్ని కలిగించింది. పట్టణంలోని ముఖ్యులైన వైష్ణవులందరు రామానుజుణ్ణి చూడడానికి వచ్చారు. హఠాత్తుగా వా రెందుకలా వచ్చారో రామానుజుని కర్థంకాలేదు.

వచ్చిన వారందరూ అతనికి నమస్కరించారు. అతడు వారి నాశీర్వదించి కూర్చోమన్నాడు. ఆ వైష్ణవులలో యజ్ఞమూర్తి గూడ ఉన్నాడు.

'ఎందువల్ల అందరూ వచ్చారు?' ప్రశ్నించాడు రామానుజుడు చిరునవ్వు నవ్వుతూ.

'కులోత్తుంగుని సేనలు మిమ్మల్ని బంధించి తీసుకొని వెళ్ళాయని కంగారుపడి మేమిచ్చటికి వచ్చాము. బహుశా ఇక ప్రజలు గూడ వస్తారనుకొంటాను.' అన్నాడు యజ్ఞమూర్తి.

'కులోత్తుంగుని సేనలా? నన్ను బంధించుకొని వెళ్ళాయనా?' ఆశ్చర్యాన్ని ప్రకటించాడు రామానుజుడు.

'అవును. నగరమంతా ఆలాగే అనుకొంటున్నారు. ఇంత వరకు అతనిసేనలు పట్టణంలో ఒకరినిగూడ వెలుపలికి రానివ్వలేదు. ఆ సేన లిప్పుడే వెళ్ళిపోయినవి' అన్నాడొక వైష్ణవుడు.

రామానుజుని కప్పుడొక సందేహం కలిగింది. 'ఒకవేళ వారు కూరేశుణ్ణి బంధించుకొని వెళ్ళారా?' ఆ ఆలోచన వచ్చే సరికి అత డొకసారి కంపించాడు.

'మీకు కూరేశుడు కనబడ్డాడా?' అడిగాడు రామానుజుడు.

'కూరేశుడేగాదు. మహాపూర్ణుడుగూడ కనబడడం లేదు.' అన్నారు వారు.

'వారేగాక నా దుస్తులుగూడ కనబడడం లేదు.' అన్నాడు రామానుజుడు.

ఆ మాటలు విని కొందరు వైష్ణవులు ఆ ఆశ్రమ మంతటా వెతికారు. అప్పుడొక మూల కొన్ని దుస్తులు కనబడ్డాయి. వారు వాటిని తెచ్చి రామానుజుని ముందు ఉంచారు.

'ఇవి కూరేశునివి.' అన్నాడు రామానుజుడు.

అందరూ ఆశ్చర్యంగా వాటివైపు చూడసాగారు.

'బహుశా సైనికులు రావడాన్ని చూచి ఉంటారు. కూరేశుడు రానున్న ప్రమాదాన్ని గుర్తించి ఉంటాడు. నా దుస్తుల్ని ధరించి తానే రామానుజుణ్ణని చెప్పి వారికి పట్టుబడి ఉంటాడు' అన్నాడు రామానుజుడు.

'కావచ్చు.' అన్నారు వైష్ణవులు.

'ఎంతప్రమాదం జరిగింది?' అన్నాడు రామానుజుడు.

'ప్రమాదం జరిగింది గాని అంతకంటె గొప్ప ప్రమాద మొకటి తప్పిపోయింది.' అన్నాడొక వైష్ణవుడు.

'అలా మనం అనుకోగూడదు. కూరేశుడు చాల పొరబాటు గావించాడు. తాను పట్టుబడి నన్ను తప్పించాలనుకున్నాడు. కాని అది సాధ్యమవుతుందా? పట్టుబడిన వ్యక్తి నేను కాదని వారికి తెలిస్తే మరింత క్రోధంతో వచ్చి వారు నన్ను పట్టుకొని పోతారు.

అందువల్ల అతడు బంధింపబడి లాభ మేమున్నది?' అన్నాడు రామానుజుడు.

'అప్పటికి ప్రమాదాన్ని తప్పిస్తే తరువాత చూచుకోవచ్చు ననుకొనిఉంటా డతడు. ఏమైనా అతడు మంచి పనే చేశాడు. లేకుంటే వైష్ణవమే అడుగంటి ఉండేది.' అన్నాడు యజ్ఞమూర్తి.

'గురువుగా రన్నట్లు ప్రమాదం ఏమాత్రం తప్పిపోలేదు తాము పట్టుకొన్నది రామానుజుడు కాదని తెలియగానే వారు మరల శ్రీరంగంమీద పడతారు.' అన్నాడు గోవిందమిశ్రుడు.

'అది తప్పదు. అందువల్ల తమ రిచ్చటినుండి వెళ్ళి పోవాలి.' అన్నా డొక వైష్ణవుడు రామానుజునితో.

'నేను వెళ్ళడమా? కులోత్తుంగునికి భయపడి....'

'భయపడి గాదు. తమ రక్షణ వైష్ణవ మత రక్షణకు చాల అవసరం. ఈ విషయాన్ని మీరు తీవ్రంగా ఆలోచించాలి.' అన్నాడు గోవిందమిశ్రుడు.

రామానుజుడు నవ్వాడు.

'గోవిందమిశ్రుడు చెప్పినట్లు మీ రిప్పుడు రక్షింపబడాలి. కూరేశుని ఆశయం గూడ అదే. తాను పట్టుబడి మిమ్మల్ని రక్షించా లని అత డనుకొన్నాడు. అతని ఉద్దేశాన్ని మీరు నెరవేర్చాలి.' అన్నాడు యజ్ఞమూర్తి.

'వైష్ణవు లందరూ తమ మతంకోసం ప్రాణా లర్పిస్తుంటే, దానికి మూలపురుషుణ్ణైన నేను వారిని అక్షితంగా వదలిపెట్టి పారి పోవడమా? అదెంతమాత్రం పనికి రాదు.' అన్నాడు రామానుజుడు.

'చోళరాజ్యంనుండి మీరు వెళ్ళడం పారిపోవడ మెలా అవుతుంది?' ప్రశ్నించాడు యజ్ఞమూర్తి.

'పారిపోవడం గాక మ రేమవుతుంది? నేను వెళ్ళిపోతే వైష్ణవానికి చాల అపఖ్యాతి వస్తుంది.' అన్నాడు రామానుజుడు.

'ఏమీ రాదు. కొన్ని పరిస్థితుల్లో అజ్ఞాత జీవితం చాల అవ సరం అవుతుంది. చూడండి. జరాసంధుడు మధురమీదికి దండెత్తి

వచ్చినప్పుడు కృష్ణుడు తల దాచుకోకుండా ఉన్నట్లయితే ఆ రోజుల్లో ధర్మం ఎలా రక్షింపబడి ఉండేది?' ప్రశ్నించాడు గోవిందమిశ్రుడు.

'మీరు మా అభ్యర్థనను పాటించాలి. ఈ ఆపదనుండి మీరు రక్షించబడాలి.' అన్నాడు యజ్ఞమూర్తి.

'ఎంత ఆలోచించినప్పటికీ మీ సలహాను నేను అంగీకరించ లేకున్నాను. నేను వెళ్ళిపోతే మీ ఆచార్యుడు మిమ్మ ల్నందరినీ వదలి వెళ్ళిపోయాడు. మీ రెందు కీ వైష్ణవాన్ని పట్టుకొని వ్రేలాడు తారు? అని కులోత్తుంగుని భటులు వైష్ణవుల నందరినీ నిరుత్సాహ పరుస్తారు. అప్పుడు వా రధైర్యపడి తమ మతాన్నే వదలు కుంటారు.' అన్నాడు రామానుజుడు.

'మీ రలా ఆలోచిస్తున్నారు. కాని మీరే కులోత్తుంగునికి పట్టు బడి—పాపం శమించుగాక—ఏమైనా జరిగితే మీ మతాచార్యు డేమయ్యాడో చూడండి. మీరు లొంగకపోతే మీకు గూడ అదే గతి అవుతుందని వారు బెదిరిస్తారు. అప్పుడైనా బలహీనులైనవారు లొంగి తీరవలసిందే.' అన్నాడు గోవిందమిశ్రుడు.

'నేను వెళ్ళినంతమాత్రాన నాకుగాక మన మతానికి కలుగ గల ప్రయోజన మేమున్నది?' రామానుజుడు ప్రశ్నించాడు.

'ఎందుకు లేదు? మీరు జీవాలతో ఉన్నంతవరకు వైష్ణవు లెవ్వరూ లొంగరు. ఏనాడో ఒకనాడు తమ మతం ఉద్ధరించబడు తుందని వారికి నమ్మక ముంటుంది. ఆ నమ్మకంతో వారు గట్టిగా నిలబడగలుగుతారు.' అన్నాడు గోవిందమిశ్రుడు.

రామానుజు డాలోచనలో పడ్డాడు.

'ఇక వ్యవధి లేదు. వెడితే యిప్పుడే వెళ్ళాలి. లేకుంటే మిమ్మల్ని చూడడానికి ప్రజలందరూ వస్తారు. పైగా రాజభటులు గూడ వెంటనే రావచ్చు. కాబట్టి వెంటనే మీరు వెడితే మంచిది. మీకు తోడుగా గోవిందమిశ్రుణ్ణి తీసుకుని వెళ్ళండి నే నిచ్చటే ఉండి వైష్ణవాన్ని కాపాడుతాను.' అన్నాడు యజ్ఞమూర్తి.

తన శిష్యులకు తనమీద ఉన్న గాఢాభిమానానికి రామానుజుడు ముగ్ధుడయ్యాడు. వారి వాదంలోని సత్యాన్నిగూడ అతడు గుర్తించాడు.

'ఇంతకూ కూరేశుడేమయ్యాడో?' అతని మనస్సు వ్యగ్రమయింది.

'ఏమైనా గావచ్చు. కులోత్తుంగుడు చాల క్రూరుడు. తాము పట్టుకున్న వ్యక్తి మీరుగాదని తెలిసినప్పుడు, ఆ కోపంతో అతడేమైనా చేయవచ్చు.' అన్నాడు యజ్ఞమూర్తి.

రామానుజుడు గొప్ప నిట్టూర్పు విడిచాడు.

'వైష్ణవానికెంత ప్రమాదం వచ్చింది? కాని ఆ విష్ణుమూర్తే దీనిని రక్షించాలి.' అన్నాడు రామానుజుడు.

'గురువుగారూ, నేను ఇచ్చటినుండి వెళ్ళినప్పటికీ ఎవరో ఒకరు వారి వేషంతో కొన్ని దినాలు యిచ్చట ఉండాలి. లేకుంటే రాజభటులు మమ్మల్ని వెంటనే వెంటాడుతారు.' అన్నాడు గోవింద మిశ్రుడు.

రామానుజుడు నవ్వి, 'ఇప్పటికే తాము పట్టుకొన్న వ్యక్తి కూరేశుడేగాని, నేనుగాదని వారికి తెలిసి ఉంటుంది. అందువల్ల వారికమీద మోసపోరు. పైగా యిక ఆవిధంగా వారిని వంచించడం సాధ్యంకాదు.' అన్నాడు.

'అదీ నిజమే' అన్నాడు యజ్ఞేశుడు.

రామానుజుడు చోళరాజ్యాన్ని వీడివెళ్ళాలనేది నిర్ణయమయిందిగాని ఎచ్చటికి వెళ్ళాలి? అన్న ప్రశ్న వారి వేదుర్కొన్నది. మైసూరు రాష్ట్రానికి వెళ్ళడం మంచిదని, ఆతరువాత తక్కిన విషయాలను గూర్చి ఆలోచించడానికి వ్యవధి ఉంటుందని కట్టకడకు నిర్ణయింపబడింది.

వెంటనే రామానుజుడు, గోవిందమిశ్రుడు ప్రయాణానికి సిద్ధమయ్యారు. తమకు కావలసిన అవసరమైన వస్తువుల్నిమాత్రం తీసుకొని నగరానికి వెలుపలనుండే వెళ్ళిపోయారు. యజ్ఞమూర్తి, తక్కిన వైష్ణవులు పట్టణానికి తిరిగి వచ్చారు.

సైనికులు కూరేశుణ్ణి పట్టుకొనివెళ్ళినప్పుడు రామానుజుణ్ణి పట్టుకొనివెళ్ళారని చోళరాజ్యమంతటా ప్రచారమయింది. ఆ వార్త కొంగుపిరాట్టికి గూడ తెలిసింది.

కొంగుపిరాట్టి ఒక బ్రాహ్మణ స్త్రీ. ఆమెకు వైష్ణవమంటే చాల ప్రేమ. రామానుజుడంటే చాల భక్తి. ఒకమా రామె శ్రీరంగానికి వెళ్ళింది. అచ్చట ఆమె రామానుజుని మహిమల్ని గూర్చి విన్నది. అప్పు డామె ఆ మహాభాగుని దర్శించింది. అతని ఉపదేశాన్నిగూడ పొందింది. అప్పటినుండి ఆమె వైష్ణవ మతస్థురాలై వైష్ణవాన్ని బలపరుస్తున్నది.

కొంగుపిరాట్టి భర్త అళగేశుడు. అతడు శైవుడు. కాని అతడు తన భార్యమీది ప్రేమవల్ల ఆమె వైష్ణవి యైనప్పటికీ ఆమె నేమీ అనలేదు. మతాలు వేరయినంతమాత్రాన వారి ప్రేమ కేమీ భంగం కలుగలేదు.

రామానుజుణ్ణి కులోత్తుంగచోళుని సైనికులు బంధించి తీసుకునివెళ్ళారన్న వార్త వినగానే కొంగుపిరాట్టి హృదయం బ్రద్దలయినట్లయింది. ఆమెకళ్లు చెమ్మగిల్లాయి. ఆ మహాత్ముని కేమి ఆపద కలుగుతుందో నని ఆమెకు భీతి కలిగింది. ఆ నాటినుండి ఆమె చాల చింతాక్రాంత అయింది.

కొంగుపిరాట్టి నోదార్చడానికి అళగేశు డెంతో ప్రయత్నించాడు కాని ఆమె తన చింతను మానలేదు. ఆమెకు దుఃఖ మాగలేదు. కులోత్తుంగు డలా చేసినందు కామె అతణ్ణి శపించింది. ఇక అతని అధఃపతనం ప్రారంభమైందంది. అతడు తప్పనిసరిగా నాశనమవుతా డన్నది.

కులోత్తుంగుని ఆస్థానంలో ఏమి జరిగిందో కొన్ని దినాల వర కామెకు తెలియరాలేదు. ఆ సమయంలో ఆమె చాల భయపడింది. తరువాత, చోళ సార్వభౌముడు రామానుజుని కళ్ళు ఊడదీయించినా డని ఆమె విన్నది. అప్పు డామె చాల గందరగోళపడింది. అప్పటినుండి ఆమె అన్నంగూడ తినకపోయింది. ఆమె దుఃఖాన్ని ఉపశమింపజేయడానికి అళగేశు డెంతో ప్రయత్నించాడు.

కాని ఏమాత్రం లాభంలేకపోయింది. కులోత్తుంగుని క్రూరత్వాన్ని అళగేశుడుగూడ సహించలేకపోయాడు. తన మతం కానంత మాత్రాన రామానుజుని కళ్ళు ఎందుకు ఊడదీయించాలో అతని కర్థం కాలేదు. కులోత్తుంగుని చర్యలు శైవమతానికే అప్రతిష్ఠాకరంగా ఉన్నాయనుకొన్నా డళగేశుడు.

రామానుజుడు పట్టుబడలేదని, చోళరాజు సైనికులు పట్టుకున్నది కూరేశుణ్ణని, కళ్లూడదీసింది గూడ అతణ్ణేనని, రామానుజు డెక్కడికో పారిపోయాడని ఒక వార్త పొక్కింది. అళగేశుడా వార్త విని చాల ఆనందపడ్డాడు. తన భార్య కా విషయాన్ని తెలియజేశాడు. ఆమె కూరేశుణ్ణి గూర్చి తొలుత విచారపడినప్పటికీ రామానుజుడు తప్పించుకున్నాడని విని ఎంతో ఆనందపడింది.

'రామానుజు డెక్కడికి వెళ్లి ఉంటాడు?' ఆమె భర్తను ప్రశ్నించింది.

'ఎక్కడకు వెళ్ళి ఉంటాడో మరి! అతనికోసం రాజసైనికులు వేటాడుతున్నారట. అతణ్ణి పట్టియిస్తే బహుమతిగూడ ఇస్తానన్నాడట సార్వభౌముడు.' అన్నా డళగేశుడు.

కొంగుపిరాట్టి కంపించింది.

కులోత్తుంగుని విషయం ఆ దేశంలోని ప్రజల కందరికీ తెలుసు. అతడు చాల పట్టుదల గలవాడు. చాల క్రూరుడు. తా నను కొన్నదానిని నెరవేర్చడంలో ఎంత క్రూర కార్యానికైనా వెను దీయడు. అందువల్ల అతడంటే అందరికీ భయం. ఆనాడు చోళ రాజ్యంలో భయం పాతుకుపోయింది. కనుకనే కొంగుపిరాట్టి చాల భయపడింది.

ఆమె ఆలోచింపసాగింది. రామానుజు డెచ్చటికి వెళ్ళి ఉంటాడు? ఎచ్చట దాగి ఉంటాడు? చోళ రాజ్యంలో ఎచ్చట జూచినా శైవు లున్నారు. వారి కనుమొరగి ఉండడాని కతనికి వీలు గాదు. అందువల్ల అతను పట్టుబడతాడేమో. ఆమె భయపడింది.

ఒకవేళ ఆ మహాభాగుడు చోళరాజ్యాన్ని విడిచి వెళ్ళిఉంటే అతని కేమీ బాధ ఉండదు. కాని అతడు రాజభటుల్ని తప్పించుకుని వెళ్ళవద్దా? అది సాధ్యమయ్యే పనేనా? ఆమె కలవరపడింది.

అంతలో ఆళగేశుడు వచ్చి 'నీకోసం ఎవరో ఇద్దరు వచ్చి ఉన్నారు.' అన్నాడు.

'ఎవరు?' ప్రశ్నించిం దామె.

'ఎవరో నాకు తెలియదు. నేను వారి నడగలేదు.' అన్నా డతడు

ఆమె మేడమీదినుండి క్రిందికి వచ్చింది. తనకోసం వచ్చిన వారు వసారాలో కూర్చుని ఉన్నారు.

అది రాత్రి సమయం. వెలుపల గాఢాంధకారం. అందువల్ల వసారాలో దివ్వె ఉన్నప్పటికి ఆమెకు వారు చక్కగా కనబడలేదు. ఆమె వారిదగ్గరకు వెళ్ళి, 'ఎవరు మీరు?' అని ప్రశ్నించింది.

వారిద్దరూ ఒకలాగే కనబడుతున్నారు. ఒకలాగే వస్త్రధారణ గావించి ఉన్నారు.

ఆమె ప్రశ్నకు సమాధానం చెప్పలేదు.

అంతలో ఆళగేశుడుగూడ క్రిందికి వచ్చాడు.

ఆమె మరల కొంత సమీపించి వారిని పరికించింది. అందులో ఒకరు రామానుజుడులాగా ఉన్నాడు. కాని అతడు తెల్లని వస్త్రాలను ధరించి ఉన్నాడు. రామానుజు డయితే కాషాయవస్త్రాలు ధరించి ఉంటాడుగదా అనుకున్న దామె.

వెంటనే ఆమె మనస్సు తళుక్కు మన్నది. తన్నెవరూ తెలుసుకోకుండా ఉండడానికని అత డలా వస్త్రధారణ చేశాడేమోనను కొన్నదామె. కాని అతడు రామానుజుడే అని ఎలా అనుకోవడం? ఆమెకు సందేహం కలిగింది.

మరల ఆమె వారి నేమీ పలకరించలేదు. వెంటనే యింటి లోకివెళ్ళి వారికి నీళ్ళు తెచ్చియిచ్చి పాదప్రక్షాళన గావించుకొమ్మ న్నది. తరువాత వారిని లోనికి తీసుకొనివెళ్ళి భోజనం పెట్టింది.

భోజనానికని అతిథులు లోనికి వెళ్ళినంతనే అళగేశుడు మేడ మీదికి వెళ్ళాడు. అళగేశుని కా ప్రాంతంలో చాల ధనవంతుడని పేరు. చాల దానపరుడని కూడ ప్రతిష్ఠ ఉంది. తాను శైవు డయినప్పటికీ మతాలతో నిమిత్తంలేకుండా, వచ్చిన అతిథుల నందరినీ ఆదరిస్తుంటా డతడు. అందువల్ల ఆ అతిథు లెవ్వరని తెలుసుకొనడాని కత డుబలాటపడలేదు.

భోజనం వడ్డిస్తున్నప్పు డామె ఆ అతిథులను జాగ్రత్తగా పరిశీలించింది. అందులో ఒకరుమాత్రం రామానుజుడే. అందుకు సందేహంలేదు. అత డెంతో వెలిగిపోతున్నాడు.

'మీరు రామానుజులా?' తిన్నగా ప్రశ్నించిందామె.

'అవు' నన్నా డతడు నవ్వుతూ.

ఆమె కెనలేని ఆనందం కలిగింది. రామానుజుడు తన యింటికి వచ్చాడు తను స్వయంగా అతనికి భోజనం వడ్డిస్తున్నది. తా నెన్నడో ఎంతో పుణ్యం గావించుకొన్నది. లేకుంటే ఆ మహానీయుడు తన యింటికే ఎందుకురావాలి?

రామానుజుడు, గోవిందమిశ్రుడు భోజనం గావించినతరువాత ఆమె వారినిద్దరినీ ఒక గదికి తీసుకొనివెళ్ళి అచ్చట విశ్రమింప జేసింది. వారిద్దరూ శయనించినపిదప తానే మేడమీదికి వచ్చింది.

కొంగుపిరాట్టి పైకివచ్చినప్పు డళగేశుడు ఆదిశంకరుని బ్రహ్మసూత్ర భాష్యాన్ని పఠిస్తున్నాడు. ఆమె వచ్చినవెంటనే, 'వారు భోజనం చేశారా?' అని ప్రశ్నించా డామె నతడు.

'ఊఁ, చేశారు.' అన్నదామె.

ఆమె చాల ఆనందంగా ఉన్నది. అంతవరకు చాల చింతాక్రాంతయై ఉన్న తన భార్య అప్పు డంత సంతోషంగా ఉండడాన్ని చూచి అతడు చిరునవ్వు నవ్వాడు.

'ఈనా డెందుకో చాల ఆనందంగా ఉన్నట్లున్నావు! నే నెంత చెప్పినా చింతగా ఉండేదానివి, ఈ నా డెందు కంత సంతోషంగా ఉన్నావో తెలుసుకోవచ్చునా?' ప్రశ్నించా డళగేశుడు.

ఆమె నవ్వింది.

'చెప్పగూడని రహస్యమా ?' అడిగా డళగేళుడు.

'అవును. రహస్యమే.' అన్నదామె.

'మనమధ్య రహస్యమేమున్నది ?' నవ్వుతూ అన్నా డతడు.

'మీ రెవరికీ చెప్పనంటే-' అన్నదామె. ఆమె కళ్ళు మెరుస్తున్నవి.

'చెప్పనులే.' అన్నా డతడు మందహాస వదనంతో.

'మాటయిస్తారా ?' అడిగిం దామె.

'తప్పనిసరిగా యిస్తాను. ఆ పరమేష్ఠి తోడు! ఎవ్వరికీ చెప్పను.' అన్నా డళగేళుడు.

'మన కెంతో అదృష్టం కలిగింది. మన జన్మ తరించింది.' అన్నది కొంగుపిరాట్టి.

ఆమె ఆనందంతో ఉప్పొంగిపోతున్నది. అత డాశ్చర్యంతో ఆమెవంక చూడసాగాడు.

'ఆ వచ్చినవారిలో రామానుజుడున్నాడు.' అన్నదామె.

'ఆఁ. రామానుజుడా! మన యింటికి వచ్చింది రామానుజుడా ?' అతడు విస్తుపోయాడు.

'నేను నిజమే చెబుతున్నాను. అతడు రామానుజుడే.' అన్నదామె.

అతనికిగూడ ఎంతో ఆనందం కలిగింది. రామానుజుడు తమ యింటికి రావడమంటే సామాన్యంగాదు. తాము పిలవకనే ఆ మహానుభావుడు తమయింటి కరుదెంచాడు. అంతకంటె తమకు కావలసిన భాగ్యమేమున్నది ?

అతడు మాట్లాడ నందువల్ల ఆమెకు సందేహం కలిగింది. 'మీ రెందుకలా ఆలోచిస్తున్నారు ? మనకు ప్రమాదం వస్తుందనా ?' అని ప్రశ్నించిం దామె వ్యగ్రంగా.

అతడు చిరునవ్వునవ్వి, 'మన అదృష్టాని కానందిస్తున్నాను. ఎంత ప్రమాద మొస్తేనేమి? వారు మనయింటికి రావడమే మన భాగ్యం.' అతని మోములో ఆనందం నృత్యం గావించింది.

'మీరు చాల గొప్పవారు. మీకు సతిని గావడం నా అదృష్టం' అన్నది కొంగుపిరాట్టి. రామానుజుడు రక్షింపబడ్డాడన్న భావంతో.

# 15

## వైష్ణవద్వయం

మహాపూర్ణుని కళ్ళు లాగివేయబడినతరువాత కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి కులోత్తుంగుని భటులు కాంచీపురంనుండి కొంతదూరం తీసుకొని వెళ్ళి వదిలివేశారు.

ఆనాడు సభాస్థలిలో జరిగిన సంఘటనలు ప్రతివారి మనస్సును కలచివేసినవి. కాని త్రిపురాంతకుని హృదయాన్ని గాని, కులోత్తుంగుని అంతరంగాన్ని గాని అవి కదిలించలేక పోయినవి.

కాంచీపుర మంతటా ఆనాటి రాత్రి ఆ సంఘటనలనుగూర్చే అందరూ చర్చింపసాగారు. రామానుజుని శిష్యులు చాల గొప్పవారని, చాల ధైర్యం గలవారని, వారి నెవరూ సాధించలేరని, వారితో యెవ్వరూ వాదించలేరని, వారు ప్రాణాలనే లెక్కచేయరని, కడకు సార్వభౌముణ్ణి గూడ ఖాతరు చేయరని వారనుకొన్నారు. కూరేశుని ధైర్యసాహసాలను వారు మెచ్చుకొన్నారు. అతని వాక్చాతుర్యానికి వారబ్బురపడ్డారు. అతని గొప్పతనాన్ని ప్రశంసించారు. సార్వభౌముణ్ణి, త్రిపురాంతకుణ్ణి తెగనాడారు.

మత మేదైతేనేమి? ఒక మతాన్నవలంబించినంతమాత్రాన వారి నెందుకు హింసించాలి? శైవులలో గూడ చాలమంది అలా అనుకొన్నారు.

దీనికంతటికీ త్రిపురాంతకుడు కారణం. అతనివల్లనే అధి రాజేంద్రుడు నాశనం చేయబడ్డాడు. చోళరాజ్యం చాళుక్యుల చేతిలోకి వచ్చింది. అప్పటినుండి త్రిపురాంతకుని కెదురులేకపోయింది. ఆనాటినుండి ఎచ్చట జూచినా భయోత్పాతమే. ఎటుగాంచినా దౌర్జన్య ప్రదర్శనమే. ఏ వైపు పరికించినా హింసాకాండ ప్రళయనృత్యమే.

కులోత్తుంగుని పాలనలో నియంతృత్వం నెలకొన్నది. చోళపాలనలో ఉన్న ప్రజాస్వామ్యం పూర్తిగా అంతరించింది. నిరంకుశత్వం వేయి తలలు వేసింది.

శైవం అధికారమతమయిందని ప్రప్రథమంలో శైవులందరూ ఆనందించారేగాని ఆ తరువాత కొంతకాలానికి దాని నష్టాలేమిటో వారి కవగతమయినవి. వైష్ణవుల నుద్యోగాలనుండి తీసివేసినప్పుడు వారు సంతసించారు. వారిని నిర్బంధించి శైవులుగా మార్చినప్పు డానందించారు. వారి నామాలను బలవంతంగా తుడిచివేసి వారి లలాటాలమీద విభూతిరేఖల నలమినప్పుడు హర్షాన్ని వెలిబుచ్చారు. కాని ఆ తరువాత వారుగూడ కష్టాలపాలు గావలసి వచ్చినప్పుడు చింతించారు.

కాంచీపురంలోనేగాక చోళరాజ్యంలోని ఇతర ప్రాంతాలలో గూడ వైష్ణవులు కులోత్తుంగుని భటులకు భయపడి శైవులైనట్లు నటించినప్పటికీ తమ యిళ్ళలోమాత్రం వైష్ణవాన్నే పాటించేవారు. తమ్ముతాము రక్షించుకోవడానికి పరస్పరం సాయపడుతుండేవారు. అందువల్ల యెవరు శైవులో, యెవరు వైష్ణవులో తెలిసేది గాదు. ఇది అన్నిచోట్లా ఒక కొత్త ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది.

త్రిపురాంతకుడు తన చారులద్వారా శైవులుగా నటిస్తున్న వైష్ణవుల వర్తనాన్ని గమనించాడు. అందువల్ల వారిని కనిపెట్టి శిక్షించమని భటులకు ఆజ్ఞయిచ్చాడు. కులోత్తుంగు డా ఆజ్ఞకు తన

ఆమోద ముద్రను వేశాడు. అప్పటినుండి రాజభటులు శైవులుగా ఉన్న వైష్ణవులను ఏరి పారవేయడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో వారు కొందరు నిజమైన శైవులనుగూడ వైష్ణవులని భ్రమించి బాధించారు. అప్పుడు శైవులు భయపడవలసిన పరిస్థితి ఏర్పడింది.

కులోత్తుంగుని రాజ్యంలో ప్రజలెవ్వరూ ఏమీ మాట్లాడుకోవడానికి వీలులేదు. తమమాటల నెవరు వింటారో నని వారిభయం. రాజభటులు మారు వేషాలలో ఉంటారు. తమ కుటుంబాలలోనే ఒకరుగా ఉంటారు. వారు తమకు తెలియదు. శైవాన్ని రక్షించాలనే పిచ్చితో చాలమంది ప్రభుత్వ గూఢచారులుగా చేరి ఉన్నారు. వారు తమ తలిదండ్రులనిగాని, అన్నదమ్ములనిగాని కరుణించడంలేదు. ఎవరు శైవాన్ని గూర్చి అపహసించినా, రాజునుగూర్చి, ప్రధానిని గూర్చి వ్యతిరేకంగా మాట్లాడినా వారిని గుర్తించి వారినిగూర్చి ప్రధానికి నివేదించడం తమ ప్రధానలక్ష్యంగా ఉంచుకొన్నారు. అందువల్ల ఏమి మాట్లాడడమన్నా ప్రజలకు భయమే. కనుకనే కళ్ళవెంట రక్తాన్ని కార్చుకుంటూ కూరేశుడు, మహాపూర్ణుడు వెడుతుంటే వారినిచూచి మనస్సు కష్టపడినప్పటికీ వారిని సమీపించి వారి నోదార్చి వారికి బాధోపశమనం చేయడాని కెవరూ ప్రయత్నించలేదు.

కూరేశుడు వయసులో ఉన్నాడు. అందువల్ల ఆ బాధను తట్టుకోగలిగాడు. కాని మహాపూర్ణుడు వృద్ధుడు, అందువల్ల అత డా బాధను భరించలేకపోయాడు.

కూరేశుడు ముందు తారాడుతూ వెడుతుంటే అతని భుజాన్ని పట్టుకొని మహాపూర్ణుడు వెళ్ళసాగాడు. వారు దేవునిమీద భారంవేసి శ్రీరంగం దారి బట్టారు.

కూరేశుడు నడవగలడు. మహాపూర్ణుడుగూడ సామాన్యమైన పరిస్థితుల్లో నడవగలిగి ఉండేవాడు. కాని అతని జరాభారానికి తోడు నేత్రాలబాధగూడ ఒకటి తోడయింది. అందువల్ల అతడు నడవడానికిగూడ చాల బాధపడుతున్నాడు.

మహాపూర్ణుడు చాల ఆత్మనిగ్రహం గలవాడు. ఒక మహా యోగి. కనుక అత డాబాధను భరించగలుగుతున్నాడుగాని సామాన్యు లయితే యేనాడో క్రుంగిపోయి ఉండేవారు.

'కూరేశా! శ్రీరంగ మింకెంతదూర ముంటుంది?' ప్రశ్నించాడు మహాపూర్ణుడు.

'చెప్పలేను మహాత్మా. మన మెచ్చటున్నామో గూడ తెలియడం లేదు.' అన్నాడు కూరేశుడు.

'రామానుజు డేమై ఉంటాడో!' నిట్టూర్చాడు మహాపూర్ణుడు.

'సురక్షితంగానే ఉంటాడనుకొంటాను.' అన్నాడు కూరేశుడు.

'ఎలా చెప్పగలం? ఈ పాటికి రాజభటులు శ్రీరంగాన్ని గాలించివేసి ఉంటారు.' అన్నాడు మహాపూర్ణుడు.

'వారు వెళ్ళేసరికి ఆ మహాభాగ్యుడు శ్రీరంగాన్ని వీడిఉంటాడనుకొంటాను.'

'ఏమో మరి! నాకు సందేహంగా ఉంది.'

'కాని నా మనస్సెందుకో చాల ధైర్యంగా ఉంది. ప్రపంచంలో ఎవరుగూడ ఆ మహాత్ముణ్ణి ఏమీ చేయలేరనిపిస్తున్నది.' అన్నాడు కూరేశుడు.

'నీ మాటలు నిజమైతే అంతేచాలు. రామానుజుడు జీవాలతో ఉంటే వైష్ణవ మెన్నడూ పతనంగాదు.'

ఇద్దరూ ముందుకుసాగారు. తడబడుతూ, తడమాడుతూ ముందుకు వెళ్ళారు. చరాచర ప్రపంచంలో భగవంతుణ్ణి వెతుక్కుంటూ వెడుతున్న భక్తులలాగా వారు వెళ్ళారు.

ఆత్మకు, శరీరానికి ఉన్న సంబంధం అంతకుముందు వారి కంతగా అర్థంగాలేదు. కాని ఇప్పుడు వారి కది అనుభవపూర్వకంగా తెలుస్తున్నది. శరీరంలో బంధించబడిన ఆత్మ శారీరకబాధలనన్నిటినీ అనుభవించాలి. శరీరం లేకపోతే ఆత్మకు బాధలే ఉండవేమో ననిపించింది వారికి.

మహాపూర్ణుడు వృద్ధుడయ్యాడు, అందువల్ల అతని శరీరమే అతనికి బరువయింది. ఆ బరువునే అతడు మోయలేకుండా ఉన్నాడు.

కళ్ళు తీసివేయబడిన తరువాత ఆ బరువు కా బాధ తోడయింది. కాని అతడు తన యోగవిద్యవల్ల ఆ బాధను భరించగలుగుతున్నాడు.

మహాపూర్ణుడు వృద్ధుడైనప్పటికీ ఏమాత్రం శుష్కంగా లేడు. కళ్లు తీసి వేయబడినప్పటికీ అతని ముఖం వికృతం కాలేదు. అతని ముఖంలో ఇంకా వర్చస్సు మిగిలే ఉన్నది. అతణ్ణి చూచినవారెవరైనా అతనికి చేతులెత్తి నమస్కరించకుండా ఉండలేరు.

కూరేశుడు కొంత అలసి ఉన్నప్పటికీ అతని ముఖంలో కళ అంతరించలేదు. ఆ కష్టాలలో గూడ అతని ముఖం చిరునవ్వుల్ని చిందిస్తూనే ఉంది.

కూరేశుడు, మహాపూర్ణుడు దేవుణ్ణి మనసులో ఉంచుకుని అతణ్ణి ధ్యానిస్తూ ముందుకు వెళ్ళసాగారు. ఆ ధ్యాన మొక్కటే వారి బాధల నన్నిటినీ సమయింప జేయగలిగింది.

ఆ వైష్ణవోత్తము లిద్దరూ వెడుతుంటే త్రోవలో ఎదురయిన వారందరూ వారిని చూచి ఒక నిట్టూర్పు విడిచి వెడుతూ ఉన్నారు. కొందరు ముందు వెనకల చూచి వారికి తమ వద్దనున్న తినుబండారాల నిచ్చి వెళ్ళారు. త్రోవలో గ్రామాలు వచ్చినప్పుడు వా రిద్దరూ భిక్ష అడుక్కొని తిన్నారు. ఆ మహనీయుల్ని చూచి ప్రజలు కళ్లలో నీళ్ళు పెట్టుకున్నారు.

కొన్ని దినా లలా వారు ప్రయాణం గావించారు. ఆ ప్రయాణం వారికి రాను రాను కష్టం కాజొచ్చింది. ఒకనాడు వా రిద్దరూ ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. మహాపూర్ణుడు చాల అలసి ఉన్నాడు.

'కూరేశా!' పిలిచాడు మహాపూర్ణుడు.

'ఏమి మహాత్మా?' ప్రశ్నించాడు కూరేశుడు.

'మనం శ్రీరంగం చేరగలమా?'

'దేవుని దయ.'

'మరల ఎన్నడైనా రామానుజుణ్ణి కలుసుకోగలమా?'

'శ్రీరంగం చేరుకుంటే ఎన్నడైనా కలుసుకోగలం.'

'కాని నాకు నమ్మకంలేదు. ఎందుకో నా మనస్సులో దిగులు పుడుతూ ఉంది.'

'ఎన్నడూ లేని మాటలు మీరు మాట్లాడుతున్నారు.'

'లేదు, నిజంగానే చెబుతున్నాను. నేను శ్రీరంగం చేరలే ననిపిస్తున్నది.' విచారంగా అన్నాడు మహాపూర్ణుడు.

'మీ రలా అనకండి. శ్రీరంగనాథు డెన్నడూ మన పాలిచే ఉంటాడు. ఏనాటికైనా మనమే జయిస్తాము.' అన్నాడు కూరేశుడు.

'నేను నానాటికీ బలహీనపడిపోతున్నాను.' అన్నాడు మహాపూర్ణుడు.

ఆ ఆచార్యుడు నిజంగానే బలహీన పడుతున్నాడు. ముందు లాగా అతడు నడవలేకున్నాడు.

'మీరు ధైర్యం చిక్కబట్టండి. ఏ విధంగానో ఒకవిధంగా శ్రీరంగం చేరుకోగలం.' అన్నాడు కూరేశుడు.

కూరేశుడు లేచాడు. మహాపూర్ణుణ్ణి లేపాడు. ఇద్దరూ ప్రయాణం సాగించారు. కొంతదూరం వెళ్ళేసరికి మహాపూర్ణుని పాదాలు వణక నారంభించాయి. అతను నిలవలేకపోయాడు. తిన్నగా క్రింద కూర్చున్నాడు. కొంత తడవు విశ్రాంతి తీసుకున్న తరువాత మరల లేచి కూరేశుని భుజం పట్టుకుని నడవసాగాడు.

సాయం సమయానికి వారు ఒక గ్రామానికి వచ్చారు. అచ్చట వారొక సత్రంలో ఆగారు. మహాపూర్ణుణ్ణి అచ్చటే ఉంచి కూరేశుడు గ్రామంలోకి వెళ్ళి అన్నం అడుక్కు తెచ్చాడు. ఇద్దరూ దాన్ని తిని శయనించారు.

మహాపూర్ణునికి జ్వరం వచ్చింది. రాత్రి కలవరింపసాగాడు. ఉదయం లేవలేకపోయాడు. కూరేశుడు తిన్నగా అతని వద్దకు జరిగి అతణ్ణి పరామర్శించాడు. అంధనయనాలలో ఆతణ్ణి పరికిస్తూ అతని పాదాల నొత్తి ఆతని శ్రమను నివారించడానికి ప్రయత్నించాడు.

ఆ సత్రంలో ఉన్న ఆ సన్యాసులు వైష్ణవులని, కూరేశ మహాపూర్ణులని ఆ గ్రామస్థులకు తెలియదు. అందువల్ల వారు ఆ

అంధుల్ని చూచినప్పు డెంతో బాధపడ్డారు. వారికి కావలసిన ఆహార పదార్థాల నిచ్చారు.

'మీ రెవరు ?' అని ప్రశ్నించారు.

'భగవంతుని చరణ సేవకులం,' అన్నాడు కూరేశుడు.

'మీ రెందు కిలా అయ్యారు ?' భగవంతుని ఆజ్ఞవల్ల అన్నాడు కూరేశుడు.

'ఎచ్చటికి వెడుతున్నారు ?' అడిగారు వారు.

'భగవంతుని సన్నిధికి.' అన్నాడు కూరేశుడు.

కూరేశుని మాటలు వారి నెంతో ఆకర్షించాయి. అత డెవరో, అతని వద్దనున్న వృద్ధు డెవరో తెలుసుకోవాలని వారికి ఆసక్తి కలిగింది. వారి కిట్లెందుకు లేవో తెలుసుకోవాలని గూడ వారి కభిలాష పొడమింది. అందువల్ల వారు ఆ వైష్ణవోత్తముల నెన్నో ప్రశ్నలు వేశారు. వాటి కన్నిటికీ కూరేశుడు ఒక విధంగా సమాధానా లిచ్చి తమ నిజవృత్తాంతాన్ని మరుగుపరిచాడు.

'వీరెవరో చాల గొప్పవారు,' అన్నా డొక గ్రామస్థుడు.

నిజమే నన్నారు తక్కినవారు. అలాటి వారి కా స్థితి కలిగినందుకు చాల వగచారు. వా రచ్చట నున్న రెండు మూడు దినాలూ ఆ గ్రామస్థులు వారికి భోజన సదుపాయాలను కల్పించి వారిని చక్కగా ఆదుకున్నారు.

ఆ మూడు దినాలలో మహాపూర్ణునికి కొంత ఆరోగ్యం కలిగింది. మరునాడు కూరేశుడు, మహాపూర్ణుడు తమ ప్రయాణాన్ని కొనసాగించారు.

సూర్యు డుదయిస్తున్నాడు. మధ్యందిన మార్తాండు డవుతున్నాడు. అస్తమిస్తున్నాడు. అంధకారం అలముకొంటున్నది. అది ఉదయం విడిపోతున్నది. కాని వైష్ణవద్వయానికి మాత్రం ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి అంతా ఒకటిగానే ఉన్నది. ఎల్ల వేళలా అంధకారమయంగానే ఉన్నది. ప్రపంచంలో ఉన్న ప్రకాశమంతా వారి హృదయాలలోకి వెళ్ళిపోయింది.

ముందు ఏమున్నదో వారికి తెలియడం లేదు. తారట్లాడుతూ వారు ముందుకు వెడుతున్నారు. దేవుడే వారికి దారి జూపిస్తున్నాడు.

'కూరేశా ! నేను నడవలేకున్నాను'. అన్నాడు మహాపూర్ణుడు.

ఆ వైష్ణవు లిద్దరూ ఆ సమయంలో ఒక బ్రహ్మాండమైన అడవిలో పయనిస్తున్నారు. దానిని దాటడాని కింకా రెండుమైళ్ళ దూరమున్నది.

మహాపూర్ణుని చేతులు, కాళ్ళు అదరజొచ్చాయి. అతడు కూర్చున్నాడు. చాల అలసిపోయాడు. ఇక ఒక అడుగు గూడ ముందుకు వెయ్యలేక పోయాడు.

మహాపూర్ణుని కళ్ళ గుంతలు వాచినవి. అవి చీము పట్టి చాల బాధిస్తున్నవి, ఆ బాధ నతడెంతో సహనంతో భరిస్తున్నాడు. దినాల తరబడి నడవడంవల్ల అతని శరీరం పట్టు దప్పిపోయింది.

కూరేశుడు వంగి మహాపూర్ణుని మీద హస్తం ఉంచాడు. ఆ ఆచార్యుని శరీరం వేడిగా ఉంది. అతడు కంపిస్తున్నాడు.

కూరేశు డతని ప్రక్కన కూర్చున్నాడు. మహాపూర్ణునిపై చేయివేసి పట్టుకొన్నాడు. ఆ ఆచార్యునికి కూర్చోవడం గూడ చాల కష్టంగా ఉంది. అందువల్ల అతడు కూరేశుని తొడపై పవ్వళించాడు. కాని అతని బాధ నివారణ గాలేదు. రాత్రయింది. గాఢాంధకారం అలముకొన్నది. ఏవో చిన్న చిన్న జంతువులు వారి ప్రక్కనుండి వెడుతున్నవి. అరణ్యంలో నుండి భయంకరమైన ధ్వనులు వినవస్తున్నవి. మహాపూర్ణుడు కూరేశుని తొడమీద అలాగే పడుకొన్నాడు. అతనికి స్మారకం తప్పుతున్నది. అప్పుడప్పుడు ఏదో కలవరిస్తున్నాడు. కూరేశుడు దైవప్రార్థన చేస్తూ అందులో లీనమై ఉన్నాడు.

ఒక సిద్ధాంతానికి, ఒక మతానికి కట్టుపడినందువల్ల ఆవైష్ణవోత్తముల కంత కష్టం వచ్చింది. వైష్ణవమత పతనాన్ని నివారించడానికని వా రంత త్యాగం చేయవలసి వచ్చింది. విశిష్టాద్వైతం సత్య మతమని రుజువు చేయడానికని వా రన్ని బాధలు భరించవలసి వచ్చింది.

ఉదయమయింది. మధ్యాహ్న మయింది. మరల సాయం కాలం వస్తున్నది. వా రిరువురకు రెండు మూడు దినాలుగా భోజనం లేదు. మహాపూర్ణుడే గాక కూరేశుడు గూడ చాల అలసిపోయాడు. అయినప్పటికీ అతడు మహాపూర్ణునికి పరిచర్యలు గావిస్తూనే ఉన్నాడు.

రాత్రి ఝాము మారింది. మహాపూర్ణుడు చాల బాధపడ జొచ్చాడు.

'కూరేశా !'

'ఆఁ.'

'నే నింక బ్రతకలేను. నన్ను కూర్చోబెట్టు.'

కూరేశు డతణ్ణి లేవదీసి కూర్చోబెట్టాడు.

అందుని కందుడు తోడుపడ్డాడు. కూరేశుడు విచారగ్రస్తు డయ్యాడు.

మహాపూర్ణుడు నిజంగానే చాల నీరసంగా ఉన్నాడు. అతడు కూర్చుని భగవంతుని ధ్యానం చేయసాగాడు. అంతలో అతనికి స్మారకం తప్పింది. అందువల్ల అతడు ఒరిగిపోయాడు. కూరేశు డతణ్ణి సరిగా కూర్చోబెట్టి తన కానించుకొన్నాడు.

'కూరేశా !'

'ఏమండీ !'

'రామానుజుడు కనబడితే నా ఆశీస్సు లని చెప్పు.' మహాపూర్ణునికి ఆ మాటలుగూడ తడబాటుగా వచ్చాయి. అవి చాల నీరసంగా ఉన్నాయి.

'మీ రెందు కలా అంటున్నారు ?' ఆదుర్దాగా ప్రశ్నించాడు. కూరేశుడు.

'నే నింక ఎంతకాలమో బ్రతకను. నాకు బ్రతకా లనిగూడ లేదు.' అని ఆగాడు మహాపూర్ణుడు.

కూరేశుడు మాట్లాడించినా అతడు మాట్లాడలేదు.

అతడు భగవంతుని ధ్యానిస్తున్నాడో, లేక అతనిలో లీన మయ్యాడో గూడ కూరేశునికి తెలియలేదు. ఆదుర్దాతో అతడు మహా

పూర్ణుణ్ణి తడవి చూచాడు. కదిలించి చూచాడు. అప్పటికే అతడొక కట్టెలాగా అయిపోయాడు. అతని జీవా లప్పటికప్పుడే ఎగసిపోయినవి.

మహాపూర్ణుడు మరణించాడని గ్రహించాడు కూరేశుడు. అతని కెంతో దుఃఖం కలిగింది. ఆ మహాపురుషుణ్ణి గూర్చి ఎంతో వాపోయాడతడు. ఆ అరణ్యంలో అతని ఏడుపుని వినేవారు లేకపోయారు. అతడు మహాపూర్ణుణ్ణి వదలి రెండడుగులు వేశాడు. ఆ శవం ఒరిగిపోయింది. కూరేశుని దుఃఖం కట్టలు తెంచుకొన్నది.

ఒక ఆచార్యుడు - ఒక మహాపురుషుడు వాలిపోయాడు. గగనంలో ఒక మహాతార నేల రాలిపోయింది. వైష్ణవాళి కతని అస్తమయం ఎంతో నష్టాన్ని కలిగించింది, అనుకున్నాడు కూరేశుడు.

ఎక్కడి మహాపూర్ణుడు! ఎక్కడి కులోత్తుంగుడు! ఎక్కడి అరణ్యం!—— ఇదంతా భగవంతుని చిద్విలాస మనుకొన్నా డతడు.

ఇంతకు రామానుజు దేమయ్యాడో! అతనికి భయంవేసింది. ఆ ఆచార్యుడు తన్ను పుత్రునికంటె హెచ్చుగా ప్రేమించాడు. శ్రీ భాష్యాన్ని అతడు చెబుతుంటే తాను వ్రాశాడు. ఆత్మనుగూర్చి నిర్వచిస్తున్నప్పు డతడొక నిర్వచనాన్ని చెప్పాడు. అప్పుడు తన కది అంత అంగీకారంగాలేదు. అందువల్ల తానని వ్రాయకుండా నిలిపివేశాడు. ఎందువల్ల అలా వూరకున్నావని అతడు తన్ను ప్రశ్నించాడు. అప్పుడు తానది సరిగా లేదని అన్నాడు. రామానుజుడు తాను చెప్పిన దానిని త్రోసివేయలేదు. మరల ఆలోచించి దానిని సరిగా చెప్పాడు. కాని తనమీద కోపింపలేదు. అలాటి ప్రేమమూర్తి అతడు.

రామానుజు డెన్నడూ నియంతృత్వాన్ని సహించేవాడుగాదు. ప్రశ్నించకుండా దేనినీ అంగీకరించేవాడుగాదు. అందువల్లనే అతని గురువులైన యాదవప్రకాశుడు, మాలాధరుడు అతనిమీద కోపించుకొన్నారు. అతణ్ణి అహంకారి వన్నారు. కాని అతడు భయపడలేదు. తను నమ్మినదానిని ధైర్యంతో చెప్పాడు. సత్యమని తాను నమ్మిన దానికోసం అతడు తన గురువుల్నిగూడ ఎదిరించాడు. తిరుమంత్రాన్ని

ప్రజల కందరికీ చెబుతున్నప్పుడు తనకు నరకం వస్తుందనిగూడ భయపడలేదు. తను రౌరవంలో పడినప్పటికీ ప్రజలందరూ మోక్షాన్ని అందుకొంటే చాలుననుకొన్నా డాయన. అలాటి త్యాగ మూర్తి, అలాటి ఆదర్శమూర్తి, అలాటి మహిమాన్వితుడు ఏమయ్యాడో యీనాడు?

రామానుజుడు ప్రతిపాదించిన సిద్ధాంతాలకోసం, అతని విశిష్టాద్వైత సూత్రాలకోసం ఎంతమంది బలి అవుతున్నారో? అలా బలిగావడానికి వారిని ప్రేరేపిస్తున్నదేది? ఆచార్యుని ఆదర్శమూర్తిత్వంతప్ప ఆయనే లేకపోతే ఇక వైష్ణవం ఎక్కడ నిలుస్తుంది?

మహాభాగుడైన మహాపూర్ణుడిచ్చట మరణించాడు. అతనికి దహనసంస్కారం చేయడానికిగూడ వీలులేకున్నది. తా నంధుడు. ఎటువెళ్ళాలో తనకు తెలియడంలేదు. అలాటప్పుడు తా నతనికి దహనక్రియ లేర్పాటుచేయడం అసంభవం. ఆ మహామహుణ్ణి ఎలా వదలివెళ్ళడం? అతని నేత్రాలో పీక్కు తింటాయి. అలాటి దుస్థితిలో అతని కళేబరాన్ని విడిచివెళ్ళడ మెలా? అతని కేమీ పాలు పోలేదు.

ఎంతో ఆలోచించిన తరువాత అచ్చటినుండి వెళ్ళడమే మంచిదనిపించింది అతనికి. తాను అచ్చట ఉండికూడ చేయగలిగిందేమీలేదు. అందువల్ల అతడు కడసారి కన్నీళ్ళతో మహాపూర్ణాచార్యుణ్ణి అభిషేకించి లేచి తడుముకొంటూ ముందుకు వెళ్ళాడు.

ఎంతో కష్టంతో, ఆయాసంతో, నీరసంతో కూరేశుడు వెళ్ళసాగాడు. రాళ్ళు రప్పల్లోంచి నడిచి చెట్టుచేమలంటపడి సెలయేళ్ళను, అడవులను దాటుకొని అత డేలాగో శ్రీరంగం నరిహద్దులకు చేరుకోగలిగాడు. కాని రాజభటు లతణ్ణి ఆ పట్టణంలోనికి రానివ్వలేదు. అతడువస్తే ఆ నగరంలో తిరుగుబాటు వస్తుందేమోనని కులోత్తుంగుని భయం. అందువల్ల ఆ రాజు అతణ్ణి ఆ నగరంలోకి రానివ్వవద్దని అంతకుముందే ఆజ్ఞల్ని జారీచేసి ఉన్నాడు.

రాజభటులు శ్రీరంగంలోకి రావద్దని కూరేశుణ్ణి ఆపినప్పుడతడు చాల నిరుత్సాహపడ్డాడు. కాని అంతలో ఉత్సాహాన్ని తెచ్చు

కొన్నాడు. ఒక్కసారి రామానుజుణ్ణి దర్శించి వెడతానన్నాడు. రామానుజుడు శ్రీరంగంలో లేడని, అత డెచ్చటికి వెళ్ళాడో తెలియరావడం లేదని రాజభటులు చెప్పారు. అంత అత డచ్చటి నుండి తిరుగుముఖం పట్టాడు.

# 16

## అన్వేషణ

రామానుజు డెక్కడికి వెళ్ళాడో యెవ్వరికీ తెలియలేదు. ఆయన్ని పట్టి తెమ్మని కులోత్తుంగచోళుడు తన భటుల కాజ్ఞాపించాడు. వారు శ్రీరంగానికి వెళ్ళి అచ్చట అతడు లేడని తిరిగి వచ్చారు. రామానుజుణి పట్టుకుని రానందుకు సార్వభౌముడు వారిమీద చాల కోపించాడు. ఏలాగైనా బంధించి తీసుకొని రావాలని, లేకుంటే శిక్షకు పాత్రులు కావలసి వస్తుందని వారిని బెదిరించాడు.

రాజభటులు చోళదేశమంతా తిరిగారు. ఎన్నో విధాలుగా ప్రయత్నించారు. కాని అతని జాడే తెలియలేదు. వారు నిరాశులయ్యారు.

రామానుజుడు దొరకనందుకు కులోత్తుంగునికి చాల కష్టంగా ఉంది. కోపంగా గూడ ఉంది. అంతమంది రాజభటులు, అంతమంది గూఢచారులు ఉండిగూడ ఆ ఆచార్యుణ్ణి బంధించలేక పోయారు. కడ కతని జాడనుగూడ తెలుసుకోలేకపోయారు. ఎంత అవమానం ఎంత అవమానం, ఎంత అపహాస్యం ! కులోత్తుంగుని మనస్సు కుదుటపడలేదు.

ఆలోగా త్రిపురాంతకుడు, నారనదేవుడు అచ్చటకు వచ్చారు. రాజుకు నమస్కరించారు. కులోత్తుంగుడు వారిని ఆసీనుల్ని గమ్మన్నాడు.

'కొద్దిగా అతనిజాడ తెలిసింది మహారాజా!' అన్నాడు త్రిపు రాంతకుడు.

ముడుచుకొని ఉన్న సార్వభౌముని ముఖం వికసించింది.

'అత డెచ్చట ఉన్నాడో తెలిసిందా?'

'ఇంకా తెలియలేదు. కాని తెలుసుకోవడానికి పీలున్న దవి పిస్తున్నది.' అన్నాడు త్రిపురాంతకుడు.

అతనిముఖం మరల ముడుచుకున్నది.

'రామానుజుడు మన రాజభటులు కూరేశుణ్ణి పట్టుకొని వచ్చిన నాడే శ్రీరంగాన్ని విడిచి వెళ్ళాడు' అన్నాడు త్రిపురాంతకుడు.

'ఆ విషయాన్ని తెలుసుకొనడాని కిన్నిదినాలు పట్టిందా?' కోపసూచకంగా అన్నాడు కులోత్తుంగుడు.

'ఆ తరువాత జరిగిన వృత్తాంతంగూడ చాల ఉన్నవి' అన్నాడు ప్రధాని.

చెప్పమన్నట్లు చూశాడు సార్వభౌముడు.

'కూరేశుణ్ణి మన భటులు పట్టుకొని వచ్చిందిగూడ రామాను జునికి తెలియదు. అతడు స్నానం గావిస్తుంటే కూరేశు డతవి దుస్తులు వేసుకొని రామానుజుని పేరుతో మన భటులకు దొరికి పోయాడు.'

'ఆ తరువాత?'

'తరువాత అచ్చటనుండి వెళ్ళిపొమ్మని అచ్చటనున్న ప్రధాన వైష్ణవు లతణ్ణి బలవంత పెట్టారు. మొదట రామానుజుడు వారి మాట వినలేదు. కాని ఆ తరువాత అతడు శ్రీరంగాన్ని వీడి వెళ్ళ డానికి నిర్ణయించుకొన్నాడు.'

'అతణ్ణి ప్రోత్సహించిన వైష్ణవు లెవ్వరో తెలిసిందా?'

'తెలిసింది. యజ్ఞమూర్తి, గోవిందమిశ్రుడు తక్కినవారు.'

'వారిప్పు డెక్కడున్నారు?'

'వారుగూడ ఇప్పుడు శ్రీరంగంలో లేరు. ఎచ్చటికి వెళ్ళారో తెలియదు. కాని వారిలో ఒకరుమాత్రం రామానుజుణ్ణి వెంబడించి వెళ్ళినట్లుంది.'

కులోత్తుంగుడు మాట్లాడకుండా వినసాగాడు.

'రామానుజుడు తన శిష్యునితో అళగేశుడు అనే శైవునింటికి వెళ్లాడు. అతనిభార్య కొంగుపిరాట్టి వైష్ణవ మతస్థురాలు. ఆమె వారి కాశ్రయ మిచ్చింది.'

'ఆఁ. ఏమిటి? ఒక శైవుని గృహంలోనా రామానుజుని కాశ్రయం!'

'అతడు గూడ వైష్ణవుడయ్యాడు. ఇప్పుడతడు రంగదాసు డనే నామంతో పిలువబడుతున్నాడు.

'అళగేశుడు రంగదాసు డయ్యాడా? ఎంత ఆశ్చర్యం?'

'రామానుజుడు వెళ్ళిన ప్రతిచోట ఆలాగే అవుతున్నది. అత డెలా అంతమంది నేమార్చ గలుగుతున్నాడో మరి!'

'ఎలా ఏమార్చ గలుగుతున్నారో' అన్న ప్రధాని మాట సేనా నికి నచ్చలేదు. రామానుజుని గొప్పతనం వల్లనే అత డితరుల్ని తన వంకకు త్రిప్పుకో గలుగుతున్నాడని నారనదేవుని విశ్వాసం.

'ఆ దంపతుల నేమిచేశారు?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'వారు బంధింపబడ్డారు మహారాజా!' నారనదేవు డన్నాడు.

'రామానుజు డెచ్చటికి వెళ్ళాడో వారు చెప్పలేదా?'

'ఎంతమాత్రం చెప్పలేదు.' అన్నాడు నారనదేవుడు.

'వారిని చిత్రహింస పెట్టి ఉండవలసినది, అప్పుడుగాని వారు చెప్పరు,' అన్నాడు కులోత్తుంగుడు.

'మన భటు లా పనిగూడ చేశారు. కాని వారు చెప్పలేదు. రామానుజుడు తమయింటికి వచ్చిన విషయాన్ని వా రంగీకరిస్తారు గాని అత డచ్చటినుండి ఎటువెళ్లాడో మాత్రం వారు చెప్పడంలేదు.'

'అయితే అత డక్కడనుండి ఎచ్చటికి వెళ్ళాడో తెలియ లేదా?' ఆదుర్దాతో ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'కొద్దిగా తెలిపింప' అన్నాడు నారనదేవుడు.

చెప్పమన్నట్లు అతనివైపు చూచాడు సార్వభౌముడు.

'కొంగుపిరాట్టియింటినుండి అతడు నేరుగా వహ్నిపుష్కరిణికి వెళ్ళినట్లుంది. అప్పుట అతడు తన అనుచరునితో మూడు దినా లుండగలిగాడు.'

'ఆ తరువాత ?'

'ఆ తరువాత వారు సాలగ్రామాన్ని చేరుకొన్నారు.'

'పాషండులున్న గ్రామానా ?' ఆశ్చర్యంతో అడిగాడు కులోత్తుంగుడు.

'అవును మహారాజా. అప్పుడున్న పాషండులు వారిని ఆదరించలేదు. పైగా వారిని బెదిరించారు' అన్నాడు నారనదేవుడు.

కులోత్తుంగుడు నవ్వి, 'మరి వారు పాషండులుగదా. వారికి అతని వైష్ణవం ఎలా నచ్చుతుంది ?' అన్నాడు.

'అక్కడినుండి వా రెక్కడికి వెళ్ళారో తెలియదు. మన రాజ్యాని కావలనున్న జైనరాజ్యంలోకి వారు దాటుకొన్నట్లు వార్తలు వస్తున్నవి. మన వేగులవారు ఆ వార్తలలోని నిజానిజాలను పరిశీలిస్తున్నారు. త్వరలోనే మరికొంత భోగట్టా లభించవచ్చు' అన్నాడు నారనదేవుడు.

'అంటే మన రాజ్యాన్ని దాటివెళ్ళారన్నమాట' అన్నాడు కులోత్తుంగుడు.

'అవును మహారాజా'

'అలా అతడిన్నిదినాలు మన రాజ్యంలోనే తిరుగాడుతున్నప్పటికీ మన భటులుగాని, మన గూఢచారులుగాని అతణ్ణి పట్టుకోలేకపోయారన్నమాట. అంటే మనవారి శక్తిసామర్థ్యాలందుమూలంగా మనకు తెలిసివస్తున్నాయి.' నర్మగర్భంగా అన్నాడు కులోత్తుంగుడు.

ఆ మాటలు త్రిపురాంతకునికి, నారనదేవునికి బాధను గలిగించాయి. కాని వారేమీ మాట్లాడలేదు.

'సరే, ఏలాగో ఒకలాగు అతనిజాడ తీయండి. అతడెచ్చట ఉన్నాడో తప్పనిసరిగా తెలుసుకోవాలి.' అన్నాడు కులోత్తుంగుడు ఖచ్చితంగా.

'అలాగే' అంటూ వారు నమస్కరించి వెళ్ళిపోయారు.

కులోత్తుంగు డాలోచనలో పడ్డాడు.

రామానుజుడు చోళరాజ్యాన్ని దాటి వెళుతూ గోవింద మిశ్రునితో భక్తగ్రామునికి వెళ్ళాడు.

భక్తగ్రామం జైనుల పరిపాలనలో ఉంది. ఆ రాజ్యాన్ని విఠలదేవరాయలు పరిపాలన గావిస్తున్నారు. దానినే మైసూరురాజ్య మంటారు.

రామానుజుడు భక్తగ్రామానికి వెళ్ళగానే అచ్చటిప్రజ లతణ్ణి తెలుసుకొని ఎంతో ఆదరాన్ని చూపారు. రామానుజుడు వారికందరికీ విశిష్టాద్వైతాన్ని బోధించాడు

ఆ ఆచార్యు డచ్చటనుంచి గోవిందమిశ్రునితో గూడ ఆ గ్రామాల వెంబడి వెళ్ళసాగాడు అతడు వెళ్ళినంతదూరం ప్రజ లందరూ అతని మతాన్ని స్వీకరిస్తూవచ్చారు.

రామానుజు డా విధంగా ఆ జైనరాజ్యంలో ప్రవేశించి తన ప్రభావం వల్ల ప్రజల నందరినీ వైష్ణవులుగా మారుస్తున్నాడన్న వార్త మైసూరు రాజైన విఠలదేవరాయల కందింది. అతనికి ఆగ్రహం కలిగింది. అందువల్ల అతడు తన భటుల్ని పంపి రామానుజుణ్ణి, గోవిందమిశ్రుణ్ణి తనవద్దకు రావించాడు.

రామానుజుడు చోళరాజ్యంలో ఉండేవాడని, ఆ రాజుకుబెదిరి మైసూరు రాజ్యానికి వచ్చాడని విఠలదేవరాయలకు తెలిసింది. అతణ్ణి తన రాజ్యంలో ఉంచితే తమ మతంగూడ నాశనమవుతుందని అతనికి భయంకలిగింది. అందువల్ల రామానుజుణ్ణి తన రాజ్యనుండి పంపి వేయాలనే ఉద్దేశంతో ఆ రాజు ఆయన్ని తీసుకుని రమ్మన్నాడు.

రామానుజుడు, గోవిందమిశ్రుడు మైసూరుకు తీసుకొని రాబడ్డారు. రాజప్రాసాదంలో ప్రవేశపెట్టబడ్డారు. రాజమందిరంలో

విఠలదేవరాయలు. అతని భార్య శాంతలాదేవి కూర్చొని ఉన్నారు. రాజభటు లప్పటికి రామానుజుణ్ణి, ఆయన అనుచరుణ్ణి తీసుకొని వచ్చారు. శాంతలాదేవి లేచి లోపలికి వెళ్ళబోయింది. రాయ లామె నచ్చటనే కూర్చోమని బలవంత పెట్టాడు. అందువల్ల ఆమె అచ్చట కూర్చొన్నది.

రామానుజుణ్ణి చూడగానే ఎందుకోమరి ఆ రాజుకు లేదామని పించింది. అతడు లేచి ఆ ఆచార్యునికి నమస్కరించాడు. శాంతలా దేవిగూడ ఆసనంనుంచి లేచి ఆ మహాత్మునికి చేతులు జోడించింది.

రామానుజు డా దంపతుల్ని ఆశీర్వదించాడు. ఆ రాజు రామాను జుణ్ణి, ఆయన అనుచరుణ్ణి కూర్చోమన్నాడు. వా రాసీను లయిన తరువాత తానుగూడ కూర్చొన్నాడు. ఆ తరువాత శాంతలాదేవి కూర్చొన్నది.

రామానుజుడు వెలుగులు వెలుగుతున్నాడు. ఆయన్ని చూస్తుంటే ఒక విధమైన భక్తి యేర్పడుతున్నది.

'మీ రెచ్చటనుండి వస్తున్నారు?' ప్రశ్నించాడు రాయలు.

'మీ భటులు కొనితెస్తే ఇటు వచ్చాము.' అన్నాడు రామాను జుడు.

ఆ మాట ఆ రాజు హృదయానికి తగిలింది. తా నా ఆచార్యుణ్ణి పట్టి తెమ్మంటే తన భటులు వారిని తీసుకొని వచ్చారు. ఆ విష యాన్ని మరచి మాట్లాడినందుకు కతడు చింతపడ్డాడు.

'మీరు నన్ను మన్నించాలి. మీమీద మాకేమీ క్రోధం లేదు. మేము జైనులం. మా ప్రజలు జైనులు. మీరు వారిని వైష్ణవులుగా మారుస్తుంటే, ........' అని ఆగాడు రాజు.

రామానుజుడు నవ్వాడు.

'మీరు కులోత్తుంగ చక్రవర్తి కారు గదా?' ప్రశ్నించాడు రామానుజుడు.

'నే నంత కఠినుణ్ణి కాదు. గాని నా మతంమీద నా కెక్కువ విశ్వాసమున్నది.' అన్నాడు రాయలు.

శాంతాదేవి రామానుజుణ్ణి చూడసాగింది. మెరసి పోతున్న ఆ లలాటం మీద వెడల్పైన ఊర్ధ్వపుండ్రాలు, విశాలమైన నేత్రాలు, ఆ నేత్రాలలోనుండి దూసుకొని వస్తున్న వెలుగులు. చిరునవ్వులు, ఆ నవ్వులలో వుట్టి పడుతున్న జాలి. అన్నీ అతడొక మహనీయు డనితోపింపజేశాయి ఆమెకు.

'అలా ఉండడమే మంచిది. కాని ఇతర మతాల యెడల మీకు విద్వేషమెందుకు ?' ప్రశ్నించాడు రామానుజుడు.

'నాకు విద్వేషం లేదు. కాని నా మతాన్ని నేను రక్షించు కోవాలిగదా ?' అన్నాడు రాజు.

'కులోత్తుంగునిలా మీరుగూడ మీ ప్రజల్ని అంధకారంలో వుంచా లనుకొన్నారా ? చర్చలతో నిమిత్తం లేకుండా, ఆలోచన లతో నిమిత్తం లేకుండా వారిని మూఢవిశ్వాసాల నంటి పెట్టుకొమ్మం టారా ?'

'అలా అని నేననను. కాని మతాలు మార్చుకొన్నంత మాత్రాన లాభమేముంది ?'

'మతమంటే యేమిటి ? సృష్టికి, దేవునికి, వ్యక్తికి ఉన్న సంబంధాన్ని గూర్చిన విశ్వాసం. ఆలోచించడంవల్ల, చర్చలు కొన సాగించడంవల్ల, పెద్దల అనుభవాలవల్ల, వేదవేదాంగాలను సరిగా అర్థం గావించుకోవడంవల్ల సృష్టి ఎలా జరిగింది ? జీవు డున్నాడో లేడో ? పరమాత్మ డున్నాడో లేడో ! ఉంటే వీరిద్దరికీ ఉన్న సంబంధ మేమిటి ? అనే విషయా లర్థమవుతాయి. అప్పుడు విశ్వాసా లేర్పడు తుంటాయి. అలా కలిగిన విశ్వాసాలే మతాని కాధారంగాని, ఎన్నడో ఎవరో చెప్పారు గనుక అవే నిత్యాలని. సత్యాలని అనుకోవడం తప్పు. బుద్ధుడు, మహావీరుడు, ఆదిశంకరుడు సామాన్యులు కారు. వారు ప్రసాదించిన నైతికధర్మాలను మించి, నేనేమీ చెప్పడం లేదు. కాని ఆత్మ, పరమాత్మలకు సంబంధించి వారికున్న విశ్వా సాలు నాకు లేవు. ఆ విషయంలోనే నేను వారితో భేదిస్తున్నాను,' అన్నాడు రామానుజుడు.

ఆ తరువాత బౌద్ధ, జైన, అద్వైత, శాక్తేయ, కాపాలిక మొదలైన మతాలను గూర్చి, వాటి వివరాలను గూర్చి ఆ రాజు రామానుజుణ్ణి ప్రశ్నించాడు. రామానుజు డా రాజుకు ఆ మతాలను గూర్చి చెప్పడమేగాక వాటికి, విశిష్టాద్వైతానికి ఉన్న భేదాలనుగూర్చి గూడ క్షుణ్ణంగా వివరించాడు. ఆ వివరణను విన్న తరువాత ఆ రాజుకే గాక, ఆ రాణికి గూడ రామానుజుని యెడల యెంతో భక్తి తాత్పర్యా లేర్పడినవి. విశిష్టాద్వైతం మీద అచంచల విశ్వాస మేర్పడింది.

రాజువద్ద ఒకవార ముండి రామానుజుడు బయలుదేరాడు. కాని రా జందు కంగీకరించలేదు. రాణిగూడ అందుకు సమ్మతించలేదు. వారిద్దరు ప్రతిదినం కొంతకాలం రామానుజుని బోధనలను వింటూ ఆనందింపసాగారు. ఆ బోధల్ని విని రాజు పూర్తిగా మారిపోయాడు. తన నామాన్ని విష్ణువర్ధన రాయలని మార్చుకొన్నాడు. రామానుజుణ్ణి చూడకపోతే ఉండలేకపోయాడు. శాంతలాదేవిగూడ ఆ ఆచార్యుణ్ణి భక్తితో పూజించి ఆదరించింది.

రాజదంపతు లంత ఆదరించినప్పటికీ రామానుజుని మనస్సు అచ్చట లేకపోయింది. దేశంలోకి వెళ్లి తన మతాన్ని ప్రచారం చేయా లనిపించింది.

ఒకనా డతను గోవిందమిశ్రుణ్ణి ఇలా ప్రశ్నించాడు:

'మిశ్రా! మన మెచ్చటికి వెడుదాము?'

'మీ యిష్టం వచ్చిన చోటికి.' అన్నాడు గోవిందమిశ్రుడు.

'రాజదంపతు లంగీకరించేటట్లు లేదు.'

'అవును. మనం వెడితే కులోత్తుంగుని భటు లెచ్చట మనల్ని బంధిస్తారో అని వారి భయం.'

'వారికి మనమీద ఉన్న అనురాగానికి మనం కృతజ్ఞులుగా ఉండాలి. కాని ఎంత కాలమని మన మిచ్చట ఉండగలం?'

'అది నిజమే. మీరు రాజుగారికి నచ్చజెప్పండి. మనం వెడదాము.'

ఆ మరునాడు రామానుజుడు విష్ణువర్ధనరాయలుతో తన అభీష్టాన్ని తెలియజేశాడు. మొదట రాజు అంగీకరించలేదు. కాని తరువాత అంగీకరించాడు.

రామానుజుడు గోవిందమిశ్రునితో మైసూరును వీడి వెడుతున్నప్పుడు రాజదంపతులు వారితో వచ్చి అతి భక్తి ప్రపత్తులతో సాగనంపారు. మైసూరు ప్రజ లందరు గూడ వారితో వచ్చి వీడ్కోలిచ్చారు.

రామానుజుడు వెళ్ళిన తరువాత రాజదంపతులు నిట్టూర్చారు.

మైసూరునుండి ఆచార్యుడు తిన్నగా అరణ్యాల ద్వారా వెళ్లి తొండనూరు చేరుకున్నాడు. అచ్చటి వారందరూ శైవులు, బౌద్ధులు, జైనులు. వారందరూ రామానుజుని రాకను విని ఎంతో సంతసించారు. వారప్పుడప్పుడు ఆ మహాత్ముని విజయాలను గూర్చి, అతడు ప్రతిపాదించిన వినూత్న మతాన్ని గూర్చి వింటూనే ఉన్నారు. అతడిటీవల మైసూరుకు వెళ్ళి అచ్చట రాజదంపతుల్ని వైష్ణవుల్ని గావించిన ఉదంతాన్ని గూడ విని ఉన్నారు. అందువల్ల వారు రామానుజుని కెదురేగి గౌరవ పురస్సరంగా తమ గ్రామానికి తీసుకునివచ్చారు. అచ్చట ఆయన ద్వారా విశిష్టాద్వైత మతాన్ని గూర్చి తెలుసుకున్నారు. ఆ నాటినుండి వారాయన శిష్యులుగా మారి పోయారు.

రామానుజుడు మైసూరుకు వెళ్ళి అచ్చటి రాజదంపతుల్ని వైష్ణవుల్ని గావించిన విషయాన్ని కులోత్తుంగచోళుని చారులు తెలుసుకున్నారు. దానిని తమ సార్వభౌమునికి తెలియజేశారు. తన శత్రువైన రామానుజుణ్ణి తన కప్పగించవలసిందని, లేకుంటే తనతో యుద్ధానికి సంసిద్ధంగా ఉండవలసిందని కులోత్తుంగుడు విష్ణువర్ధన రాయలుకు చెప్పిపంపాడు. అప్పటికే రామానుజుడు మైసూరును వదలివేశాడు.

కులోత్తుంగుని రాయబారులు మైసూరుకి వచ్చారు. రాజదంపతులకు తమ సార్వభౌముని సందేశాన్ని వినిపించారు. వారి కా

మాట విని చాల కోపం వచ్చింది. కాని వారా కోపాన్ని అణచుకొని ఆయ నెప్పుడో అచ్చటినుండి వెళ్ళిపోయాడని చెప్పారు. రాయ బారుల వల్ల ఆ వార్త విని కులోత్తుంగుడు విశ్చేష్టు డయ్యాడు.

రామానుజుణ్ణి ఎలా పట్టుకోవడం?

అతణ్ణి ఎలా బంధించడం?

కులోత్తుంగుని కేమీ తోచలేదు.

# 17

## అక్కసు

అది తిల్య మందిరం. ఆ మందిరంలో తిల్య, ఆమె తల్లి పముదిని, రంగాచార్యులు, తక్కిన వైష్ణవులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

'ఆచార్యుడైన మహాపూర్ణుడు మరణించాడని విన్నప్పుడు నా కెంతో దుఃఖం కలిగింది.' అన్నది తిల్య.

'అవునమ్మా. కళ్ళు తీసివేసినప్పు డా వృద్ధు డెంత బాధ పడ్డాడో! కాంచీపురంనుండి శ్రీరంగానికి వెడుతున్నప్పు డెంత యాతన ననుభవించాడో! కాని అతడు యోగి గనుక అన్నిటికీ సహించుకొని ఉంటాడు.' అన్నాడు రంగాచార్యులు.

'కూరేశు డేమయ్యాడో తెలిసిందా?'

'అతడు శ్రీరంగానికి వెళ్ళాడట. అచ్చట ఉన్న రాజభటు లతణ్ణి రానివ్వలేదట. మరి ఎచ్చటికి వెళ్ళాడో తెలియరాలేదు.'

'ఆ మహనీయుడు గూడ చాల గొప్పవాడు. మేధాశక్తిలో ఆచార్యు నంతటివాడు. వైష్ణవుల కందరికీ ఎన్ని కష్టా లొచ్చాయి!'

'వైష్ణవులకే గాదమ్మా. శైవులకు గూడ కష్టాలు వచ్చాయి. ఎవరు శైవులో, ఎవరు వైష్ణవులో కులోత్తుంగుని కిప్పుడు తెలియడంలేదు. ప్రతివారిని వైష్ణవు లనే అనుకుని వారిని బాధిస్తున్నాడు.'

'ఎందువల్ల ?'

'చిదంబరం, శ్రీరంగం మొదలైన కొన్ని చోట్ల తప్ప తక్కిన ప్రాంతాలలో వైష్ణవు లందరూ శైవులలాగా వ్యవహరించి ప్రాణాలు కాపాడుకుంటున్నారు. కాని వారు తమ వైష్ణవ తత్వాన్ని మాత్రం మానుకోలేదు. అందువల్ల అతని కెవరు వైష్ణవులో, ఎవరు శైవులో తెలియడంలేదు.'

'ఇదంతా త్రిపురాంతకుని మహిమ. ఈ విషమ పరిస్థితి కంతటికీ ఆ ప్రధానే కారకుడు. అధిరాజేంద్రుడు తన మాట వినలేదని, అతణ్ణి నాశనం చేయడానికి ఈ కులోత్తుంగుణ్ణి తీసుకొని వచ్చి చోళు డనిపించాడు. ఇప్పు డతణ్ణి ముందుంచుకొని వైష్ణవుల్ని నాశనం గావిస్తున్నాడు,' నిట్టూర్చింది తిల్య.

'ఒకరినీ, ఇద్దరినా ? వందలు, వేలమందిని నాశనం గావించాడు,' అన్నది కుముదిని.

'ఆ పాపం అతనికి తగలకపోదు,' అన్నా డొక వైష్ణవుడు.

'ఇప్పుడు రామానుజా డెచ్చ టున్నాడో ?' అంది తిల్య.

'తెలియరావడం లేదమ్మా. విఠ్ఠలదేవరాయలును విష్ణువర్ధన రాయలు గాలించి వెళ్లిన తరువాత తొండమారుకు వెళ్ళాడని, అచ్చట అన్ని మతాల వారిని వైష్ణవులుగా చేశాడని, అచ్చటనుండి యాదగిరికి వెళ్ళాడని తెలుస్తున్నది.'

'ఈ విషయాలు కులోత్తుంగునికి తెలియలేదా ?'

'ఎందుకు తెలియలేదు ? తెలిశాయి. కాని రామానుజాణ్ణి బంధించడాని కతనికి వీలు కాలేదు.'

'ఎందువల్ల ?'

'అవి పర రాజ్యాలు. అచ్చట యతని అధికారం చెల్లదు గదా !'

'అందువల్లనే గావచ్చు ఇత దూరకున్నాడు. లేకుంటే—' అని ఆగింది తిల్య.

'లేకుంటే ఊరకుండేవాడా ? ఎన్నడో ఆ మహామహుణ్ణి పట్టి బంధించి ఉండేవాడు.'

'యాదగిరిలో ఆచార్యు డేమి చేస్తున్నాడో ?' తిల్య అడిగింది.

'అచ్చట ఒక ఆలయాన్ని నిర్మింపజేస్తున్నాడని అన్నారు. వా రెచ్చట ఉన్నప్పటికి వైష్ణవ ధ్వజాన్ని ఉవ్వెత్తుగా లేపుతూనే ఉంటారు.'

'అందుకే వారు మన కాదర్శ పురుషులు,' అన్నది తిల్య.

'కులోత్తుంగు డిచ్చట వైష్ణవాన్ని బ్రతకనిస్తా డంటారా ?' ప్రశ్నించింది కుముదిని.

'అతని చేతుల్లో ఏముందమ్మా ? అంతా ఆ పరమాత్ముని చేతుల్లో ఉంది.' అన్నాడు రంగాచార్యులు.

'ఏమైనా వైష్ణవానికి గ్రహణం పట్టిందనే అనవలసి ఉంటుంది,' అన్నది కుముదిని.

'గ్రహణం ఎలా తాత్కాలికమైనదో, కులోత్తుంగుని పరిపాలన గూడ అలా తాత్కాలికమైనదేనమ్మా. మన మేమీ భయపడ నక్కరలేదు.'

అంతలో వైకుంఠం అచ్చటికి వచ్చాడు. అతడు చాల ఖంగారుగా ఉన్నాడు.

'ఏమి వైకుంఠం ! ఏమిటి అలా ఖంగారుగా ఉన్నావు ? ప్రశ్నించింది తిల్య.

'కులోత్తుంగుడు సైన్య సమేతుడై చిదంబరానికి వస్తున్నాడట. అతని సేన లీ నగరానికి చాల దగ్గరగా వచ్చాయట.' అన్నాడు వైకుంఠుడు.

కులోత్తుంగుడు చిదంబరం వస్తున్నా డనేసరికి అచ్చ టున్న వా రందరూ ఒకసారి అదిరిపడ్డారు.

'కులోత్తుంగుడా? సైన్యసమేతంగానా? ఇచ్చటికి వస్తు న్నాడా? ఎందుకు?' రంగాచార్యుడు ప్రశ్నలవర్షాన్ని కురిపించాడు.

'అవును. కులోత్తుంగుడే. పశుపతి గూడ అతనితో వస్తున్నాడట.' అన్నాడు వైకుంఠుడు.

'పశుపతా? ఎవ డతడు?' తిల్య అడిగింది.

'అతడు చాల దుర్మార్గుడు. పాషండుడు. వైష్ణవుల్ని నాశనం చేయడానికి ప్రత్యేకంగా ఉంచబడిన సేనానాయకుడు. అతడే కూరేశుణ్ణి, మహాపూర్ణుణ్ణి బంధించుకుని వెళ్ళినవాడు. మహాపూర్ణుని కళ్ళు తీయించినవాడు. సోమదేవుణ్ణి ఉరితీయించినవాడు. వైష్ణవుల తల తీయించినవాడు.'

'ఆ మాటలు విని వా రందరూ భయపడ్డారు.

'అది సరే. ఇప్పుడు కులోత్తుంగు డిచ్చటి కెందుకు వస్తు న్నాడు?'

'గోవిందరాజస్వామి దేవాలయాన్ని నేలమట్టం చేయడాని కట. వైష్ణవుల నందరినీ నాశనం చేయడానికట.'

'గోవిందరాజస్వామి దేవాలయాన్ని నేలమట్టం చేయడానికా?' కంపిస్తూ అన్నది తిల్య.

ఆ దేవుడు తిల్య కెంతో కావలసినవాడు. గోవిందరాజ స్వామిని చూడకుండా ఆమె ఒక దినం గూడ ఉండజాలదు. ప్రతి దినం అచ్చటికి వెళ్ళాలి. గానం చేయాలి. నృత్యం చేయాలి. ఆ దేవుణ్ణి బుజ్జగించాలి. నవ్వించాలి. ఆనందింపజేయాలి. లేకుంటే ఆమెకు తృప్తి ఉండదు. ఆనంద ముండదు. కాని యిప్పు డా దేవుణ్ణే నేలమట్టం చేయాలని వస్తున్నాడా, కఠినాత్ముడైన కులో త్తుంగుడు. ఇప్పుడు తా నేమి చేయాలి? తన దేవుణ్ణి ఎలా రక్షించు కోవాలి? ఆమె కేమీ తోచలేదు.

'కాంచీపురంలో ఉన్న వరదరాజస్వామి దేవాలయాన్ని పునాదులతో లోడివేశాడట. ఇప్పు డచ్చటికి వెళ్ళినవారి కచ్చట

ఒకప్పు డొక దేవాలయం ఉన్నదన్న విషయం ఏమాత్రం తెలియ రాదట.'

'ఈ విషయాలు నీ కెలా తెలిశాయి?'

'కాంచీపురంలో నా బావమరది ఒక డున్నాడు. అతడు వైష్ణవుడైనప్పటికీ. కులోత్తుంగునికి భయపడి శైవుడుగా వ్యవహ రిస్తున్నాడు. వైష్ణవుల నెన్ని కష్టాలు పెట్టినప్పటికీ అత డోర్చు కొన్నాడు గాని. వరదరాజస్వామి దేవాలయాన్ని నేలమట్టం గావిం చిన తరువాత అత డోర్చుకోలేక పోయాడు. కాని అత డేమిచేయ గలడు?

'ఒకదినం కులోత్తుంగుడు చిదంబరాన్ని గూడ నాశనం చేయ నున్నాడని విన్నాడు. అది నిజమో కాదో అనుకొన్నాడు. కాని సైన్యం సమాయత్త మవుతుండడాన్ని చూచి అచ్చటనుండి వెంటనే ఇచ్చటికి వచ్చాడు. అతడు రాగానే నా కీ విషయాన్ని చెప్పాడు. నే నా విషయాన్ని మీకు చెబుతున్నాను.' అన్నాడు వైకుంఠుడు.

'అతడు బయలుదేరిన కొన్ని దినాలకే సైన్యంగూడ బయలు దేరినట్లుంది. లేకుంటే ఇంత తొందరగా ఆ సైన్యం ఇంత దగ్గరకు రాజాలదు.' అన్నాడు రంగాచార్యుడు.

'మాటలాడడాని కిది సమయంగాదు. ఏమిచేయాలో ఆలో చించండి.' అన్నది తిల్యా కంగారుపడుతూ.

'ఏమి చేయాలి? నాశనం గావడం తప్ప నాకు గత్యంతరం తోచడం లేదు' అన్నాడు రంగాచార్యుడు.

'మనం మనదేవుణ్ణి రక్షించుకోవాలి. అతడు లేకుంటే నేను బ్రతకలేను.' తిల్యా కళ్ళు చెమ్మగిల్లాయి.

'ఈ దేవుని మీదికి వస్తేనే అత డంతం కాబొయ్యేది.' అన్నాడు వైకుంఠుడు.

'వరదరాజస్వామిని నేలమట్టం చేస్తే అత డేమిచేయ గలిగా, డిప్పుడు గోవిందరాజస్వామి ఏమైనా చేయగలగడానికి?' అన్నా డొక వైష్ణవుడు.

'నీకు విష్ణుమూర్తిలో నమ్మకం లేనట్లుంది. అతని మహిమల్ని నీవు సరిగా అర్థం చేసుకోలేదు. ఎంత దుర్మార్గునికైనా కాలం తీరాలి.' అన్నది తిల్య.

'ఏమాలోచించినప్పటికీ మనం త్వరగా ఆలోచించాలి. కొన్ని గంటలలో సైన్యం వచ్చి మన నగరాన్ని చుట్టు ముడుతుంది.

'ఇంత త్వరలో మనం చేయగలిగిన పనేమున్నది?' అన్నాడొక వైష్ణవుడు.

ఆసక్తి ఉంటే, భక్తి ఉంటే, త్యాగముంటే ఏమైనా చేయవచ్చు. మన దేవుణ్ణి మనం రక్షించుకో లేకపోతే మన ముండి మాత్రం ఏమి ప్రయోజనం?' అన్నది తిల్య.

'సైన్యాన్ని ఎదిరించి మనం చేయ గలిగిం దేమున్నది?' అన్నది కుముదిని.'

'సైన్యాన్నే గాదు, ఈ ప్రపంచమంతా ఏకమై వచ్చినా ఎదిరించగల సత్తా మన కున్నది. అందుకు కావలసిన మనస్సుండాలి. అంతే.' అన్నది తిల్య చాల ధైర్యంతో.

కులోత్తుంగుణ్ణి ఎదిరించయినా తన దేవుణ్ణి రక్షించుకోవాలనుకొన్న దామె. ఆమెలో ఏదో శక్తి నిండుకొన్నట్లయింది. ఆమె కెంతో ధైర్యం కలిగింది. తటాలున ఆమె కొక ఆలోచన తోచింది.

'వెంటనే మీ రుత్సవ విగ్రహాలను తీసుకొని వెళ్ళండి. సైన్యం వచ్చినప్పటికీ నేను వారిని దేవాలయం వద్దనే నిలిపివేస్తాను. ఆలోగా మీరు శ్రీరంగం దాటుకొని వెళ్ళిపోవచ్చు.' అన్నది తిల్య. ఆమెను చూస్తుంటే ఆమె మహాలక్ష్మిలా వెలిగిపోతున్నది. ఆమె ధైర్యం వారి కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

'అవును. అది మంచి ఆలోచనే. అలాగా చేస్తేనే మంచిది. మనం ప్రాణాలకైనా తెగించాలి.' అన్నాడు వైకుంఠం.

'సరే. అలాగే చేదాం. వెంటనే వెడదాం పదండి. ఇక వ్యవధి లేదు.' అన్నాడు రంగాచార్యులు.

తిల్య, కుముదిని తప్ప తక్కిన వారందరూ వెళ్ళిపోయారు.

సంధ్యారుణ కాంతులు సమసిపోతున్నవి.

సన్నని వెన్నెల ప్రకృతిని కౌగిలించుకొంటున్నది.

గోవిందరాజస్వామి గుళ్ళో దివ్వెలు వెలిగించబడ్డాయి.

తిల్య చక్కగా అలంకరించుకొన్నది. నవ్వుతూ ఆలయానికి వెళ్ళింది. అంతలో చోళసైన్యం చిదంబరాన్ని ఆక్రమించుకొన్నది.

తిల్య గోవిందరాజస్వామికి నమస్కరించి చిరునవ్వు నవ్వింది. ఆనందంతో పాడ నారంభించింది. పాటకుతోడుగా నృత్యం గావించ నారంభించింది. అచ్చటున్నవారు ఆ నృత్యాన్ని చూచి అలాగే నిలబడ్డారు.

ఇంతలో సైనికుల కోలాహలం హెచ్చింది. ఆ సవ్వడి విని అచ్చట ఉన్నవారు పారిపోయారు. కాని తిల్యమాత్రం అలాగే నృత్యం చేయసాగింది. ఆమె ముఖంలో భయంగాని, ఆందోళన గాని లేదు.

తిల్య గోవిందరాజస్వామిని చూడసాగింది. ఆ స్వామి దేదీప్య మానంగా వెలిగిపోతున్నాడు. అత డెన్నడూ అంత జాజ్వల్య మానంగా లేదు.

చోళ సైనికులు ఆలయప్రాకారంలో ప్రవేశించారు. వారి వెంట పశుపతి, ఆ వెనుక కులోత్తుంగుడు కూడ వచ్చారు.

తిల్య వారి రాకను గూడ గమనించలేదు. ఆమె పరవశ త్వంతో నాట్యం గావింపసాగింది.

వచ్చిన సైనికులు వచ్చినట్లుగానే నిలబడ్డారు. ఆమె నృత్యాన్ని చూస్తూ అలాగే నిలిచిపోయారు.

'ఎందు కలా నిలిచారు? లోనికివెళ్ళండి.' అన్నాడు పశుపతి.

ఆ మాటల్ని గూడ ఆమె వినలేదు. నృత్యం చేస్తూనే ఉంది.

సైనికులు లోనికి వెళ్ళబోయారు. కులోత్తుంగుడు వారి నాగ మన్నాడు.

కులోత్తుంగునికి నాట్యమంటే చాల యిష్టం. అందువల్ల అతడు ఆ సైనికుల్ని ఆగమన్నాడు. సార్వభౌముని ఆజ్ఞ అయిన తరువాత పశుపతి ఏమీ చేయలేకపోయాడు.

తిల్య నృత్యం గావిస్తూనే ఉంది. అది ఆమెకు కడసారి నృత్యంగా తోచింది. అందుకనే ఆమె మైమరచి నృత్యం గావిస్తున్నది.

కులోత్తుంగు డామె నాలాగే చూడసాగాడు. ఆమె చాల అందంగా ఉన్నది. ఆమె అంగసౌష్ఠవం నేత్రపర్వంగా ఉన్నది. ఆమె చిరునవ్వులు చిందులు త్రొక్కుతున్నవి. ఆమె గానం అతి ఆకర్షణీయంగా ఉన్నది. అందువల్ల అత డామె నాలాగే చూడసాగాడు.

పాట పూర్తయింది. తిల్య తన నృత్యాన్ని నిలిపింది. దేవునికి నమస్కరించింది. వెను దిరిగింది.

ఎదురుగా సైనికులు నిలబడి ఉన్నారు. వారి మధ్య సార్వభౌముడు కూర్చుని ఉన్నాడు. అతని ప్రక్కన పశుపతి నిలబడి ఉన్నాడు. ఇతరులు చెప్పినదాన్నిబట్టి, కిరీటాన్ని చూచి ఆ కూర్చున్న వాడే కులోత్తుంగు డనుకున్న దామె. ఇంత త్వరగా చోళసేన ఆ దేవాలయాన్ని ఆక్రమిస్తుందని ఆమె అనుకోలేదు.

కుళోత్తుంగుణ్ణి, అతని సేనను చూడగానే ఆమెకు రానున్న ప్రమాదం అర్థమయింది. ఆ దేవాలయం అంతటా సైనికులు క్రిక్కిరిసి ఉన్నారు. వెలుపలగూడ చాలమంది ఉన్నట్లుంది. అయినా ఆమె చలించలేదు.

'నీ పేరేమి?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు.

'తిల్య'

'ఎంత తీయని పేరు?' అనుకున్నా డతడు.

'నీవేమి చేస్తుంటావు?' అడిగా డతడు.

'నృత్యం చేస్తుంటాను.' అన్న దామె.

'ఎవరికోసం' అన్నాడతడు నవ్వుతూ.

'నా స్వామికోసం' అన్న దామె.

ఆమె చాల అందంగా ఉంది. ఆమె అందం అతణ్ణి ఆకర్షిం చింది. ఆమె చిరునవ్వు ముత్యాల సౌలకబోస్తున్నది.

'నీ స్వామి ఎవరు?' ప్రశ్నించాడు కులోత్తుంగుడు నవ్వుతూ.

'అతడు మీకు కనబడడు?' అన్నదామె.

'ఎందుకు కనబడడు?' ప్రశ్నించాడతడు.

'అతనిలో మీకు నమ్మకం లేదు గనుక.' అన్నదామె.

ఆమె అలా మాట్లాడుతుంటే అచ్చటనున్న సైనికులందరూ ఆశ్చర్యపడ్డారు. తమ సార్వభౌమునితో అంతధైర్యంగా మాట్లాడిన వారెవ్వరూ లేరు.

'పోనీ, ఒక పాట పాడు. నీ స్వామి విషయాన్ని మేము చూచు కొంటాము' అన్నాడు కులోత్తుంగుడు.

ఆ మాట కామెకు కోపం వచ్చింది. కాని అంతలోనే ఆమె కేదో జ్ఞప్తికి వచ్చి ఆ కోపాన్ని అణచుకొన్నది.

'అయితే పాడమంటారా?'

'పాడు' అన్నాడు కులోత్తుంగుడు.

ఆమె పాట మొదలుపెట్టింది. పాటకు తోడుగా అడుగుల్ని కదపసాగింది. మంద్రంలోనుండి ఉవ్వెత్తుగా లేచింది స్వరం. పంచమస్థాయి నందుకొన్నది. ఆమె అడుగులు వివిధగతుల్లో వర్తింపసాగినవి. ఆ పాటకు, ఆ ఆటకు, ఆమె అభినయానికి, ఆమె ప్రకటిస్తున్న హావభావాలకు ఆ మహారాజు ముగ్ధుడయ్యాడు. ఆమె అతనిమీద ఒక సమ్మోహన శక్తిని బరపింది. అతనిమీదనే గాదు. అచ్చటనున్న సైనికులందరిమీద - కడకు క్రూరకర్ముడైన పశుపతి మీదగూడ ఆమె ఆ శక్తిని ప్రయోగించింది.

వారందరూ ఆమె చూచినప్పుడు తమ్మే చూస్తున్నదని, ఆమె నవ్వినప్పుడు తమ్ముజూచే నవ్వుతున్నదని, ఆమె పిలిచినప్పుడు తమ్మే పిలుస్తున్నదని, ఆమె పొమ్మన్నప్పుడు తమ్మే పొమ్మంటున్న దని, ఆమె కోపించినప్పుడు తమ్ము చూచే కోపస్తున్నదని భ్రమపడ జొచ్చారు. వారందరూ ఆమె నృత్యప్రదర్శనాన్ని వర్ణించడంలోనే

తీనమైపోయారు. ఆ మధురమంజుల గానం, ఆ కంకణనిక్వణ స్వనం వారి వీనులను విందొనర్చి వారిని సమ్మోహితుల్ని గావించాయి.

ఆమె ఒకసారి మెల్లగా అడుగులు వేసింది. మరొకసారి వేగంగా ముందు కురికింది. ఒకసారి హంసలా నడిచింది. ఒకసారి మయూరిలా అడుగులు వేసింది. ఒకసారి లాలించింది. ఒకసారి కేలించింది. ఒకసారి నవ్వించింది. ఒకసారి కోపించింది.

ఒకపాట పూర్తయింది.

మరొకపాట మొదలయింది.

ఆ పాటగూడ ముగిసింది.

మరోపాట ఎత్తుకున్నదామె.

కొంతసేపటిలో దానిని ముగించి మరొక రాగా న్నందు కొన్నది. ప్రతిపాటకు అడుగు మార్చింది. భంగిమలు మార్చింది. అభినయాన్ని మార్చింది. హావభావ విలాసాలను మార్చింది. ఆమె పాడుతూనే ఉంది. నృత్యం గావిస్తూనే ఉంది. ఆమె ఆగలేదు. గానాన్ని ఆపలేదు. ఆగమని గాని, ఆపమని గాని యెవ్వరూ అనలేదు. అందరూ స్థాణువులలాగ నిలబడి ఆమె నృత్యాన్ని తిలకిస్తున్నారు. ఎందుకోసం వారచ్చటికి వచ్చారో ఆ విషయాన్నిగూడ వారు మరచి పోయారు.

ఏ విష్ణుమూర్తి నామోచ్చారణే వారి వీనుల్లో పడగూడదో ఆ దేవదేవునిగూర్చే ఆమె పాడుతున్నది. ఆ గోవిందరాజస్వామి స్తోత్రాన్నే ఆమె చేస్తున్నది. ఆ గోపాల కృష్ణుణ్ణే ఆమె పిలుస్తు న్నది. కాని ఆ సైనికులకుగాని, ఆ సేనానికిగాని, ఆ సార్వభౌమునికి గాని ఆ నామం కటువుగా తోచలేదు. వారానందంతో ఆ గానాన్ని వింటూ మైమరచి పోతున్నారు. వారు వచ్చి యెంతసేపు అవుతు న్నదో వారికి తోచలేదు. వారామె ముగ్ధ మోహన సౌందర్యాన్ని గాంచి తన్మయులవుతున్నారు.

సుకుమార శరీరయైన తిల్య అలసిపోతున్నది. కాని ఆమె పాడుతూనే ఉన్నది. నృత్యం గావిస్తూనే ఉన్నది. ఆమె లలాటం మీద చెమటబిందువులు ముత్యాలలో మెరవసాగినవి. కాని ఆమె అగ

లేదు. ఆమె నృత్యం గావిస్తూ గావిస్తూ అలసి మైమరచి క్రిందపడి పోయింది.

ఆమె పడిపోగానే కులోత్తుంగుడు తనకు తెలియకనే తాను లేచాడు. ముందుకు వెళ్ళాడు. పశుపతిగూడ ముందుకు వెళ్ళాడు. సైనికులతో ఆమెను తీసుకొనివెళ్ళి శ్రమ తీర్చమన్నాడు కులోత్తుంగుడు. లోనికి వెళ్ళి విగ్రహాలను విరగగొట్టమన్నాడు.

కొందరు సైనికులు తిల్యను తీసుకొని వెళ్ళారు. మరికొందరు గర్భగుడిలో ప్రవేశించారు. కాని అచ్చట విగ్రహాలు లేవు. ఒక మూల విగ్రహం మాత్రమే ఉన్నది

ఆ విషయాన్నిగూర్చి వారు పశుపతికి తెలిపారు. ఉత్సవ విగ్రహాలు దేవాలయంలో మరేచోటనైనా ఉంచబడ్డాయేమో చూడ మని పశుపతి ఆదేశించాడు. సైనికులు దేవాలయమంతా వెతికారు. కాని దొరకలేదు. ఆ విషయం కులోత్తుంగునికి తెలియజేయబడింది. ఆగ్రహోదగ్రుడయ్యాడు. నగరంలో ఎచ్చటో దాచిపెట్టబడి ఉంటా యని. వెంటనే వెళ్ళి అందరి ఇళ్ళనూ గాలించవలసిందని ఆత దాజ్ఞలిచ్చాడు. పశుపతి చాలమంది సైనికుల్ని నగరంలోనికి పంపాడు.

'పశుపతీ! ముందు ఆ మూలవిగ్రహాన్ని ముక్కలు చేయ మను. దేవాలయాన్ని పడగొట్టవచ్చును.' అన్నాడు కులోత్తుంగుడు.

సైనికులు గునపాలు, గొడ్డండ్లు తీసుకొని లోపలికి వెళ్లారు. గోవిందరాజస్వామి నవ్వుతున్నాడు. ఆ దేవుణ్ణి చూచి వారు కొంత వెనక్కు తగ్గారు. కాని పశుపతి గర్జన వింటూనే వారు ముందంజ వేశారు. ఆ మహాదేవుని విగ్రహం కొన్ని నిమిషాలలోనే ముక్కలు ముక్కలయింది. మతావేశానికి ఆ సుందర విగ్రహం ఆహుతియై పోయింది. అంతతో కులోత్తుంగుని కసి తీరలేదు ఆ విగ్రహం ముక్కల్ని తీసుకునివెళ్ళి సముద్రంలో పారవేయమన్నాడు. కొందరు సైనికు లా ముక్కల్ని పోగుచేసి వాటిని సముద్రంలో కలపడానికి వెళ్ళారు. మరికొందరు గోపురం ఎక్కి దాన్ని పడగొట్టారు.

ఆ తరువాత గుడి గోడల్ని త్రవ్వి వేశారు. ఆ మతోన్మాదుల కదొక లెక్కలో లేకపోయింది. ఆ తరువాత వారు ఆ ఆలయ ప్రాకారాలను నేలమట్టం గావించారు.

ఆలోగా నగరంలోనికి వెళ్ళిన సైనికులు ఉత్సవ విగ్రహాల కోసం చిదంబరంలోని ప్రతియింటినీ గాలించారు. ప్రతివ్యక్తినీ బెదిరించారు. అనుమానం వచ్చినప్పుడు ఆ యిండ్లలో ఉన్న వారిని చావమోదారు. కొందర్ని ముక్కలు ముక్కలుగా తరిగి పారేశారు. కాని విగ్రహాలు లభించలేదు.

అంతలో అరుణోదయమయింది. ఉదయభాను డెలా రక్త రంజితంగా ఉన్నాడో ఆ విధంగానే ఉన్నది చిదంబరంకూడా, అది ఆర్తనాదాలతోను, హాహాకారాలతోను నిండుకొన్నది, నగరమంతా బీభత్సమయిపోయింది.

సైనికులందరూ నగరాన్ని చుట్టుముట్టడంవల్ల పట్టణవాసు లెవ్వరూ అచ్చటినుండి తప్పుకొని వెళ్ళడానికి వీలుకాకపోయింది. ఎంత బందోబస్తు గావించినప్పటికీ, ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ, ఎంత బెదిరించి నప్పటికీ, ఎన్ని హత్యలు గావించినప్పటికీ విగ్రహాల జాడ తెలియలేదు.

తిల్య తన నృత్య భంగిమలతో, తన హావభావ విలాసాలతో అతులితమైన తన సౌందర్యంతో, తన గాన మధురిమతో తమ్ము మైమరపించి, తమ్ము వంచించి ఉత్సవ విగ్రహాల నెచ్చటికో చేర వేయించి ఉంటుందనే విశ్వాసం కలిగింది కులోత్తుంగునికి. అతనికి చాల కోపం వచ్చింది. వెంటనే తిల్యను బంధించమన్నాడు కులోత్తుంగుడు. ఆ విగ్రహా లెచ్చటున్నవో కనిపెట్టమని ఆజ్ఞాపించి సైన్యాన్ని తీసుకొని కాంచీపురానికి వెళ్ళాడు.

కులోత్తుంగుడు రాగానే కాంచీపురం ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. తమ దేవుడు, తమ దేవాలయం నేలమట్టమయినందుకు కళ్ళలో నీళ్ళు పెట్టుకున్నది.

# 18

## పశ్చాత్తాపం

గోవిందరాజస్వామి దేవాలయాన్ని నేలమట్టం గావించిన తరువాత కులోత్తుంగుడానందంతో కాంచీపురానికి తిరిగి వచ్చాడు. చక్రకూటాన్ని జయించినప్పుడు గాని, కాంచీపురాన్ని ఆక్రమించినప్పుడు గాని, విజయాదిత్యుణ్ణి లొంగదీసినప్పుడు గాని, మహాపూర్ణుని నేత్రాలు తీయించినప్పుడు గాని అతని కంత ఆనందం కలగలేదు. ఇక ఉన్నదల్లా శ్రీరంగనాథుని ఆలయ మొక్కటే. దానిని నాశనం గావిస్తే తన ఆశయం నెరవేరినట్లే. తన రాజ్యంలో వైష్ణవాన్ని తుడిచిపెట్టినట్లే. ఆ తరువాత తిరుపతిని తిన్నగా నిర్మూలించవచ్చు అనుకొన్నాడతడు.

చిదంబర దేవాలయం, దాని ప్రాకారాలు అన్నీ నాశనం చేయబడ్డాయని విన్నప్పుడు చోళరాజ్యంలోని వైష్ణవు లందరూ కులోత్తుంగుణ్ణి శపించారు. అతను నాశనం గావాలని మనసారా కోరారు.

కులోత్తుంగుడు చిదంబరంనుండి తన రాజధానీ నగరానికి వచ్చిన తరువాత తన ప్రధానిని పిలిచి శ్రీరంగం విషయమై సమాలోచనలు జరిపారు. అచ్చట కొంత ప్రతిఘటన రావచ్చును గనుక కొంత హెచ్చు సైన్యాన్ని పంపాలని వారిద్దరూ నిర్ణయించారు. కాని కొంత కాల మాగి పంపాలనుకొన్నారు.

చిదంబరం ఉదంతం అప్పుడే జరిగి ఉన్నది. అందువల్ల చోళ రాజ్యమంతా ఆ సంఘటనతో అట్టుడికిన ట్లుడికిపోతున్నది. కనుక కొంత వ్యవధి నిచ్చి ఆ తరువాత శ్రీరంగంమీద దాడి వెడలితే మంచిదనుకొన్నారు వారు.

ఈలోగా కులోత్తుంగుని గొంతు నొప్పి పట్టింది భిషగ్వరుల వచ్చి చూచి అదెంతమాత్రమన్నారు. త్వరగా నయం గావిస్తామన్నారు. మందు లిచ్చారు. కాని నొప్పి తగ్గలేదు. అది రానురాను హెచ్చుకాజొచ్చింది.

కొన్ని దినాలు జరిగాయి. గొంతులో ఏదో చిన్న వ్రణం లేస్తున్న ట్లనిపించింది కులోత్తుంగునికి. మరలా వైద్యులు వచ్చి చూచారు. ఎన్నో మందు లిచ్చారు. ఔషధాలు తాగించారు. కాని నొప్పి తగ్గలేదు. వ్రణం నయం కాలేదు.

ఇంతలో శ్రీరంగంమీదికి సైన్యాన్ని పంపవలసిన తరుణం ఆసన్నమయింది. కులోత్తుంగునికి కంఠంలో బాధ ఎక్కువగా ఉన్నది. అతని కేమి చేయడానికీ పాలుపోలేదు. త్రిపురాంతకుణ్ణి పిలిచి సలహా అడిగాడు. అనుకొన్న ప్రకారం జరపడం మంచిదని ప్రధాని సలహా యిచ్చాడు. లేకుంట మహారాజు భయపడ్డాడనే అపవాదు వస్తుందని, అప్పుడు వైష్ణవులు బలపడతారని అన్నాడు. వ్రణం త్వరలో తగ్గిపోతుందని ధైర్యం చెప్పాడు.

కులోత్తుంగుడు పశుపతిని పిలిపించాడు. సైన్యాన్ని సన్నద్ధం చేయమన్నాడు. పశుపతి నమస్కరించి అతని ఆజ్ఞల్ని పరిపాలించడానికి వెళ్ళాడు.

త్రిపురాంతకుడు, పశుపతి వెళ్ళిన తరువాత కులోత్తుంగుడు శయనించాడు. కాని అతనికి నిద్ర రాలేదు. అతని మనస్సులో ఏదో భయం తొంగి చూచింది. జీవితంలో అతడు భయపడడం అదే మొదటిసారి. అది అతనికే ఆశ్చర్యాన్ని కలిగించింది. అత డెన్నో యుద్ధాలు గావించాడు. ఎన్నో భయంకర సంఘటనల నెదుర్కొన్నాడు. కాని యెన్నడూ అతడు భయపడి ఉండలేదు.

కులోత్తుంగునికి పుట్టకురుపు లేచిందని కడకు భిషగ్వరులు నిర్ణయించారు. దానిని బాగుచేయడం చాల కష్టమని వారు భయపడ్డారు. కాని అది సులభంగానే నయమవుతుందని వారు సార్వ

భౌమునికి చెప్పారు. వైద్యు లెంత ధైర్యం చెప్పినప్పటికీ కులో త్తుంగునికి మాత్రం ధైర్యం కలగలేదు.

సార్వభౌమునికి పుట్టవ్రణం లేచిందన్న విషయాన్ని వైద్యులు, ప్రధాని, ఎంత రహస్యంగా ఉంచినప్పటికీ అది ఏలాగో ఒకలాగు వెలుపలికి పొక్కింది అది విని నిజమైన శైవులు చాల చింతపడ్డారు. వైష్ణవు లందరూ ఎంతో ఆనందించారు. ఇక ఆ వ్రణం నయం కాకుండా చేయమని వారు వైకుంఠునికి మొక్కు కొన్నారు.

కులోత్తుంగుని కా వ్రణం ప్రతదినం పెద్దది కాజొచ్చింది. అతనికి మాటలు గూడ సరిగా రాకున్నవి. పశుపతి వచ్చి శ్రీరంగం మీదికి వెళ్ళడాని కనుజ్ఞ ఇవ్వమన్నాడు. ఏమనారో కులోత్తుంగునికి తోచలేదు. కట్టకడకు వెళ్ళి రమ్మన్నాడు. పశుపతి నమస్కరించి వెళ్ళిపోయాడు.

శ్రీరంగంమీదికి వెళ్ళడానికి కులోత్తుంగచోడుడు పశుపతికి అనుజ్ఞ ఇచ్చాడే గాని అతని కది యేమాత్రం యిష్టంలేకపోయింది. తా నేదో పెద్ద పాపకార్యాన్ని చేస్తున్నట్టు అనిపించిం దతనికి.

గొంతులో నొప్పి మొదలయినప్పు 'డది ఏమి చేస్తుం'దను కున్నా డతడు. వ్రణం లేచినప్పు డదే నయమవుతుందని తలచాడు. అది పెద్దదవుతుంటే వైద్యు లేలాగో ఒకలాగు దానిని బాగు చేస్తా రనుకొన్నాడు. కాని అత డనుకొన్నట్లు కాలేదు. ఆ నొప్పి వ్రణమై, ఆ వ్రణము పెద్దదై, భయంకరమై గొంతునే కొరికివేస్తున్నది. మాట్లాడడానికిగూడ సాధ్యంకాకుండా పోతున్నది.

కంఠంలో వ్రణం లేచినంతమాత్రాన తన కెందు కింత బలహీనత? నడవడం గూడ చాల కష్టంగా ఉన్నది. అసలు లేచి నిలబడడానికి గూడ చాల యిబ్బందిగా ఉన్నది. ఎందువల్ల తానలా అవుతున్నట్లు?

వైష్ణవుల్ని హింసించడం వల్లనా? వారిని బాధించడం వల్లనా? అతడు కంపించాడు.

ఎంతోమంది వైష్ణవోత్తములు మరణించడానికి తాను కారకు డయ్యాడు. చోళసేనాని సోమదేవుడు అతని కళ్ళ యెదుట కనబడి నట్లయింది. అతడు చాల మంచివాడు. చాల గొప్పవాడు. ఉత్త మోత్తముడు. వైష్ణవుడనే కారణంతో అతణ్ణి తాను కాంచీపుర బహిర్ద్వారంవద్ద ఉరి తీయించాడు. ఆ సేనాని ఉరికంబంమీద వ్రేలాడుతుంటే, ప్రాణం పోక, ఉరినుండి తప్పించుకోలేక అతడు గిజగిజలాడుతుంటే చూచి తాను, తన ప్రధాని త్రిపురాంతకుడు ఎంతో సంతోషించారు. ఆనాడు వారు పొందిన ఆనందానికి మేర లేదు.

యుద్ధంలో కులోత్తుంగు డెందరినో వధించి వున్నాడు. కాని సోమదేవుణ్ణి ఉరి తీయించడానికి, యుద్ధంలో వధించడానికి భేద మున్నది. అచ్చట సాయుధులైనవారితో ముఖాముఖి పోరాడడం, పౌరుషంతో వారిమీద బడి చంపడం, అందులో తప్పులేదు. ఆలాగే సోమదేవునితోగూడ యుద్ధంలోనే అతణ్ణి తుత్తునియలు గావించి ఉండినా తనకి తప్పిదమయి ఉండేదిగాదు. కాని అతణ్ణి నిరాయుధుణ్ణి గావించి, కారాగారంలో బంధించి బలవంతంగా పట్టితెచ్చి ఉరికంబా న్నెక్కించి ఆవిధంగా చంపించడం సార్వభౌముని కెంతో బాధ వేసింది. ఆ నా డెంతో ఆనందాన్ని కలిగించిన ఆ సంఘటన యీ నా డెంతో విషాదాన్ని కలిగిస్తున్నది.

సోమదేవు డెంత గొప్పవాడు! ఎంత బలవంతపెట్టినా తనకు లొంగలేదు. తన ప్రాణాలు పోతాయని తెలిసిగూడ అతడు తనకు లోబడలేదు. తన మతంకోసం అతడు తన ప్రాణాలనే వదలు కొన్నాడు. అతడు మరణించితే మాత్రమేమి? అతడొక వీరుడు. ఒక మహాపురుషుడు. కాని తాను........

అతనికి కూరేశుడు జ్ఞాపకం వచ్చాడు. మెరసిపోతున్న అతని నెమ్మోము, ఆ ఊర్ధ్వపుండ్రాలు, ఆ విశాల నేత్రాలు, ఆ కళ్ళ

వెలుగులు అతనికి జ్ఞప్తికి వచ్చాయి. 'చావంటే భయపడే మీరు భయపడాలిగాని. అది లేని మే మెందుకు భయపడాలి?' అని అత డా నా డన్నాడు. నిజమే. కూరేశునికి మరణమంటే భయంలేదు. అందుకనే అత డా నాడు తన కళ్ళను తానే లాగివేసుకొన్నాడు. నయనాలలో రక్తం చిప్పిలుతుంటే చిరునవ్వులు చిందిస్తూ వెళ్ళి పోయాడు.

తనను, కూరేశుని పోల్చి చూచుకుంటే యెవరు ధైర్య వంతులు, .... నిజంగా ఆ వైష్ణవోత్తముడే ధైర్యవంతుడు, అత నికి సార్వభౌముడంటే భయం లేదు. మరణమంటే భయంలేదు, కాని తనకు చావంటే ఎంతో భయంగా ఉన్నది. తాను సంపా దించిన ఆ రాజ్యాన్ని, తను సాధించిన ఆ అధికారాన్ని, ఆ వైభ వాన్ని, తా ననుభవిస్తున్న ఆ భోగభాగ్యాలను అన్నిటినీ విడిచి— ఎక్కడికో - ఏ చోటికో - శాశ్వతంగా వెళ్లిపోవాలంటే తన కెంతో భయంగా ఉంది.

ఆనాడు తా నెంతో తొందరపడ్డాడు. వృద్ధుడైన మహా పూర్ణుని నయనాలనుగూడ లాగించి వేశాడు. పాపం. ఆ మహాత్ము డా బాధతో దారిలోనే మరణించాడట. అది తెలిసినప్పుడు గూడ తన మనస్సు బాధపడలేదు. కరగలేదు. పశ్చాత్తాపాన్నీ పొందలేదు. పైగా అది ఆనందడోలలలో ఊగులాడింది.

తా నీ పాపకార్యాలన్నిటినీ తన స్వార్థంకోసం చేయలేదు. శైవాన్ని ఉద్ధరించాలని చేశాడు. కాని ఆ పరమేశు డీనాడు తన్ను రక్షింపకున్నాడు. ఆ దేవదేవుడు తలుచుకుంటే అదెంత? తన వ్రణం ఎన్నడో బాగయి ఉండేది. ఆ త్రిపురారికిగూడ తనమీద దయ లేకుండా పోయింది. వైష్ణవుల యెడల, విష్ణుదేవునియెడల తా నప రాధం గావించి వుండవచ్చుగాని, శైవులయెడల శివునియెడల తాను గావించిన తప్పిద మేమున్నది? తానెందు కీ విధంగా శిక్షించబడాలి? శిక్ష ననుభవించాలి?

ఒకవేళ వైష్ణవుల శాపం తనకు గలిగిందా? సోమదేవుడు శపించాడా? కూరేశుని బాధ తనకు వచ్చిందా? ఏమో ఎవరు చెప్ప గలరు?

రామానుజు డిప్పు డెచ్చటనున్నాడో. ఆ మహాత్ముని దర్శించి అతని పాదపద్మాలమీద వ్రాలవలసింది తాను. కాని తా నా విధంగా చేయలేదు. పైగా ఆ మహాభాగుణ్ణి ప్రతిచోట వెంటాడాడు. అతణ్ణి పెట్టిన బాధలు వృథాపోతాయా?

రామానుజుడు చాల గొప్పవాడంటారు. దైవాంశసంభూతు డని వైష్ణవులంటారు. అలాటి మహాపురుషుని యెడల తానెంతో అపరాధం గావించాడు. అతడు వైష్ణవాన్ని ప్రచారం చేస్తేమాత్ర మేమి? శైవమతంలో శక్తి ఉంటే. అద్వైతతత్వవేత్తల వాదంలో బలముంటే. వైష్ణవంమాత్రం ఎలా వ్యాప్తిజెందుతుంది? తన కా మాత్రం వివేచనాజ్ఞానం లేకపోయింది. శైవం, వైష్ణవం రెండు మతాలు. ఒకదాని సరసన ఒకటి ఉండవచ్చు. మతంపేర తానెన్నో క్రూరకార్యాలు గావించాడు. ఎన్ని దారుణహత్యలకో కారకు డయ్యాడు. తన రాజ్యాన్ని శైవమయం చేయాలనుకొన్నాడు. కాని తన లక్ష్యం నెరవేరలేదు. వైష్ణవులు పైకి శైవవేషం ధరిం చారుగాని, తమ మనసుల్ని మార్చుకొన్నారా? వారి నెన్నో బాధలు పెట్టాడు తాను.

అతనిబాధ కంతులేకపోయింది. అతని పశ్చాత్తాపానికి అవధి లేకపోయింది. కాని ఆ పశ్చాత్తాపం చాల ఆలస్యంగా వచ్చింది.

కులోత్తుంగుని సైన్యం కాంచీపురాన్ని విడిచి వెడుతున్నది. అశ్వాల డెక్కల ధ్వనులు ఆకాశాన్ని అంటుతున్నవి.

కులోత్తుంగుని ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. అతడు పడకవేసి లేవలేకున్నాడు, మాట్లాడడంగూడ చాల కష్టంగా ఉన్నది.

చోళరాజు సైన్యాలు శ్రీరంగం మీదికి వస్తున్నాయని, రంగ నాథ దేవాలయాన్ని నాశనం గావించ నున్నాయని అచ్చటి వైష్ణవు

లకు తెలిసింది. ఇక భయపడి లాభం లేదనుకొన్నారు వారు. ఏ విధంగానైనా రంగనాథుణ్ణి రక్షించుకొందా మనుకొన్నారు. అవసరమైతే ప్రతివారు మొదట ప్రాకార ద్వారం వద్దనే తమ అసువుల్ని అర్పించ డానికి నిర్ణయించుకొన్నారు.

కులోత్తుంగుని మనస్సు మనస్సులో లేదు. అతడు పశుపతి కాజ్ఞ ఇచ్చాడు. అతడు సైన్యాన్ని తీసుకొని ముందుకు వెడుతున్నాడు. కొన్ని దినాలలో రంగనాథస్వామి ఆలయం నేలమట్టం కానున్నది. శ్రీరంగమంతా ధ్వంసం చేయబడ నున్నది. వైష్ణవుల రక్తధారలచేత ఆ మహా నగరమంతా అభిషేకించబడ నున్నవి. ఆ దృశ్యం కులోత్తుంగుని కంపింపజేసింది

అతని యెదుట మరొక దృశ్యం ప్రత్యక్షమయింది. అది చిదంబర దృశ్యం. గోవిందరాజస్వామి దేవాలయం. ఆ ఆలయ ప్రాంగణంలో నృత్యం గావిస్తున్న త్రిలోకసుందరి తిల్య.

ఆమె కెంత భక్తి! దేవుడంటే ఎంత అనురక్తి! ఆనాడామె తనకుగాని, తన సైన్యానికి గాని భయపడకుండా ఎంత ధైర్యంతో నిలవగలిగింది! వైష్ణవు లచ్చటి ఉత్సవ విగ్రహాలను తీసుకొని వెళ్ళినప్పుడు, ఆ విషయాన్ని తానుగాని, తన సైనికులుగాని వెంటనే తెలుసుకోవడానికి వీలుగాకుండా తన నృత్య ప్రదర్శన ద్వారా ఆమె తమ్ము మైమరపించింది.

ఆమె అందచందాలు, ఆమె నృత్యభంగిమలు, ఆమె హావభావాలు, ఆమె మంజుల మధుర గానాలు—ఆనాడు తనకెంత హాయిని గూర్చాయి! ఆమె విష్ణుమూర్తిని, ఆ గోవిందరాజస్వామిని స్తోత్రం గావిస్తున్న దనైనా తనకు తోచకుండా ఆమె నృత్య ప్రదర్శనలోనే తాను లీనమై మైమరచిపోయాడు. కాని వెనువెంటనే విద్వేషంతో ఆమెను బంధించమన్నాడు ఆమె ఆ కారాగారంలో ఎంత క్లేశం అనుభవిస్తున్నదో. ఆ సుకుమార శరీరికి. ఆ తన్వంగికి తానెంత కఠినశిక్ష విధించాడు! దానికి బదులుగా ఆ నారాయణ

మూర్తి తన కీ బాధను కలిగించాడు. బాధనేగాదు తన ప్రాణాలనే తీసివేస్తున్నాడు.

దేవుడొకడే అని, ఆత డన్ని రూపుల్లో వుంటాడని వేదాలు ఘోషించాయి. కాని తాను, తనబోటివారు శివుడు వేరని, విష్ణువు వేరని అనుకొని ఆ భేదాలకోసం ప్రజల ప్రాణాలు తీస్తున్నారు. అదెంత తప్పు! ఇన్నేళ్లగా తన కళ్లు మూతబడి ఉన్నాయి. ఈ నాడవి తెరువబడ్డాయి. కాని అందువల్ల ప్రయోజన మేమున్నది? చాల ఆలస్య మయిపోయింది. ఇక తన్ను రక్షించే వా రెవరు?

ఆ కూరేశు డెక్కడున్నాడో? మహిమాన్వితుడైన ఆ రామానుజు డే ప్రాంతంలో ఉన్నాడో? వా రిప్పుడు రా గలరా? తన్ను మన్నించగలరా! తనని ఉద్ధరించమని దేవుణ్ణి ప్రార్థించగలరా? ఆ ఔన్నత్యం వారి కుంటుంది. వా రెంతో గొప్పవారు. వారివల్ల, తానే గాదు, తనవారందరూ ఉద్ధరించబడుతారు.

తానే ఒక వైష్ణవద్వేషి. ఆ విషయంలో త్రిపురాంతకుడు తనకు తోడయ్యాడు. తన పాపకృత్యాల కన్నిటిలో అతడు గూడ భాగస్వామియై ఉన్నాడు. తాను నారనదేవుని సలహానైనా తీసుకొని ఉండవలసింది. అతడు మాత్రం శైవుడుగాడా? కాని అతడు తన లాటి, త్రిపురాంతకునిలాటి క్రూరుడు గాడు. కర్కశుడు గాడు. కంటకుడు గాడు. సేనానిగా ఉండినప్పటికీ దయార్ద్రమైన హృదయం గలవాడు. శైవు డైనప్పటికీ పర మత సహనం గలవాడు. త్రిపురాంతకుని వలలోబడి, అతని స్వార్థంకోసం, అతని ప్రాబల్యం కోసం తాను చేయరాని తప్పిదాలనన్నీ చేశాడు. కాని యీనాడు త్రిపురాంతకుడు తన్ను రక్షించగలడా?

అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

అంతలో చారుల నాయకుడైన శివమూర్తి లోన ప్రవేశించాడు. ఏలాటి పరిస్థితుల్లోనైనా, ఏలాంటి సమయంలోనైనా ద్వారపాలకు లతణ్ణిమాత్రం నిరోధించరు. అత డెప్పుడైనా సార్వభౌముణ్ణి చూడగల అధికారం అతని కుంది.

శివమూర్తి సార్వభౌముని కన్నీళ్ళనుచూచి దిగ్భ్రాంతి చెందాడు. ఆ మహారాజు చాల దీనంగా ఉన్నాడు. చిక్కి శల్యమై పోయాడు. అతని మోములో మృత్యుదేవత నృత్యం గావిస్తున్నది. ఆ ప్రేత కళను జూచి శివమూర్తి బెదురుకొన్నాడు. చాల బాధ పడ్డాడు.

'మన్నించండి మహారాజా! ఈ అసమయంలో వచ్చినందుకు నన్ను మన్నించండి. అవసరమైనది గనుక వచ్చాను.' అన్నాడు శివమూర్తి.

కులోత్తుంగు డతనివైపు దీనంగా చూశాడు.

'చిదంబరంలోని ఉత్సవ విగ్రహాలు తిరుపతి చేరుకొన్నవని తెలుస్తున్నది.'

కులోత్తుంగు డేమీ మాట్లాడలేదు. అతని నేత్రాలవెంబడి కన్నీరు స్రవింపసాగింది.

శివమూర్తి కేమి మాట్లాడాలో, ఏమి చేయాలో పాలుపోలేదు.

'ఆ విగ్రహాలను వెతికి తెమ్మంటారా? తీసుకొని వెళ్ళిన వారిని బంధించమంటారా?'

'వద్దు. వద్దు. ఆ ప్రయత్నాన్ని విరమించండి.' అన్నాడు చక్రవర్తి. అతని స్వరం చాల బలహీనంగా ఉంది.

'సరే. నమస్కృతులు.' అని చేతులు జోడించి వెళ్ళ పోయాడు శివమూర్తి.

'దగ్గరకు రమ్మనట్లుగా సంజ్ఞగావించాడు కులోత్తుంగుడు. శివమూర్తి దగ్గరకు వెళ్ళాడు.

'రామానుజు డెక్కడ ఉన్నాడో తెలిసిందా?'

'సరిగా తెలియలేదు మహారాజా. యాదగిరి వద్ద ఉన్నాడని కొందరన్నారు. ఆ తరువాత అచ్చటికి మన చారులు వెళ్ళారు. అత

దచ్చటనుండి విగ్రహాన్ని తీసుకొని రావడానికని ఉత్తరం వెళ్ళాడట అంతే ఆ మీద అతణ్ణి గూర్చిన వర్తమానమే లేదు. మన చారులు మాత్రం అతనికోసం యాదగిరిలోనే వేచివున్నారు. అచట పెద్ద వైష్ణవాలయం నిర్మించబడింది.

'చారుల్ని వచ్చి వేయమనండి. ఆ మహాత్ముణ్ణి గూర్చి వెతక వద్దనండి. మన రాజ్యంలోనికి రావడాని కతనికి సంపూర్ణ స్వాతంత్ర్య మున్నదని సాటించండి.'

'అతడు నమ్మతాడా మహాప్రభూ !'

'నమ్మనీ. నమ్మకపోనీ. మన కర్తవ్యమది.'—కులోత్తుంగు డాగి అతికష్టంతో యిలా అన్నాడు. 'నారనదేవుణ్ణి తీసుకొనిరా.'

'అలాగే' అంటూ శివమూర్తి వెళ్ళిపోయాడు.

కులోత్తుంగుని బాధ హెచ్చుగాజొచ్చింది. అత డా బాధను భరించలేక పోయాడు. అతని శరీరమంతా లాగజొచ్చింది ప్రతి అణువు వేదనతో అలమటింప సాగింది. అత డోర్చుకోలేక అటూ యిటూ పొరలుతున్నాడు. కాని బాధ తగ్గలేదు.

నారనదేవుడు వచ్చాడు.

'మహారాజా !' అని పిలిచాడు.

కులోత్తుంగు డతనివైపుకు తిరిగాడు.

సార్వభౌము డెంతో పాలిపోయి ఉన్నాడు.

'వైద్యుల్ని పిలిపించమంటారా ?'

'అవసరం లేదు.' అతని స్వరం చాల బలహీనంగా ఉన్నది.

అతణ్ణిచూచి నారనదేవుడు భయపడ్డాడు.

కులోత్తుంగు డొక ప్రేతంలా కనబడుతున్నాడు.

'మరి—' ఆగాడు నారనదేవుడు.

'తిరిగిరమ్మని పశుపతికి ఆజ్ఞల్ని పంపండి. బంధించబడిన వైష్ణవుల నందరినీ విడుదల చేయించండి. వైష్ణవుల మత స్వాతంత్ర్యాన్ని ప్రకటించండి.' అన్నాడు కులోత్తుంగుడు.

'ప్రధానితో చర్చించారా మహారాజా?' ప్రశ్నించాడు నారన దేవుడు.

'అవసరంలేదు. ఇది నా ఆజ్ఞ. ఈ ఆజ్ఞను త్రిపురాంత కునికి గూడ తెలియజేయండి.' అన్నాడు కులోత్తుంగుడు.

'అలాగే' అన్నాడు నారనదేవుడు.

'మరొక్క విషయం. బంధించబడిన తిల్యాను ఇచ్చటికి తీసు కొని రమ్మనండి. ఆమె గానం వినాలని వుంది. ఆమె నృత్యాన్ని తిలకించాలని ఉంది. మరణించే ముందు ఆ అదృష్టాన్నైనా కలుగ జేయండి.' అన్నాడు కులోత్తుంగుడు. అతని కన్నీరు కాలువలు గట్టింది. అదిచూచి నారనదేవునికళ్ళుగూడ చెమ్మగిల్లాయి.

నారనదేవుడు వెళ్ళాడు.

కులోత్తుంగుని పరిస్థితి విషమింపజొచ్చింది. అతడు తిల్య కోసం ఆదుర్దాతో ఎదురు చూస్తున్నాడు.

అంతలో త్రిపురాంతకుడు వచ్చాడు.

'మహారాజా!' ప్రధాని పలకరించాడు.

కులోత్తుంగు డతనివైపు చూచాడు.

'వైష్ణవుల నందర్నీ వదలిపెట్టమని, వారికి మత స్వాతంత్ర్యం ప్రకటించమని మీ రాజ్ఞ ఇచ్చారా?' అడిగాడు త్రిపురాంతకుడు.

అవునన్నట్లుగా చూచాడు కులోత్తుంగుడు.

'ఎందుకలా చెప్పారు?'

కులోత్తుంగుడు మాట్లాడలేదు.

'మీ రింతవరకు చేసినప్రయత్నం వృథా అయిపోతుంది. శైవం వేల కలసిపోతుంది.' అన్నాడు త్రిపురాంతకుడు.

మహారాజు మాట్లాడలేదు.

మీరలాచేస్తే వైష్ణవులందరూ మిమ్మల్ని అపహసిస్తారు. వారు తమ ప్రతీకారాన్ని తీర్చుకొంటారు.' అన్నాడు త్రిపురాంతకుడు.

'అది నా ఆజ్ఞ. దానికి తిరుగులేదు. మరణించనున్న నన్ను వారేమి చేయగలరు?' అన్నాడు కులోత్తుంగుడు తన శక్తి నంతటినీ కూడ దీసుకొని.

నారనదేవుడు తిల్యాను తీసుకొని వచ్చాడు.

తిల్యాను పరికిస్తూనే ఆ ప్రభువు కెక్కడలేని బలమొచ్చింది. ఆత డామెవైపు తిరిగి—

'తిల్యా, ఒకసారి ఆ గోవిందరాజస్వామిని గూర్చి గానం చేస్తావా? నీ ముగ్ధ మోహన మంజుల గానాన్ని నాకు వినిపిస్తావా?' అని ప్రశ్నించాడు.

త్రిపురాంతకుడు నిర్ఘాంతపోయాడు. ఆ మాట లంటున్నది కులోత్తుంగుడేనా? అనిపించిం దతనికి.

సార్వభౌముని కళ్ళలోనుండి కన్నీటి బిందువులు రాలజొచ్చినవి. ఆ స్థితిలో ఉన్న సార్వభౌముణ్ణి తిలకించినప్పు డామెగూడ స్తబ్ధురాలయింది.

'తిల్యా! నేనంటే కోపమా! నన్ను మన్నించు. నే నెన్నో ఘోరాలు చేశాను. ప్రాణాలు విడిచే ముందు నేను చేస్తున్నప్రార్థన యిది. ఒకసారి ఆ దేవదేవుని గూర్చి పాడు. నీ మధుర గానం విని నేను కళ్ళుమూస్తాను.'

ఆ మాటలు విని ఆమె మనస్సు గూడ బాధ పడింది. ఆమె కంఠం ఎత్తి పాడసాగింది. పాటతో అడుగుల్ని కలిపింది.

ఆమె మృదు మధురగానం కులోత్తుంగుని కెంతో ఆనందం కలిగిస్తూ ఉన్నది. ఆమె నృత్యం అతనికి తన్మయతను చేకూరు స్తోంది.

ఆమె గోవిందరాజస్వామిని గూర్చి స్తోత్రం చేయసాగింది. ఆ స్తోత్రం కులోత్తుంగుని హృదయంలో అమృతాన్ని చిలికింది. అత డా గాన రసాస్వాదనలో మైమరచి పోతున్నాడు. అతని నయ నాలముందు తిల్య, కూరేశుడు, సోమదేవుడు, మహాపూర్ణుడు, వేలాది వైష్ణవులు, గోవిందరాజస్వామి అందరూ కనబడజొచ్చారు.

తిల్య గానం చేస్తూనే ఉన్నది. నృత్యం గావిస్తూనే ఉన్నది. ఆమె ఆ నా డేవిధంగా గోవిందరాజస్వామిఆలయంలో భక్తిప్రవ త్తులతో తన్మయత్వం జెంది గానం జేసిందో, నృత్యం గావించిందో ఆవిధంగానే ఆనాడు గూడ ఆమె తన గానామృతాన్ని ఒలికించింది. తన నృత్యాన్ని ప్రదర్శించింది.

అచ్చట ఉన్న నారనదేశుడు, త్రిపురాంతకుడు, సేవకులు అందరూ ఆమె నాలాగే చూస్తూ నిలబడిపోయారు.

కులోత్తుంగుని కళ్ళు తిరగసాగినవి. తా నెచ్చటికో ఎగిరిపో తున్న ట్లనిపించిం దతనికి. అత డాలాగే కళ్ళు మూసుకొన్నాడు. అంతే. అతడు మరల కళ్ళు విప్పలేదు.

కాని తిల్య ఆ విషయాన్ని గమనించలేదు. ఇతరులు గూడ ఆ పరిస్థితిని గుర్తించలేదు. వారందరూ తిల్య గానమాధురిలో మునిగి తేలుతున్నారు.

తిల్య పాట ఆపింది. అడుగు నిలిపింది.

కులోత్తుంగుని వైపు చూచింది.

కాని ఆతడు తిరిగి చూడలేదు.

ఇక చూడలేడని ఆమెకు తరువాతగాని తెలియలేదు.

# 19

## పరిసమాప్తి

*కులోత్తుంగుని మరణానికి చోళ రాజ్యమంతా సంతసించింది. వైష్ణవులే గాక శైవులుగూడ చాలమంది సంతసించారు. అతని కాలంలో ఉన్న నియంతృత్వం, నిరంకుశ పద్ధతి తొలగిపోతాయని ఆనందించారు.*

కులోత్తుంగుని ఆజ్ఞ ప్రకారం వైష్ణవులకు మత స్వాతంత్ర్యం ప్రకటించబడింది. శైవులమధ్య, వైష్ణవులమధ్య, ఇతరమతాల మధ్య పరిపాలనా విషయాలలో ఎలాంటి వివక్షతా చూపబడదని కులోత్తుంగుని తరువాత రాజ్యానికి వచ్చిన విక్రమచోళుడు ప్రకటించాడు. ఆ ప్రకటనతో చోళరాజ్యంలో మునుపున్న ఉత్సాహం, ఉద్వేగం పెల్లుబికినవి. ప్రజాస్వామ్యవిధానం తిరిగి నెలకొన్నది.

చోళరాజ్యంలో మతస్వాతంత్ర్యం ప్రకటించబడిన వెంటనే తిరుపతిలో ఉన్న వైష్ణవులు రామానుజుణ్ణి తీసుకొని రావడానికి బయలుదేరారు. చిదంబరంనుండి దొంగతనంగా తెచ్చి ఉంచిన గోవిందరాజస్వామి ఉత్సవ విగ్రహాలను తిరుపతిలోనే ప్రతిష్ఠించాలని అనుకొన్నారు. దానికి తగిన వాడొక్క రామానుజుడేనని, అతని రాకకోసం వారు ఎదురుచూడసాగారు.

రామానుజుడు తొండనూరు నుండి యాదగిరికి వెళ్ళాడు. వెడుతూ వెడుతూ దారిలో ఎందరినో వైష్ణవులుగా మార్చివేశాడు. అగ్రవర్ణాలవారేగాక పంచములుగూడ ఆయన మతాన్ని పుచ్చుకొన్నారు. ఆయన వర్గాలకు, కులాలకు వ్యతిరేకంగా ప్రచారం గావించాడు. అస్పృశ్యతకు వ్యతిరేకంగా దక్షిణ భారతదేశంలో మొట్టమొదటిసారిగా ప్రచారం గావించినది శ్రీ రామానుజులే. ఆ

వర్ణంవారికి శ్రీవైష్ణవులు అని పేరు పెట్టాడు. పంచములలో చాలమందికి వేదవేదాంగాలు నేర్పాడు. అందువల్లనే అతనికి సామాన్యజనంలో చాల ప్రతిష్ఠ వచ్చింది.

యాదగిరికి వచ్చిన తరువాత ఆయన అచ్చట ఒక విష్ణుదేవా లయాన్ని నిర్మించాడు. కాని దానికి తగిన విగ్రహం అచ్చట లభించ లేదు. రామప్రియ విగ్రహం కావాలని ఆయన ఎంతో ప్రయత్నిం చాడు. కాని అది ఎచ్చటా దొరకలేదు. అది ఢిల్లీలో లభించవచ్చు నని కర్ణాకర్ణిగా విని ఆ పట్టణానికి వెళ్లాడు. ఆ రోజుల్లో అచ్చట ఒక ముస్లిం రాజు పరిపాలన గావిస్తున్నాడు. అతని కుమార్తెవద్ద రామవిగ్రహమున్నది దానితో ఆమె ఆడుకొంటూ ఉన్నది. దాని నామె ఎప్పుడూ తనవద్దనే ఉంచుకొంటున్నది. ఆ బాలిక శయనించి నప్పుడుగూడ ఆ విగ్రహాన్ని తన ప్రక్కనే పెట్టుకొని నిద్రిస్తున్నది.

రామానుజుడా రాజు నా విగ్రహాన్ని ఇమ్మని అర్థించాడు. కాని ఆ బాలిక దాని నివ్వడాని కంగీకరించలేదు. అందువల్ల ఆ ముస్లిం రాజు ఆమె నేలాగో సమ్మతింపజేసి ఆ విగ్రహాన్ని ఇవ్వవలసి వచ్చింది. రామానుజుడు దానిని తీసుకొని యాదగిరికి వచ్చాడు. ఆ విగ్రహాన్ని అచ్చట ప్రతిష్ఠించాడు. ఆ సమయంలో గొప్ప ఉత్సవం జరుపబడింది. ఆ ఉత్సవంలో అన్ని వర్గాలవారు, అన్ని వరాలవారు పాల్గొన్నారు. పంచములు గూడ ప్రాకారం లోపలికివచ్చి ఆ విగ్రహ ప్రతిష్ఠాపనను తిలకించారు.

తిరుపతినుండి వచ్చిన వైష్ణవులు గూడ ఆ ఉత్సవానికి వచ్చారు. వారు చిదంబరంలోని గోవిందరాజస్వామి ఆలయ విధ్వంసనాన్ని గూర్చి, కులోత్తుంగుని మరణాన్ని గూర్చి మత స్వాతంత్ర్య ప్రకటనను గూర్చి రామానుజునికి నివేదించారు. తిరు పతికి వచ్చి చిదంబరంనుండి కొనిరాబడిన గోవిందరాజస్వామి విగ్రహాలను ప్రతిష్ఠించవలసిందని వేడుకొన్నారు.

'కూరేశు డెచ్చట ఉన్నాడు?' ప్రశ్నించాడు రామానుజుడు.

'శ్రీరంగాని కావల నున్న ఒక గ్రామంలో ఉన్నాడు.' అన్నారు వారు.

'మహాపూర్ణుడు మరణించాడట గదా ?'

'అవును.' అన్నారు వారు.

రామానుజుని కళ్ళల్లో నీళ్ళు తిరిగినవి.

'నాకోసం కూరేశ మహాపూర్ణులు చాల కష్టాలు పడ్డారు. కడకు మహాత్ముడైన మహాపూర్ణుడు ప్రాణాలనుగూడ పోగొట్టు కొన్నాడు.' విచారంగా అన్నాడు రామానుజుడు

'ఎంతమంది వైష్ణవులు నిర్బంధింపబడ్డారో, ఎంతమంది చంపివేయబడ్డారో లెక్కలేదు. అదొక విషాదకరచరిత్ర' అన్నారు వైష్ణవులు.

'చిదంబరంనుండి ఉత్సవ విగ్రహాలెలా కొనిరాబడ్డాయి ?' ప్రశ్నించాడు రామానుజుడు.

'తిల్య అనుగ్రహంవల్ల సైన్యం వచ్చేలోగా ఆ విగ్రహాలను అక్కడినించి తరలించడానికి నిర్ణయించబడింది. అలాగే విగ్రహా లను తీసుకొని కొందరు ముందుగా వెళ్ళారు. ఆతరువాత సైన్యం వచ్చింది. వారు లోనికి వెళ్ళనివ్వకుండా తిల్య తన గానమాధు ర్యంతో, తన నటనా కౌశలంతో వారిని ఆలయ ప్రాంగణంలోనే నిలిపివేసింది. సార్వభౌముడైన కులోత్తుంగుడుగూడ ఆమె నృత్య ప్రదర్శన కాశ్చర్యపడి ఆలాగే చూస్తూ ఉండిపోయాడు. ఆలా చాల వ్యవధి గడచిపోయింది. ఈలోగా విగ్రహాలను తీసుకొని బయలు దేరినవారు నగరాన్ని వీడి చాలదూరం వెళ్ళారు. ఆవిధంగా ఆ విగ్రహాలు తిరుపతికి కొనిరాబడినవి !'

'మూలవిగ్రహ మేమయింది ?'

'అది ముక్కలు ముక్కలు చేయబడింది. ఆ ముక్కలు సముద్రంలో విసరివేయబడ్డాయి.'

'మతోన్మాదం ఎంతవరకు వెళ్ళింది ?'

'కులోత్తుంగుడు మరణిస్తున్నప్పుడు చాల పశ్చాత్తాప పడ్డా డని చెబుతారు. పుట్టకురుపుతో చాల బాధపడ్డాడు.' అన్నారు వారు.

'పశ్చాత్తాప మెవరికైనా మంచిదే. అది అతని హృదయాన్ని పవిత్రం గావించి ఉంటుంది.'

'మీరు తిరుపతికి వచ్చి ఆ విగ్రహాలను ప్రతిష్ఠించవలసి ఉన్నది.'

'నా కభ్యంతరం లేదు. కాని ముందుగా ఆలయ నిర్మాణం జరగాలిగదా.'

'ఆలయ నిర్మాణ మెంతపని? మీరు వస్తే దానంతట అదే పూర్తవుతుంది.'

తిరుపతికి రావడానికి రామానుజుడు సమ్మతించాడు.

వైష్ణవులు మహాపురుషుణ్ణి తీసుకొని తిరుపతి వెళ్ళారు. రామానుజుని రాకను విని తిరుపతిలో ప్రజలందరూ గుంపులు గుంపులుగా చేరారు. అతనికి నమస్కరించి అతని పాదాలమీద వ్రాలారు.

రామానుజుడు తిరుపతికి రాగానే ఆలయనిర్మాణం విషయమై ఆలోచింపసాగాడు. నారాయణవనం రాజైన యాదవరాయలు వద్దకు వెళ్ళి గోవిందరాజస్వామి దేవాలయాన్ని నిర్మింపుమని అతణ్ణి ప్రోత్సహించారు. ఆ రాయలుగూడ అందు కంగీకరించాడు.

ఆలయనిర్మాణ మవుతుంటే రామానుజుడు వైష్ణవమతబోధ చేయసాగాడు. చోళరాజ్యమందున్న ప్రధానివైష్ణవులందరూ వచ్చి రామానుజుణ్ణి చూచి వెళ్ళారు.

గోవిందరాజస్వామి ఆలయం పూర్తయింది. రామానుజుడా ఉత్సవ విగ్రహాలను ప్రతిష్ఠించాడు. తిల్యవల్ల ఆ విగ్రహాలు తీసుకొని రాబడినందువల్ల దానికి 'తిల్య గోవిందరాజస్వామి ఆలయ'మని పేరు పెట్టారు. ఆవిధంగా తిల్య నామం స్థిరస్థాయి అయింది.

తిరుమలలో తన పనిని పూర్తిగావించుకొని రామానుజుడు కాంచీపురానికి వచ్చాడు. అచ్చట ఒక వనంలో విడిశాడు.

కులోత్తుంగుడు మరణించిన వెంటనే కాంచీపురం పూర్తిగా మారిపోయింది. శైవులుగా జీవిస్తున్న వైష్ణవులు తిరిగి నిర్భయంగా వైష్ణవులుగా జీవింపసాగారు. రామానుజుడు కాంచీపురానికి రావడం వారి కెంతో ఆనందాన్ని కలిగించింది.

రామానుజుడు కాంచీపురానికి వచ్చినప్పుడు వైష్ణవులే గాక శైవులుగూడ అతని కెదురేగి నమస్కరించారు. అప్పుడు రామానుజుడు వారినందరినీ ఆశీర్వదించాడు. శైవులు, వైష్ణవులు అన్నదమ్ములలాగ జీవించవలసిందని చెప్పాడు. మతం విద్వేషానికి కారణం కాకూడదని చెప్పాడు. తమ తమ విశ్వాసాలననుసరించి ప్రజలు జీవించుచున్నారు. తాము నమ్మిన దేవునియందు భక్తి చాల అవసరమన్నాడు. అతని బోధలు అన్నిమతాలవారికి ఆనందాన్ని కలిగించాయి.

రామానుజుడు వనంలో విశ్రాంతి తీసుకొంటున్నప్పుడు అతని వద్దకు విక్రమచోళరాజు, ప్రధాని త్రిపురాంతకుడు, సేనాని నారనదేవుడు తదితరులు వచ్చి పరామర్శ గావించారు.

కులోత్తుంగుడు మరణించిన తరువాత త్రిపురాంతకునిలో గూడ కొంత మార్పు వచ్చింది. తన అంతిమదశలో సార్వభౌముడు పడిన వేదన నతడు గుర్తించాడు. అందువల్ల అతని కఠినత్వం కొంత తగ్గింది. అతని హృదయం మెత్తబడింది.

రామానుజుడు కాంచీపురానికి వచ్చినప్పుడు ఆ మహానుభావుణ్ణి చూడా మనిపించిం దతనికి. అందువల్లనే అతడు రాజు గారితోగూడ ఆ మహాపురుషుణ్ణి చూడడానికి వచ్చాడు. రామానుజుడు విక్రమచోళుణ్ణి ఆశీర్వదించాడు. పక్షపాత రహితంగా రాజ్య పాలన గావించమన్నాడు.

కాంచీపురం నుండి రామానుజుడు శ్రీరంగానికి వెళ్ళాడు. రామానుజుడు శ్రీరంగం వస్తున్నాడని తెలియగానే మతాలతో నిమిత్తం లేకుండా శ్రీరంగవాసు లందరూ ఆ పట్టణాన్ని చక్కగా అలంకరించారు. రంగనాథస్వామి ఆలయాన్ని దేదీప్యమానంగా

అలంకరించారు. రామానుజుడు వచ్చినంతనే ప్రజలందరూ జయ జయ ధ్వానాలు గావించారు.

దాశరథి రామానుజుని కెదురేగి ఛత్రాన్ని పట్టాడు. గోవింద మిశ్రుడు, అతని తమ్ముడు ఆయనకి వింజామరలు వీచారు. ఆయన్ని ప్రజలు శ్రీరంగమంతా ఊరేగించారు.

ఆ తరువాత రామానుజుడు రంగనాథస్వామి దేవాలయానికి వెళ్ళాడు. అచ్చట ఆ స్వామికి సాష్టాంగపడి నమస్కరించాడు. ఆ మీద ఆయన లేచి వెనుదిరిగాడు. తిరిగినంతనే ఆయన కెదుట కూరేశుడు కనబడ్డాడు.

కూరేశుడు తడుములాడుతూ తన్ను వెదుక్కొంటూ వస్తున్నాడు. అతని కళ్ళు గుంటలుపడి ఉన్నాయి. అతడు చిక్కిపోయి ఉన్నాడు. కాని అతని పెదవులు చిరునవ్వుల్ని చిందిస్తున్నాయి. రామానుజు డట్లు రక్షించబడినందు కత డెంతో సంతోషించాడు.

శ్రీరంగంలోనికి రాగూడదని కులోత్తుంగుని భటు లన్న తరువాత కూరేశుడు సుందరపర్వతం వద్దకు వెళ్ళిపోయాడు. అక్కడే తన జీవితాన్ని గడపసాగాడు. కాని కులోత్తుంగుడు మరణించాడని, మత స్వాతంత్ర్యం ప్రకటించబడిందని, రామానుజుడు తిరుపతికి వచ్చి గోవిందరాజస్వామి విగ్రహ ప్రతిష్ఠాపన చేశాడని, కాంచీపురం మీదుగా శ్రీరంగానికి వస్తున్నాడని విని అతడు తన ఆశ్రమం నుండి తిన్నగా ఆ నగరానికి వచ్చాడు. కాని ఆ జన సమూహంలో రామానుజుణ్ణి కలుసుకోలేక పోయాడు. ఎలాగో శ్రమపడి రంగనాథస్వామి ఆలయం వద్దకు వచ్చాడు. లోన ప్రవేశించి రామానుజుని కెదురుగా వెళ్ళాడు.

కూరేశుణ్ణి చూడగానే రామానుజునికి దుఃఖం పొంగి పొరలింది. అతడు తన బంగారు శిష్యుణ్ణి, తన ప్రాణదాతను ఎంతో ఆప్యాయతతో కౌగిలించుకొన్నాడు. ఆ కౌగిలింతలో ఎంతో ప్రేమ, ఎంతో అనురాగం, ఎంతో కృతజ్ఞత ఉట్టి పడ్డాయి. కూరేశు డా ప్రేమ బంధంలో ఎంత సేపున్నాడో అతనికే తెలియలేదు.

ఆ గురుశిష్యుల ప్రేమానుబంధాన్ని చూచి అచ్చటున్న ప్రజ అందరూ ఆనందాశ్రువుల్ని రాల్చారు.

మహాదేవుడగు రంగనాథుడు ఆ గురుశిష్యుల్ని. అక్కడ ఉన్న భక్తజనాన్ని ఆశీర్వదించాడు.

* * *

యామునాచార్యులు సమాధి చేయబడుతున్నప్పుడు శ్రీరామానుజాచార్యు లే ప్రతినను బూనాడో ఆ ప్రతిన ఆ నాటికి నెరవేరింది. ఆయన తాను ప్రతిజ్ఞ చేసిన విధంగా అన్నిటినీ నెరవేర్చాడు. క్లిష్టతరమైన బ్రహ్మసూత్రాలకు గూడ విశిష్టాద్వైత తత్వపరంగా శాశ్వతత్వాన్ని సంతరించుకొన నున్న మహత్తరమైన భాష్యాన్ని పూర్తి గావించాడు. యామునాచార్యుడు కలలుగన్న విశిష్టాద్వైత తత్వానికి రూపకల్పన గావించి ఆ తత్వాన్ని దేశమంతటా ప్రచారం గావించి కృతకృత్యు డయ్యాడు. ఆ తత్వాన్ని, దానిని నమ్మిన ప్రజల్ని సమూలంగా నాశనం చేసి వేస్తానని పట్టుబడిన నిరంకుశ ప్రభువైన చోళరాజుగూడ అస్తమించాడు. అస్తమిస్తూ తాను గావించిన క్రూర కిరాతక కృత్యాలకు పశ్చాత్తాపపడి ప్రతివారు తమ కిష్టమొచ్చిన మతాన్ని అవలంబించడానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించాడు. అందువల్ల పూజ్యులైన యామునాచార్యుడు దర్శించిన ఆ విశిష్టాద్వైత మతానికి తిరుగులేక పోయింది. అంతకంటె అతనికి కావలసిన దేమున్నది ? ఆ భావమే ఆయన మనస్సులో ఎంతో ఆనందాన్ని గలిగించింది. ఆ ఆనందంతో ఆయన ఆ దేవదేవునికి కృతజ్ఞతా సూచకంగా నమస్కరించాడు.